




ముఖచిత్రం : దీపానంది

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

# చందమామ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 44 నవంబర్ 1981 సంచిక 5

1981-82 సంవత్సరాన్ని "పోతన సంవత్సరం"గా పరిగణించాలని, యీ సంవత్సరంలో పోతన పంచ శతజయంతి ఉత్సవాలను రాష్ట్రమంతటా జరిపించాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించినట్టు ముఖ్యమంత్రి ప్రకటించారు.

ఈ ఉత్సవాలలో పోతన జన్మస్థలమైన బమ్మెరలో స్మారక భవనాన్ని నిర్మించడమూ, వరంగల్‌లో స్మారక భవన సముదాయాన్ని నిర్మించడమూ, ఆ భవన స్తంభాలపై పోతన పద్యాలను చెక్కించడమూ, తిరుమల తిరుపతి దేవస్థానం సహాయంతో ఒక స్మారక సంచికను ప్రకటించడమూ జరుగుతుంది. టీక, వ్యాఖ్యాన సహితంగా పోతన భాగవతాన్ని తిరుపతి దేవస్థానం వారు ప్రచురిస్తారట. పోతన చిత్రంతో ప్రత్యేక తపాలా బిళ్ళను జారీచేయించమని కేంద్ర ప్రభుత్వాన్ని అర్థించడం జరుగుతుంది ఒంటిమిట్టలోని కోదండరామస్వామి దేవాలయ సముద్ధరణ జరుగుతుంది. పరిశోధకులకు ప్రయోజనకరంగా పోతన భాగవతపు పాఠాంతరణలన్నిటిని సేకరించి భద్రపరచడం జరుగుతుంది. విశ్వవిద్యాలయాలతో సంప్రతింపులు జరిపి, పోతన పీఠాన్ని ఏర్పాటుచేయడం జరుగుతుంది. తిరుపతి దేవస్థానం సహాయంతో పోతన విగ్రహాన్ని తయారు

చేయించడం జరుగుతుంది. యూనివర్శిటీలలోను, కాలేజీలలోను పోతనను గురించి, పోతన కవిత్వాన్ని గురించి గోష్ఠులు జరుగుతవి. పోతనకు సంబంధించిన గ్రంథాలు, చిత్రాల ప్రదర్శనలు ఏర్పాటు చేయబడుతవి. చిత్తూరు నాగయ్య పోతనగా నటించిన ఫిలిమును రాష్ట్రమంతటా ప్రదర్శించడానికి ఏర్పాట్లు జరుగుతవి

వరంగల్‌లో ఒక వీధికి పోతన పేరు పెట్టడం జరుగుతుంది.

పై చెప్పిన కార్యక్రమాలన్నీ బాగానే వున్నాయి. ఆఖరు కార్యక్రమం మాత్రం అర్థంలేనిది. ప్రతి యింటా పరిచితమైన, గౌరవింపబడుతున్న పేరు బమ్మెర పోతన్నది. ఆ పేరు ఒక వీధికి పెట్టడం అసందర్భంగా వుంటుంది. కనీసం పోతన ఏ వీధిలో నివసించాడో స్పష్టంగా తెలిసినట్లయితే, అయిదు వందల ఏండ్ల తరువాతనైనా, ఆ వీధికి బమ్మెరపోతన వీధి అని పేరు పెడితే అర్థంవుంటుందేమో కాని, ఈనాడు వెతికివెతికి ఏదో ఒక వీధికి ఆ మహనీయుని పేరు పెట్టడం అర్థంలేని పని. తెలుగు సాహిత్యాకాశంలోని ఒక ఉజ్వలతార అయిన బమ్మెరపోతనామాత్యుని పేరు చిరస్థాయిగా నిలబెట్టడానికి, అయన పేరును ఒక రోడ్డుకో, ఒక వీధికో పెట్టడమా ? రోడ్డు పేరు, వీధిపేరు, సందు పేరు తనపేరుతో లేకుండానే పోతన పేరు అయిదు వందల ఏండ్లపైగా నిలబడ లేదా ? ఒక రోడ్డుకో, ఒక సందుకో అయన పేరు పెట్టకపోతే, ఇంతటితో అయన పేరు మాయమైపోతుందా ? అలా అనుకోవడం పొరపాటు.

భాగవతం పూర్తిగా భక్తిరస ప్రధానమైన గ్రంథమే అయినా, భక్తిభావాలు పూర్తిగా లేనివారు కూడా పోతన భాగవతాన్ని చదువుతున్నారు. చదివారు. శ్రీకృష్ణుని నిర్యాణాన్ని అర్జునుడు ధర్మరాజుకు చెప్పడమూ, గజేంద్రమోక్షమూ, రుక్మిణీ కల్యాణమూ, ప్రహ్లాద చరిత్ర, బలిచక్రవర్తి దానమివ్వడము, కృష్ణ లీలలు మొదలైన కథలను చదివినప్పుడు, ఆనందాశ్రువులతోనో, ఆవేదనాశ్రువులతోనో కళ్లు చెమ్మగిలగా, కళ్లు తుడుచుకోనివారు అరుదు. భారతములోని పద్యాలను కంఠస్థం చేసుకోనివారు చాలా తక్కువ.

పోతన జీవితవిశేషాలు తెలిసినవారు చాలా తక్కువ మంది. గోష్ఠులద్వారా, పోతన జీవితగాథలకూ, పోతన కవిత్వంలోని విశిష్టతకూ ప్రచారం కలిగించడం మంచి పనే. పోతన భాగవతాన్ని టీకాతాత్పర్య సహితంగా అచ్చువేయించి, అందరికీ అందుబాటులో వుండే ధరకి లభ్యంచేయడం మంచి పనే. పోతన

జన్మస్థానంగా నిర్ణయించబడిన బమ్మెరను ఆదర్శగ్రామంగా ప్రకాశింపచెయ్యడం మంచిపనే.

తిరుపతి దేవస్థానం సహాయంతో పోతన విగ్రహాన్ని తయారుచేయించడానికి ప్రయత్నించడం సమంజసమైన పనికాదు. పోతన రూపు ఎవరికి తెలుసు ? ఏదో ఒక రూపును తయారుచేయించి, అదే పోతన స్వరూపం అనుకోమనడం, యీ ఇరవయ్యో శతాబ్దంలో చేయతగిన పనికాదు. పోతన గ్రంథాలను చదివేవారు, తమతమ భావాలను బట్టి పోతన రూపును ఊహించుకోవచ్చును. లేదా ఊహించుకోకపోవచ్చును. పోతన రూపును ఊహించుకోనంత మాత్రాన, ఆ మహనీయుని పట్ల ఉండవలసిన గౌరవం ఏమాత్రం తగ్గదు. పోతనకు లేని రూపును కల్పించి ఒక ప్రతిమను తయారుచేయించడం, యీనాడు అవసరమైన పనిగాదు.

అలాగే పోతన పేరును రోడ్డుమీదకు లాగడం. రోడ్డు పేరు లేకపోతే పోతన పేరు వుండదా !

ఈ రెండు విషయాలను, పోతన ఉత్సవాలను జరిపే కమిటీవారు ఆలోచించి తగు నిర్ణయానికి రాగలరని మా ఆశ.

———

# నవంబర్ నెల యువ

# భావ పరిచయ పోటీ

**బహుమానము రూ. 25-00**




ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి

గమనిక : వ్యాఖ్యలు పోస్టుకార్డుపై వ్రాసి అక్టోబరు 24 వ తేదీలోగా పంపవలెను.

# జరుగుతున్న చరిత్ర

మీనాక్షీపర్యానికి విరుగుడు దొరికింది.

అదే సత్పదయం. ఇందులో మన పూర్వ సంస్కృతి ఎంత ఉన్నతోన్నత శిఖరాలను అందుకున్నదో తెలుస్తున్నది ఒక్కొక్క మతం వెనక వున్న సంస్కృతి తనలోని దోషాలను తొలగించుకుని మానవత్వం దృష్ట్యా ఎదిగి, ఎదిగి వస్తే, కడకు మతాలన్నీ మనవే ననే భావం వ్యాప్తమై, సర్వ మానవ ధర్మం ఒకటి ప్రపంచాన వికసించడానికి ఎంతో కాలం పట్టదు. అందువలన విజ్ఞులైన మన హితైషులు, ఆవేశాలు-కార్పణ్యాలు వీడి మనుషులను కలిపే మార్గాన్ని ఎంపికచేసుకోవడానికి మనకు హితబోధ చేస్తున్నారు. మతాలను కలపడం, మతాలను మార్చడం కాదు మన కర్తవ్యం.

* * *

కల్లోలానికి మతమే కారణం కాదు అన్ని ప్రదేశాలలో; కొన్నింట రాజకీయం గందరగోళాన్ని సృష్టిస్తుంది. కంపూచియా గొడవ అటువంటిది. అందరు ఎర్రటివారే. దాని మీద అధికారం కావలెనని కాంక్షించే రష్యా, చైనాలు రెండూ గొప్ప ఎర్రటిరాజ్యాలు. దాని ప్రక్కన వుండే వీత్నాం రష్యాకు సన్నిహితం. తన మీదికి కంపూచియా దూకుడుగా వస్తున్నదని ఆరోపించి, రష్యా సాయంతో కంపూచియాలోకి వీత్నాం ప్రవేశించి, తన కనుకూలమైన రాజ్యాన్ని స్థాపించింది. దానిని తలక్రిందులు జేసి, కంపూచియా తనకు అనుకూలమైన రాజ్యం క్రిందకు తెచ్చుకోవలెనని చైనా విశ్వప్రయత్నం చేస్తున్నది. కంపూచియాలోకి వీత్నాం ప్రవేశం చైనా ప్రక్కనవున్న అనేక రాజ్యాలకు ఇష్టం లేదు. ఈ సందిగ్ధావస్థలో, పూర్వం కంపూచియాను పరిపాలించి- రాజరికాన్ని బుద్ధిపూర్వకంగా వదలి- ప్రజాదరణ పొంది అధ్యక్షపాలనసాగించిన మాన్యశ్రీ దినదిరోత్తమ సింహనాయకుడు మళ్ళీ రంగంలోకి వస్తే, రష్యా, చైనాలకు, అలీన రాజ్యమండలికి, రష్యా అభిమానులకు, చైనా అభిమానులకు అందరికీ సమ్మతమైన రాజ్యం కంపూచియాలో ఏర్పడి- వీత్నాం, కంపూచియా జగడం తీరిపోయి- రష్యా, చైనాల 'అంతర్యుద్ధం' ఆగిపోతుందని అనుకున్నారు.

కాని, కథ అడ్డం తిరిగింది. సింహ

మండి జగన్నాథం

నాయకుణ్ణి అటుదిప్పి ఇటుదిప్పి విసిగించారు. అలీనం కంటె అమెరికన్ పక్షమే నయమనే అభిప్రాయాన్ని ఆయన వెలిబుచ్చేవరకు పరిస్థితి విషమించింది. ఇతరమైన రెండు శక్తులతో కలిసి ఆయన కంపూచియా ప్రభుత్వాన్ని పోటీగా నిర్మాణం చేయడానికి పూనుకున్నాడు. ఇందుకు చైనా ఆశీర్వాదం వున్నదని ఆయన వెల్లడిచేశారు.

ఇంతా జేసి, ఆఖరున ఒక మాట అన్నాడు. "చైనా, అమెరికా, సోవియట్ యూనియన్-ఈ మూడురాజ్యాలు కలియ విదికంపూచియాసమస్యపరిష్కారంకాదు."

అనగా, ప్రస్తుతానికి, కొందరిని కల్పుకుని చైనా సాయంతో పోటీ ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసుకుని, ఆ పిమ్మట రష్యా, అమెరికాలకు సైతం ఆమోదయోగ్యం కాగల రాజ్యాన్ని కంపూచియాలో స్థాపించగలననే ఆత్మవిశ్వాసం ఆయనకు వున్నది కాబోలు!

మన మీద మాత్రం విసురు ఆయన పోలేదు. భారతదేశం స్వతంత్ర రాజ్యం గనక ఇప్పుడు కంపూచియాలో వుండే రాజ్యాన్ని గుర్తించింది_ అది ఆ రాజ్యపు ఇష్టం_ నాకది అంగీకారం కాలేదు, అది వేరే విషయం_ అంటూ ఆయన వ్యాఖ్యానించి ముగించాడు.

* * *

LDC అంటే లోయర్ డివిజన్ క్లర్క్ కాదు_ లీస్ట్ డెవలెప్డ్ కంట్రీ అంటే చాలా తక్కువ అభివృద్ధిపొందిన దేశం అని అర్థం. ఇటువంటి దేశాలు ఖండ ఖండాలలో, మన బంగ్లాదేశ్‌తో సహా, ముప్ఫయి వున్నవి. ఇందులో 21 దేశాలు ఆఫ్రికాలో వున్నవి.

సంపన్న సీమలు బడుగుదేశాలకు సాయపడే పద్ధతి ఒకటి వున్నది. కాని, అది అనుకున్నంత ఫలితాన్ని ఇవ్వడం లేదు. ఇప్పుడు సాయం రాజకీయాలకు, వ్యూహాలకు అనుకూలంగా అందించవలెననే కొత్త అభిప్రాయం అమల్లోకి వస్తున్నది. ఇటువంటి అడ్డంకులు ఎన్ని వున్నా, ఎట్లయినా సరే, 30 LDC దేశాలకూ వృద్ధికివచ్చే అవకాశాన్ని కల్పించవలెనని ఐక్యరాజ్యసమితి (United Nations) పూనుకున్నది. ఈ పంక్తులు వ్రాసే సమయంలో పారిస్ (ఫ్రెంచి రాజధాని)లో ఈ చర్చలు జరుగుతున్నవి.

ఇవి ఫలప్రదమైతే మునుపటికంటె నాల్గింతలు సాయం 1990వరకు ఈ దేశాలకు అందుతుంది దాని ఫలితాలను 1982, 1984, 1986, 1988లో సమీక్షిస్తారు. పరోపకారబుద్ధి లేకపోతే, ఈ ప్రపంచంలో బలహీనులకు నిల్వ నీడే వుండదు.

* * *

ఐక్యరాజ్యసమితి ఇంకొక మంచి పని చేసింది. సెప్టెంబర్ మూడవ తేదీన సమితి అత్యవసర సమావేశం జరిగింది. అది సర్వసభ్య సమావేశం. హాజరు 122.

అందులో 117వోట్లు దక్షిణాఫ్రికాను వెలివేస్తూ ఏకగ్రీవంగా పడ్డాయి. అయిదు మాత్రం పడలేదు.

నమీబియా అనే చిన్న 'నల్ల' సీమ విముక్తికై ఐక్యరాజ్యసమితి కృషి జేసింది. ఆ సీమకు, కాలంనాడు 'ధర్మకర్త'గా చేయబడిన దక్షిణాఫ్రికా మొండికి తిరిగింది. దాని ఫలితమే ఈ సమావేశం. ఇందులో ఈ నిర్ణయం. ఆఫ్రికాలో నైరుతి దిశన దక్షిణాఫ్రికా సమీపాన నమీబియా వునికి.

జాత్యహంకారపు రాజ్యావికి దక్షిణాఫ్రికాలో కూడా రోజులు దగ్గర పడినవి. దేశంలోని 'నల్ల'వారు అనేక త్యాగాలకు సిద్ధమై తమ మెజారిటీ పాలనను ఆ దేశంలో తెచ్చుకోవలెనని గట్టిగా పోరాడుతున్నారు. ఆ పోరాటాన్ని రక్తపుటేరులలో ముంచి అణగద్రొక్క వలెనని ఇప్పటి శ్వేతవర్ణ 'తెల్ల' పరిపాలకులు పూనుకున్నారు. కావి, వారికి పూనిక నెరవేరడం కల్ల.

* * *

పోలాండ్ కథ ఆఖరు అధ్యాయంలోకి వచ్చింది. ప్రభుత్వం, పార్టీ, కార్మిక స్వతంత్రసంస్థ కలిసి కృషిజేసి దేశాన్ని గట్టెక్కించుకోవడమే తరువాయి; కావి, ఆ శక్తుల మధ్య పొందిక ఇంకా కుదిరినట్లు లేదు. 'ఇంకా ఎందుకయ్యా, ఆందోళన' అని కార్మికసంస్థనాయకుడైన Lech Walea (వానాన్సా), అని పలుకుతారు)ను అడిగితే, ఆ 38 ఏండ్ల వయసు గల ధీరుడు అన్నాడు.

"రాజ్య శక్తి మాకు అవసరం లేదు. కావి, అధికార్లు ప్రజాసేవ సరిగా చేస్తారని అందరికీ నమ్మకం కలగాలి."

ఇంతకు ముందు జరిగిన కార్మిక స్వతంత్ర సంస్థ సమావేశంలో రాజ్య శక్తిని స్వాధీనంచేసుకోడానికి కార్మికులు ఉద్యుక్తులవుతున్నట్లు వార్త అందినవి. దానిమీద, ఆందోళనతో కూడిన సోవియట్ రాజ్య తదితర సీమల వ్యాఖ్యలు వెల్వడినవి కావి, వానాన్సా చేసిన ప్రకటనసుబట్టి చూస్తే, పూర్వపు వార్త అతిశయోక్తి అలంకారాలతో కూడుకున్నదని మనం భావించవలసి వున్నది.

వానాన్సా ధీరపురుషుడు, కావి నెమ్మది గలవాడు. ఇంతకంటె తీవ్రవాదులైన సాహసికులది పైచేయి అయితే కార్మిక స్వతంత్ర సంస్థ దుస్సాహసం చేయవచ్చునని కొందరు పరిశీలకులు అన్నారు. కావి, రెండు వర్గాలవారు ఒక అగ్రిమెంటుకు వచ్చినట్లున్నది. అందరూ కలిసి, శాంతియుతంగా పోరాడవలెనని తీర్మానించుకున్నట్లు వానాన్సా ప్రకటనలోని ఈ అంశాలు తెలియజేస్తున్నవి:

"మా పోరాటం గట్టిగానే సాగుతుంది. అందుకు మేము సిద్ధమవుతున్నాం. మేమందరం కలిసివుంటేనే, సంయుక్తంగా- శాంతియుతంగా మేము జేసే

పోరాటం నెగ్గుతుంది. అందువల్లనే, విభేదాలు కొన్ని వున్నప్పటికీ, ఐక్యతకై నేను పాటుపడుతున్నాను. మంచి పోలిష్ సీమ నిర్మాణం మా ఆశయం. కాపిట లిజం మాకు పనికిరాదు. అటువంటి విధానా లేవీ మాకు గిట్టవు. పోలిష్ అవ సరాలను అవి తీర్చలేవు. అప్పుజేసి జీవనం సాగించి పోలాండ్ దెబ్బ తిన్నది. మా దేశంలో మేమే యజమా నులమై పరిస్థితిని దిద్దుకోడానికై పూను కున్నాము. అధికార్ల తప్పులన్నీ ఎత్తి చూపించినాము. ఇకముందు ఏం చేద్దాం అని అధికార్లను అడుగుతున్నాం. మా మహాసమావేశంలో టెలివిజన్, రేడియో వారలను మేము రానివ్వలేదు. వాటిని వినియోగించుకోవడంలో మా సలహా సంప్రదింపులు అవసరమని అన్నాము. అది కాదంటే, వద్దు పొమ్మన్నాము."

వాలెన్సా మార్గం ఫలించి, అధికార్లు-స్వతంత్ర కార్మిక శక్తియులు సమాధాన పడి దేశాన్ని ఆర్థికమైన సంకటంలో నుంచి తప్పించగలరని ఆశిద్దాము.

కోర్కెల సాధనకై అతి శాంతియు తంగా సమరం సాగించిన ఇటీవలి దృష్టాంతాలు, రెండే; అస్సాం, పోలాండ్ ! గాంధీ మళ్ళీ బ్రతికి వచ్చాడు !

* * *

న్యూట్రాన్ బాంబు ఇప్పుడు ఇద్దరికి కావలసి వచ్చిందని వినికిడి. రీగన్ (అమెరికా అధ్యక్షుడు) దానిని చేస్తానంటే, 'ఇంత అన్యాయమా' అని రష్యా నాయకుడు బ్రెజ్నేవ్ బిగ్గరగా అరిచాడు. ఇతరులు కూడా న్యూట్రాన్ బాంబు నిర్మాణాన్ని విరమించుకుంటే మంచిదని సలహా యిచ్చారు. రీగన్ పట్టు వీడలేదు. ఇప్పుడు బ్రెజ్నేవ్ ఆ మార్గాన్నే అనుసరించబోతాడని తెలుస్తున్నది. న్యూట్రాన్ బాంబులోని 'గడ్డిలో మెల్ల' ఏమంటే, బిల్డింగులు భద్రంగా వుంటవి మనుషులే మాయమవుతారు. చదువరులకు ఈ సంగతి ఇదివరకే పరిచయమై వున్నది.

ఇంతలో అమెరికా మాజీ అధ్యక్షుడు కార్టర్ ఒక టోక్యో (జపాన్) సమా వేశంలో మాట్లాడుతూ అన్నాడు: "ప్రపంచంలో కనిపించే ఆందోళన అంతా రష్యా సృష్టి అని భావించడం తప్పు." అమెరికా వల్లనే ముప్పు వచ్చి పడుతున్నదని రష్యా ప్రచారం చేయవల సిన అవసరం వుండదు- రీగన్ (ఇప్పటి అమెరికా అధ్యక్షుడు) ఆ తప్పును గ్రహిస్తే !



# విమర్శకుడు

మల్లిక్

అద్దాల పెద్ద హాలు. ఆహూతులైన పెద్దలందరూ అక్కడ కుర్చీలలో కూర్చున్నారు. వారిలో చాలామంది నవలా రచయితలూ, కథకులూ, కవులూ, సాహితీవేత్తలూ ఉన్నారు. అక్కడ ఒక ప్రఖ్యాత నవలా రచయితచే రచింపబడిన ఒక నవల గురించి చర్చ జరుగుతూంది. ఆ పుస్తక చర్చలో ప్రముఖ రచయితలు కొందరు పాల్గొన్నారు. చర్చ చాల ఇంటరెస్టింగ్‌గా ఉంది. అందరిదీ ఒక్కటే అభిప్రాయం. ఆ నవల ఒక ప్రయోగాత్మకమైనది. రచయిత కూడా చక్కగా రాశాడా నవలని. సన్నివేశ చిత్రణ బ్రహ్మాండంగా ఉంది. ప్రయోగాత్మకమైన నవలలు మన తెలుగు రచయితలు రచించరు అని ఎవ్వరూ అనకుండా చేసిందీ నవల అన్నారందరూ. మొత్తానికి ఆ నవల గురించి అందరు ఉపన్యాసకులూ మంచి అభిప్రాయాన్నే వెలిబుచ్చుతూ చక్కగా విమర్శిస్తూ ఉపన్యసించారు.

చిట్టచివరి ఉపన్యాసకుడు లేచి నిల్చున్నాడు. అందరికీ వ్యతిరేకంగా అతను ఉపన్యసించాడు. అది చెత్త నవలన్నాడు—ప్రయోగం పేరుతో నవలంతా అసహజంగా రాశాడు రచయిత అన్నాడు. రచయితకు తాను నవలకై తీసుకున్న ఇతివృత్తం గురించిన జ్ఞానం చాలా పరిమితమైనదని అన్నాడు. ఇంకా మాట్లాడితే అలాంటి నవలలు తను నెలకి పది రాయగలనని అన్నాడు.

"అలాగయితే ఇప్పటికి మీరు ఎన్ని నవలలు రాశారు ?" ఎవరో విసుగుపుట్టిన మనిషి జనంలోంచి అరిచాడు.

ఆ వ్యక్తి తన ఉపన్యాసం ఆపి గొంతు వినవచ్చిన దిక్కు తిరిగాడు.

"నేను విమర్శకుడిని... నవలా రచయితను కాను...." అన్నాడు ఎర్రగా చూస్తూ ఆ విమర్శక చక్రవర్తి. ●

## రచయిత(త్రు)లకు మనవి

మీరు పంపే కథానికలకు తగినంత స్టాంపులు (కవరు గాని) జతపరచి పంప ప్రార్థన. స్టాంపులు (కవరు) జతపరచని కథానికలు తిరిగి పంపబడవు.

వాసిరెడ్డి సీతాదేవి

# అగ్నిశిఖ

సీరియల్

ఈ సంచికనుంచి ప్రారంభం.



# సృష్టిలో తీయనిది

మాచర్ల హేమ మనోహర్

వారం రోజులనుండీ ఎడతెరిపిలేకుండా పడుతోంది మంచు. ఎక్కడచూసినా మంచు. తెల్లగా అతితెల్లగా స్వచ్ఛంగా మంచు. అందుకే కాబోలు ఈ ఇంగ్లీషు వాళ్ళు అతి తెల్లదనానికి "స్నో వైట్" అంటారు.

తెల్లని పూరేకులు రాలినట్లుగా మంచుకురుస్తూంటే, రోడ్లు, ఇళ్ళకప్పులు మంచులో కప్పబడి తెల్లగా మెరుస్తూంటే చెట్లనిండా మంచుకురిసి ఆ తెల్లదనంలో మంచి అక్కడక్కడా ఆకుపచ్చ రంగు తొంగిచూస్తూ వింత అందంతో శోభిస్తుంటె, సృష్టిలో ఎన్నెన్ని చిత్రమైన అందచందాలో అన్పించింది.

ఆరోజే కాస్త మంచు కురవడం ఆగిపోయింది. అయినా రోడ్లమీద మంచు అంతా ఫ్రీజ్ అయి గడ్డకట్టి కాలుపెడితే జర్రున జారుతోంది. గ్లాస్ విండోలోంచి ఫుట్‌పాత్‌లపై జర్రుజర్రున జారుకుంటూ డాన్స్‌చేస్తున్నట్లుగా నడుస్తున్న జనాన్ని చూస్తూంటే నవ్వాగలేదు.

కాని నేనూ వెళ్ళాలి షాపింగ్‌కు. ఇంట్లో అత్యవసరమైన వస్తువులు తెచ్చుకోవాలి. ఒక్కసారిగా "ఇండియా" గుర్తొచ్చి మనసంతా దిగులుగా తయారయ్యింది. అక్కడైతే పనిమనిషైనా ఉంటుంది సహాయం చేయడానికి. ఈ దేశంలో ఎంత ధనవంతులైనా సరే

ఎవరిపనులు వారే చేసుకుంటారు. కనీసం ఏ చిన్న సహాయం చెయ్యడానికి కూడా ఎవరూ ఉండరు. మావారి కెప్పుడూ వేళాపాళా లేకుండా రాత్రింబగళ్ళూ హాస్పిటల్, పేషంట్లతో సరిపోతుంది, ఏ రెండువారాలకో ఒక్క వీకెండ్ తప్ప. ఇక నాకెలాగూ తప్పదు ఈ ఇద్దరు పిల్లలనూ తీసుకుని షాపింగ్ కెళ్ళడం అనుకుంటూ బయల్దేరాను.

అంత పెరకు గ్లాస్‌విండోలోంచి చూస్తూ ప్రకృతి అందాలకు విస్మయ పడుతూ ఆనందించిన నేను ఆ మంచులో నడుస్తూ- ఒకచేత్తో మా "స్మిత" పుష్ చేర్ నెట్టుతూ, ఒకచేత్తో జారుతూపడుతూ లేస్తూన్న మా "వంశీ" చేయిపట్టుకు నడిపిస్తూ ఆ అందమైన మంచుని తిట్టు కుంటూ, చిరాకుపడుతూ నడవసాగాను. ఎలాగో త్వరగా షాపింగ్ ముగించుని తిరిగివచ్చి తలుపు తాళంతీస్తూ "అమ్మా పిల్లీ" అని అరిచిన మా స్మిత అరుపుకు ఉలిక్కిపడి చూశాను. నిజంగానే దాని పుష్‌చేర్ ప్రక్కగా స్నోలో తెల్లని చిన్నిపిల్లిపిల్ల చలికి వణుకుతూ ముడుచు కుని కూర్చుని ఉంది. పాపం ఎంతసేపటి నుంచి అలాఉందోకాని దాని బూరంతా నిక్కబొడుచుకుని రేగి ఉంది.

"అమ్మా! పాపం చలిలో ఏల కూర్చుందో మనం ఇంట్లోకి తీసి కెళ్దామా?" అడిగాడు వంశీ. వాడి తెలుగుభాషా పరిజ్ఞానానికి నవ్వుకుంటూ సరేనన్నాను.

పిల్లిపిల్లను హీటర్ దగ్గరగా కూర్చో బెట్టి ఓ ప్లాస్టిక్‌గిన్నెలో కాసిన్ని పాలు పోస్తే ఆత్రంగా త్రాగింది. అప్పుడు కాని దాని నోట్లోంచి మెల్లగా మాత రాలేదు. మా పిల్లలిద్దరూ కుతూహలంగా దాన్నే గమనిస్తూ కూర్చున్నారు. చిన్ని పిల్లిపిల్ల తెల్లగా ముద్దుగా ఉంది. ఎక్కడినుండి వచ్చిందో ఏమోగాని మాచుట్టుప్రక్కల ఎవ్వరూ సాయంత్రం వరకూ దానిగురించి వెతుకుతున్న వైన మేమీ కన్పించలేదు. ఆ రాత్రి పిల్లల రూమ్‌లో ఓ మూలకు చిరుగులుపడ్డ పాతదుప్పటి మడతలుపెట్టి దానిపై పిల్లిని పడుకోబెడితే బుద్ధిగా నిద్ర పోయిన పిల్లినిచూస్తే చాల ఆశ్చర్యంగా అన్పించింది. "ఇంగ్లీషువాళ్ళు పెంపుడు జంతువులంటె ప్రాణం పెడ్తారు. కన్న బిడ్డలకన్నా మిన్నగా ప్రేమతో పెంచు తారు. అంత చిన్న పిల్లిపిల్ల మా ఇంట్లోకూడా అంత క్రమశిక్షణతో మెది లిందంటె అందులో వింత ఏమీ లేదన్పించింది.

ఓ రెండు రోజులు పాపం అరుచు కుంటూ ఇల్లంతా వెతుకుతూ తిరిగింది. బహుశ తన యజమానికోసమేమో? మా వంశీ, స్మితలకు పిల్లితో ఆడుకోవ డానికి మంచి కాలక్షేపంగా దొరికింది. వంశీ ఇంట్లో ఉన్నంతసేపు, స్కూలు నుండి రాగానే ఒక్కక్షణం వదలకుండా పిల్లితో ఆడుకునేవాడు. స్మిత మాత్రం

దాన్ని కొట్టడం, తోకపట్టి లాగడం లాంటివి చేసేది. ఎంత చెప్పినా వినేది కాదు. కాని వాడు స్కూలుకు వెళ్ళేం తర్వాత స్మిత పిల్లిని ఏమనకుండా చూడడం పెద్ద తలనొప్పిగా తయారయ్యింది నాకు. అక్కడికీ చుట్టుపక్కల అందరినీ అడిగాను ఆ పిల్లి ఎవరిదో? తెలిస్తే చెప్పమని. కాని వారంరోజులైనా ఎవరూ రాలేదు పిల్లికోసం.

ఒకరోజు మధ్యాహ్నం వంటగదిలో అంట్లుకడుగుతున్న నాకు పిల్లిపిల్ల దీనంగా అరవడం విన్పించింది. త్వరగా చేతులు కడుక్కొని వెళ్ళిచూస్తే పిల్లిపై దిండువేసి దానిపై కూర్చొనుంది స్మిత. పాపం పిల్లిపిల్ల బాధగా దీనంగా అరుస్తోంది. పట్టరాని కోపంతో ఒక్క పరుగునవెళ్ళి స్మితను లేవదీసి దాని బుగ్గలపై బలంగా దెబ్బలువేసి తీసికెళ్ళి వేరే రూమ్‌లో పడేసి బయట గొళ్ళెం పెట్టాను. కాసేపయింతర్వాత ఎర్రగా కందిపోయిన లేతబుగ్గలపై ధారలుకట్టిన కన్నీళ్ళతో వెక్కివెక్కి ఏడుస్తున్న స్మితను చూస్తే జాలేసింది. దాన్ని దగ్గరగా తీసుకుని కళ్లు తుడుస్తూ "చూడు స్మితా! నేను కొడితే నీకు దెబ్బతగిలింది కదా మరి నీవు పాపం పిల్లినికొడితే దానికీ దెబ్బతగుల్తుంది. నొప్పిపెట్తుంది. మరిక కొట్టవుకదూ!" అన్నాను. వెక్కిళ్ళను ఆపుకుంటూ "కొట్టను" అంది స్మిత.

ఆ మరునాడు ఉదయాన్నే పిల్లల్ని లేపుదామని వెళ్ళిన నాకు స్మిత మంచంలో హాయిగా కప్పుకుని గాఢనిద్రలో ఉన్న పిల్లిపిల్ల కన్పించింది. స్మిత ఏదని ఆశ్చర్యపడుతూ వెతికిన నాకు పిల్లి పడుకునే దుప్పటిపై ముడుచుకుని పడుకుని కన్పించింది. ఒక్కసారి స్మితపై జాలితో నా హృదయం ద్రవించింది. దగ్గరగా వెళ్ళిన నా అలికిడికి నిద్రలేచింది స్మిత. "ఎందుకు స్మిత ఇక్కడ పడుకున్నావు?" అడిగాను ఎత్తుకుంటూ. "అమ్మా! మరి పిల్లికి చలి పెట్టదూ? కిందపడుకుంటె నొప్పిపెట్తుంది" అంది. "మరి నీకు చలిపెట్ట లేదూ?" అడిగాను. "మరి నేను రోజూ పిల్లిని కొట్తినా కదా అమ్మా" అంది స్మిత.

ఆ రోజునుండీ స్మిత, పిల్లి ప్రాణ స్నేహితులైపోయారు. స్మిత ధర్మమా అని పిల్లికి కప్పడానికి మరో పాత దుప్పటి ఉపయోగించాల్సి వచ్చింది.

ఓ రెండు వారాల తర్వాత ఉదయాన్నే కాలింగ్‌బెల్ విన్పించి తలుపుతీసిన నాకు అపరిచితురాలైన ఓ నడివయసు స్త్రీ కన్పించింది. నా వెనకే పరుగెత్తుకొచ్చిన పిల్లిపిల్ల "జానీ" అని ఆమె పిలవడంతో ఒక్కపరుగున వెళ్ళి ఆమె చేతుల్లో వాలిపోయింది. ఆమె ఎవరో చెప్పకనే తెలిసింది నాకు. పరిసరాలనుకూడా గమనించకుండా కన్నీళ్ళతో "జానీ! మైలవ్,

మైడా ర్లింగ్! ఐ కాంట్ లివ్ వితౌట్ యు" అంటూ తప్పిపోయినబిడ్డ దొరికిన తల్లిలా సంతోషపడుతూ జానీ ఒళ్ళంతా ప్రేమగా నిమురుతూ ముద్దులతో ముంచెత్తుతూ సంబరపడిపోయింది. జానీని భుజంపైన పడుకోబెట్టుకుని జోకొడుతూ చెప్పింది. తన పేరు "లిండా" అని, తన పిల్లలందరూ ఎవరి దారిన వారు వెళ్ళిపోయారని, భర్త చని పోయాడని, తను ఒంటరిగా ఉందని, తనకు 'నా' అనే ఆప్తురాలు, స్నేహితురాలు అన్నీ ఆ 'జానీ' యేనని, అది తప్పిపోయిన ఆ మూడువారాలు తనెంత బాధపడిందో చెప్తూ తనింటికెప్పుడైనా రమ్మని, అడ్రస్, ఫోన్‌నంబర్ ఇచ్చి వెళ్ళింది. ఏం జరిగిందీ అర్థంకాక తెల్ల బోయి చూస్తూ నిలబడిఉన్న వంశీ, స్మిత లను తిరిగి తిరిగి చూస్తూ వెళ్ళింది జానీ.

ఆ తర్వాత "పిల్లినీ ఆమె యెందుకూ తీసుకెళ్ళిందీ?" అడిగిన వంశీకంతా వివరించి చెప్పాను. ఇక పిల్లి మళ్ళీ రాదని తెలిసిన వంశీ, స్మితలు ఒక్కసారిగా ఏడవటం మొదలెట్టారు. ఆ పిల్లిని అప్పుడప్పుడూ వెళ్ళి చూడొచ్చని ఓదార్చి నచ్చచెప్పేసరికి ఓ రెండు గంటలు పట్టింది.

ఒకరోజు ఫోన్‌చేసి లిండాను పిల్లిని చూడడానికి వస్తామని అడిగి, వంశీ, స్మితలకు ఆ విషయం చెప్పాను. వారి ఉత్సాహం అంతా ఇంతా కాదు. "అమ్మా పిల్లికి ఏమాయినా తిసూకెళ్దామా?" అడిగాడు వంశీ. పిల్లల ఉత్సాహాన్ని కాదనలేక మధ్యదారిలో కిటీక్యాట్ (క్యాట్ ఫుడ్) టిన్‌కొని తీసికెళ్ళాము. పిల్లిని చూడగానే పిల్లల ఆనందం వర్ణనాతీతం. పిల్లికూడా మమ్మల్ని గుర్తుపట్టి "మ్యావ్ మ్యావ్" అంటూ మా చుట్టూ తిరగసాగింది. కాసేపు కూర్చుని ఇంటికి వచ్చాము. వంశీ, స్మితలు పిల్లిని వదలలేక వదలలేక వచ్చారు. లిండాతో చెప్పాను. ఎప్పుడైనా "జానీ"ని మా ఇంటికి తీసుకురమ్మని. దారిలో అడిగింది స్మిత, "అమ్మా పిల్లీ మనింతో పడుకోదా?" అని. "ఊపుడూ పిల్లి వాళింట్లో ఉంది వాళ్ళమ్మ లిండా దాగ్గరా స్లీప్ చేస్తది" సమాధానం చెప్పాడు వంశీ.

పిల్లలకు పిల్లితో స్నేహం ఆలోచిస్తే నాకే నవ్వొచ్చింది. మూడువారాల అను బంధం మరి. "మనిషి మనిషితో స్నేహం చేసినా, జంతువులతో స్నేహంచేసినా స్నేహం స్నేహమే. జంతువులతో స్నేహం చేసినంతమాత్రాన దాని విలువ ఏమాత్రం తరగదు అని లిండాను, మా పిల్లలను చూస్తే తెలిసింది నాకు. అందుకే అంటారు కాబోలు—

"సృష్టిలో తీయనిది స్నేహమే నోయి" అని.

———

# కలిసిన హృదయాలు

పిలని రాజు



యువ మాసపత్రిక

కార్యాలయము,

పబ్లిక్ గార్డెన్ రోడ్,

హైదరాబాదు – 1.

ది. 26–8–1980

సాహిత్యాభిలాషులు అనంత్‌గారికి,

ఇటీవల యువలో ప్రచురించిన 'కలసిన హృదయాలు' మీ కథ కాపీ కథ అని కొంతమంది పాఠకులు విమర్శిస్తూ ఉత్తరాలు రాశారు. మీ రెఫరెన్స్ కోసం ఒక పాఠకుని ఉత్తరాన్ని పంపిస్తున్నాం. ప్రతికాముఖంగా జవాబిస్తారని ఆశిస్తాం.

–మీ ఎడిటర్.

షాక్ తిన్నట్టు ఫీలయ్యాను. ఒక పత్రికా కార్యాలయం నుంచి నాకింత వరకు ఇలాంటి ఉత్తరాలు రాలేదు. సుమారు అయిదు సంవత్సరాలుగా రాస్తున్న అనుభవం వున్న నాకు ఎవరి కథో కాపీచేయాల్సిన అవసరం లేదు. తమిళ కథను అనువాదం చేయవలసిన గత్యంతరం లేదు.

అయినా ఏమిటిది?

వణుకుతున్న చేతులతో అ పాఠకుని ఉత్తరం తీశాను.

మద్రాసు,
18-8-1980

యువ సంపాదకులకు,

గత సంచికలో మీరు ప్రచురించిన "కలసిన హృదయాలు" కథ జూన్ నెల మొదటివారంలో 'కుముదం' అనే తమిళ వార పత్రికలో ప్రచురించిన 'ఇరండు ఇతయంగల్' అను కథకు స్వేచ్ఛానువాదం అని తెలియజేయుడానికి విచారిస్తున్నాను. ఇలా ఇతర భాషల్లోని కథలను అనువదించి తమ కథలు అని చెప్పుకొనే ఆ కథా రచయిత ఒక రచయిత అని చెప్పుకోవటం సిగ్గుచేటు. కథా చౌర్యం క్షమించలేని నేరం. కనుక ఆ కథారచయిత తమిళ కథారచయిత్రి శారదగారికి క్షమాపణలు పత్రికాముఖంగా చెప్పుకోవలసిందిగా కోరుకుంటున్నాను. ఇకనైనా ఇలాంటి కథలకు పత్రికలో చోటివ్వరని ఆశిస్తూ

మీ పాఠకుడు
సి. హెచ్. సూర్యనారాయణ

కోపం, అవమానంతో నాకు ఒళ్ళు మండిపోయింది. నేరాన్ని పాఠకుడు మోపాడు. నిర్దోషి అని నిరూపించుకొనే బాధ్యత రచయితగా నాకుంది. ఈ కథ నా స్వంత రచన అని నిరూపించుకోవలసిన అవసరం ఎంతైనా వుంది.

వెంటనే సెంట్రల్ లైబ్రరీకి వెళ్లాను. జూన్ నెల మొదటివారంలో 'కుముదం' తమిళ వారపత్రికలో ప్రచురించిన కథను వెతికితీశాను.

'ఇరండు ఇదయంగల్' కథారచయిత్రి శారద. రైలులో ఎదురెదురుగా కూర్చున్నట్లు హీరో; హీరోయిన్ల రంగులబొమ్మ పేజీనిండుగా రమ్యంగా వుంది. పేజీ త్రిప్పాను.

షాక్!

ఆ ఫోటో.... ఆమె.... ఆమె.... ఆమె నన్ను ఆర్నెల్ల గతంలోకి లాక్కెళ్లింది.

* * *

యూనివర్సిటీలో పని పూర్తిచేసుకొని తిరుపతి రైల్వేస్టేషన్‌కు వచ్చేసరికి "మీనాక్షి ఎక్స్‌ప్రెస్" మెల్లగా కదులుతోంది. టిక్కెట్టు తీసుకొని పరుగున రైలెక్కేశాను. రైలు వేగం పుంజుకొంది. కంపార్ట్‌మెంట్‌లో ఖాళీసీటు కోసం వెతుక్కొంటూ వెళ్లాను. ఎక్కడా లేదు. కాని అక్కడ!

ఒక్కడుగు ముందుకేసి మళ్లీ వెనక్కు వేశాను. ఆ క్షణంలో మెరిసిన మెరుపు తాలుకు వెలుగు నన్ను ధైర్యంతో ముందుకు అడుగేయనిచ్చింది.

"తమ్ముడూ! కొస్త జరుగుతావా!" అన్నాను ఆ సీట్లో కూర్చున్న కుర్రాన్నుద్దేశించి!

"పారకొ! అవరెనుమో.... (చూడకొ! అయనేమో....) అని

ఏదో తమిళంలో చెప్పతోయాడు ఎదురుగా కూర్చున్న మెరుపుకేసి అదోలా చూస్తూ!

ఆ మెరుపు వాడి అక్క అని, వారు తమిళీయులని అప్పుడు తెలిసింది. వెంటనే నా సంభాషణను తమిళంలోకి మార్చాను. తమిళంలో చెప్పేసరికి ఆ కుర్రాడు సంతోషంగా జరిగి చోటిస్తూ "వాంగొ! వుక్కారంగొ" (రండి కూర్చోండి) అన్నాడు.

"ఎంద వూరు వుంగల్దు?" (ఏవూరు మీది?) నుంచి ప్రారంభమయింది మా సంభాషణ.

సంభాషణంతా తమిళంలోనే సాగింది. కుర్రాడు, వాడి అక్క, నాన్న ముగ్గురు తిరుపతిలో వెంకటేశ్వర స్వామిని దర్శించడానికి వచ్చారని; స్వంతవూరు తిరుచురాపల్లి అని తెలుసుకొన్నాను.

ఆమె....! మెరుపు....!

ఆ విశాల నేత్రాలు, సూటి ముక్కు, వంపు తిరిగిన పెదవులు; పైపెదవి కుడివైపున పుట్టుమచ్చ - ఇట్టే ఆకర్షించే ఆ అందం.

శరీరవర్ణానికి అట్టే సరిపోయిన పసుపు పచ్చని అమెరికన్ జార్జెట్ చీరపైన అదేరంగు జాకెటు, భుజంమీదుగా ఒళ్లో పడిన పొడవైన నల్లని జడకొసను సుతారంగా చేతివేళ్లతో అల్లుకొంటున్న తీరు — దివినుండి దిగివచ్చిన దేవత గాబోలు- అన్నంత అమిత సౌందర్య లావణ్య అందాలరాశిలా ఆమె రూపం అద్భుతం.

వయసు ఇరవై ఏళ్లకంటె ఎక్కువ వుండదు.

నన్నింత ఎక్కువగా ఆకర్షించిన వనితామణి ఆమె. ఇంతవరకు ఎంతో మందిని చూశాను. కాని ఎవరిలోనూ ఇంత అందం, ఆకర్షణ లేదు.

ఈ అందాన్ని చూసే నా కళ్లలో మెరుపు మెరిసింది. ఆ తర్వాతే ఆ అందాన్ని తనివితీరా చూడాలనే చిలిపి కోరిక కలిగింది. అందుకే వెనక్కు వేసిన అడుగు ముందుకేసి ఆ కుర్రాడి ప్రక్కన సీటు సంపాదించాను.

ఇంతవరకు ఆడవారంటే అసహ్యించుకొనే నేను ఆమెపైపు చూడకుండా వుండలేకపోతున్నాను. 'పెళ్లి' అంటే ద్వేషించే నేను ఆ క్షణంలో 'పెళ్లంటూ చేసుకొంటే ఈమెనే చేసుకోవాలి. లేకుంటే నా బ్రతుకెందుకు' అనే స్థిర నిర్ణయానికి వచ్చేశాను.

ఆ కుర్రాడు ప్రశ్నలవర్షాన్ని కురిపిస్తూనేవున్నాడు. జవాబులిస్తూ వీలయినప్పుడంతా ఆ అందాలరాశిని చూస్తూనే వున్నాను.

ఆమె వెనక్కు వెళ్లే చెట్లవైపు, గుట్టలవైపు చూస్తోంది. పచ్చని అందమైన ఆమె మొహంపైన సాయంత్రపు నీరెండ పడి వింతకాంతు లీనుతోంది.

గాలికి చెదిరిపోయిన ఆమె ముంగురులు నుదుటిమీద నాట్యంచేస్తున్నాయి.

అలానే... ఇద్దరం.. ఎదురెదురుగా ఒకరి కళ్లలోకి ఒకరు చూస్తూ, ఒకరి భావాల్ని మరొకరు అర్థంచేసుకొంటూ ఇలానే... కలకాలం.... వుండిపోతే బావుణ్ణనిపిస్తోంది.

మెల్లగా ఆమెవైపు చూశాను. అ క్షణంలో ఆమెకూడా నా వైపే చూస్తూ చిన్నగా నవ్వుతోంది.

ఒక్క క్షణం... కళ్లు నాలుగూ కలిశాయి. వెంటనే వాలిపోయాయి.

'ఆమె కూడా నా గురించి ఆలో చిస్తోందా?'

ఆమె ముఖకవళికల్ని ఒక్కసారిగా చదవగలిగాను.

ఆమె భావాలు .. నా భావాలు

ఆమె ఆలోచన్లు నా ఆలోచన్లు ఏకం కావాలి! ప్రేమించేసుకొని, పెళ్లి చేసుకొని ఆనందదాంపత్యజీవన లాహిరిలో తేలిపోవాలని నా హృదయం ఘోషిస్తోంది.

ఇంత అందం నా సొతంకావాలని, మూడుముళ్ల బంధంతో అది శాశ్వతం కావాలని నా హృదయకోవెలకు ఆమెను దేవతను చేసి నిత్యం ఆరాధించాలని ఎన్నెన్నో ఆశలు. ఎన్నెన్నో ఆలోచన్లు

తరంగాలు .తరంగాలుగా నా మదిని ఓలలాడిస్తున్నాయి. ఆమెతో మాట్లాడాలని ఉవ్విళ్లూరిస్తున్నాయి. తొందర పెట్టేస్తున్నాయి.

"నా కంటి వెలుగై

నా ఇంటి దీపమై

నా ప్రాణంలో ప్రాణమై

నన్నేలుకోవే - ఓహోహో! ఏమిటి కవిత్వం పుట్టుకొస్తోంది.

తల విదిలించి ఆమెవైపు చూశాను. అర్ధనిమీలిత నేత్రాలతో తలను కొద్దిగా ప్రక్కకు వాల్చి నా వైపు (దొంగ చూపులు) చూస్తూ దీర్ఘాలోచనలో వున్నట్లుంది.

బహుశా!

ఆమెకూడా నా వలె ఆలోచిస్తోందా?

'నన్ను గూర్చి ఆలోచిస్తోందా? అయితే ఏమిటట్బా! నా వలె ప్రేమ.... పెళ్లిగూర్చి ఆలోచిస్తూ వుండాలి. యామై కరెక్ట్?'

ఏమో!

ఆడవారిని అర్థంచేసుకోవడం కష్టం.

ఆమె నా వైపు చిలిపిగా చూసింది.

ఆ చూపులో ఆరాధన!

అంటే!

ప్రేమిస్తోంది. అది పెళ్లికి దారి తీస్తుంది. ఆమె నా అర్ధాంగి అవుతుంది. అవుతుందా? ఉహుఁ!

ఎలా?

"మీరు నన్ను ప్రేమిస్తున్నారా?" అని ఆమెనే అడిగేస్తే?

ఆమెకోపం వచ్చి పళ్లిగ్గా అక్షిం తలువేస్తే ఎవరైనాచూస్తే ఏమంటారు?

'ఆదర్శవాదిగా ఉండాల్సిన రచయిత చేయాల్సినపనేనా ఇది?' అని ఎవరైనా ఖచ్చితంగా అడిగితే నేను తలనెక్కడ దాచుకోవడం?- అంటూ ఆలోచిస్తూ వెలుపలికి తొంగిచూశాను.

అరె! అప్పుడే వచ్చేసిందా చిత్తూరు!

ఆశ్చర్యం!

దిగిపోతున్నారు జనం.

చేసేదేమీలేక అంత అర్జంటుగా వచ్చిన రైలును తిట్టుకొంటూ, అంత వరకు సీటునిచ్చిన అబ్బాయిని తెగ మెచ్చుకొని- (తమిళంలో) కృతజ్ఞతలు తెలుపుకొని-ఈ కార్యక్రమాలు చేస్తూ ఆమెను చూస్తూ - నాతోరానని మొరా యించిన హృదయాన్ని బలవంతంగా లాక్కొని దిగలేక, దిగలేక.... మనసు రాక, రైలు దిగాను. దిగేటప్పుడు మళ్లీ ఆతృత నణచుకోలేక ఆమెపైపు చూశాను.

చిరునవ్వు! ఒకే నవ్వు!

చాలు. జీవితం ధన్యం.

రైలు కదిలింది. తిరిగిచూద్దును గదా నా హృదయం రైలుతో పారిపోయింది



* * *

ఇది కథావస్తువు. ఈ రైలు ప్రయాణంలో నా ఆలోచన్లు .. దానికో రూపం .. చివరిలో ఇద్దరి పెళ్లి జరిగిపోవడం- ఇది కథలోని విష యాలు. అయితే ఇక్కడ పెళ్లి జర గడం తప్పించి మిగతా విషయాలన్నీ యథాతథంగా రాసినవే. కథకు ముగింపు కావాలి కనుక నాకు నచ్చిన అందమైన ముగింపు(పెళ్లి)తో కథ ముగించాను.

* *

"ఏమిటండి! ఆ ఫోటో వైపు అలా చూస్తున్నారు," అనే లైబ్రేరియన్ విషపు నవ్వుతో గతంలోంచి వర్తమానా నికి వచ్చాను.

అదే రూపం.... అదే అందం.

అదే ఆకర్షణ అదే ఆరాధన- కథారచయిత్రిలో వుంది. పేరు శారద. తొలి కథ కావటంచేత రచయిత్రిని ఫోటోతో సహా పరిచయం చేశారు.

ఆ తర్వాత కథను చకచకా చదివేశాను.

అదే రైలు ప్రయాణం... అవే అనుభవాలు అవే ఆలోచన్లు. పెళ్లితో కథ ముగింపు- అంతా ఒక్కటే.

భాషలో తప్పించి భావాల్లో బేధం లేదు.

'నా హృదయం చిత్తూరులోనే వదిలేశాను' అంది.

ఆ ఒక్క వాక్యమే నా మనసులో వేణువు లూదింది. ఆమె నన్ను మనసారా ప్రేమిస్తోంది. ఇద్దరూ ఒకర్నొకరు ప్రేమించుకొన్నాం. కానీ పిరికివాళ్లం, మనసు విప్పి మాట్లాడుకోలేదు.

ఇద్దర్లో మెదిలిన భావాలు కథకు రూపాలు దాల్చాయి.

ఆ కథలే మమ్మల్ని కలిపాయి.

* * *

5-1-63, బజారు వీధి,

సంతపేట, చిత్తూరు.

10-10-1980

యువ సంపాదకులకు,

నమస్సుమాంజలి.

26-8-80వ తేది మీ ఉత్తరం అందింది. చాలా థ్యాంక్స్. ఎందుకంటే మీరు, పాఠకులు విమర్శద్వారా నిజంగా కథకు వూపిరిపోశారు. మా రెండు హృదయాలను కలిపారు.

ఇక నా కథ కాపీ కథ అని విమర్శించారు. తమిళ రచయిత్రి శారదగారి కథ 'కుముదం' లో జూన్ మొదటి వారంలో ప్రచురింపబడింది. నా డైరీ ప్రకారం నేను నా కథను 16-5-80వ తేది మీకు పోస్టుచేశాను. కనుక ఆమె కథను నేను కాపీచేసే ప్రసక్తే లేదు.

ఒక రైలులో మేమిద్దరం కలిపి ప్రయాణం చేశాం. అప్పుడు ఇద్దర్లో కలిగిన ఆలోచనాభావతరంగాలే మా కథకు కథావస్తువులు. ఇద్దరూ మనసుల్లో ఆశించిన ముగింపే కథలకు అన్వయించాం.

ఆమె అనుభవాలు ఆమె తమిళ కథగా రూపొందించింది. అలాగే నా భావాలు తెలుగుకథగా రూపొందించాను.

ఇద్దరికీ ఒకే అనుభవాలు.... ఒకే ముగింపు రావడం ఆశ్చర్యమే!

సహృదయులైన పాఠకులు అర్థం చేసుకొంటారని ఆశిస్తాను.

విడిపోయిన మా రెండు హృదయాల్ని మళ్లీ కలపడానికి దోహదం చేసిన పాఠకుడు శ్రీ సి. హెచ్ సూర్యనారాయణగారికి, మీకు నా కృతజ్ఞతలు మరోసారి అందజేసుకొంటున్నాను.

ఇట్లు

మీ అనంత్.

---

# కళ - కళ్యాణి

"చలపతీ !"

"వస్తున్నా బాబూ !"

"నేను లేని సమయంలో ఎవరెవరు వచ్చారో దాచకుండా చెప్పు."

...........

"ఎందుకలా బెదిరిపోతున్నావు ? నేను యింటి యజమానిని. నాకు తెలీకుండా ఏదీ జరగటానికి వీల్లేదు. నిజం చెప్పు. నేను లేనప్పుడు శేఖరం, పద్మా యింటికి వచ్చారు, ఔనా ?"

"లేదు బాబూ ఎవరూ రాలేదు."

"అలాగని అమ్మగారు చెప్పమన్నదా ?" ఒక్కొక్క మాటా వొత్తిపలుకుతూ కటువుగా అడిగాడు.

"బాబూ !"

"మురళీ ! నౌకరుగా నీ నటన తృప్తికరంగా లేదోయ్. నిలబడటంలో, జవాబు లివ్వటంలో అణకువ, వినయం స్పష్టంగా అగుపించాలి. ఒక నాటకంలో హీరో వేషం వేస్తే, రెండో నాటకంలో నౌకరు వేషం వెయ్యమంటే నామోషీగా ఫీలవుతారు తప్ప వెరైటీ పాత్రలపట్ల వుత్సాహం చూపించరు. నువ్వే నౌకరు వన్న భావం పూర్తిగా మనసులోకి తెచ్చుకొని ఆ పాత్రలో లీనమైపోవాలి. పైగా యీ పాత్ర నాటకానికి ఆయువుపట్టు."

డైరెక్టరు సుబ్బారావు మాటలతో రిహార్సల్సు ఆగినాయి.

చీర్ల సీతాదేవి

"నారాయణా !"

"బాబూ !"

"మంచినీళ్ళు."

రెండు నిముషాల్లో వచ్చి "ఇదిగో బాబూ!" అంటూ నీళ్ళగ్లాసు అందించాడు. గ్లాసు చేత్తో పట్టుకుని మురళివైపు తిరిగాడు సుబ్బారావు.

"చూశావా మురళీ ! నౌకరు అంటే యిట్లా వుండాలి. మాటల్లో, నడకలో, కళ్ళల్లో, ప్రతీ కదలికలో వినయ విధేయతలు వుట్టిపడాలి. ఒక్కోసారి డూప్ చేత హీరోవేషం వేయించాలి అనిపిస్తుంది సినీ డైరక్టరుకి." నీళ్ళగ్లాసు ఖాళీ చేశాడు.

మురళి ముఖం చిన్నబుచ్చుకున్నాడు.

నారాయణ ముఖం తెల్లగా పాలిపోయింది. మనిషి బిగుసుకుపోయాడు. ఖాళీగ్లాసు అందిస్తూ నారాయణవైపు చూశాడు సుబ్బారావు.

పొడగరి కావటాన కొంచెం వంగినట్లు అన్పిస్తాడు. వెడల్పాటి పెద్ద కళ్ళు, ఎత్తయిన ముక్కు, విశాలమైన నుదురు, తెల్లబడి మెరుస్తున్న జుత్తు. యితను వయసులో ఎంత అందగాడో అన్పించేటట్లు వుంటాడు నారాయణ.

"నారాయణా ! మా నాటకంలో వేషం వేస్తావేమిటోయ్!" తమాషాగా అడిగాడు.

నారాయణ తేరుకుని నవ్వాడు. ఆ నవ్వులో జీవం లేదు. "ఈ కళామందిరం ప్రభు బాబూగారు నడిపిన రోజుల్లో నేనూ వేషాలు వేశాను బాబూ! ఆ రోజులు వెళ్ళిపోయాయి."

గతం తాలూకు జ్ఞాపకాలు మస్తిష్కాన్ని తొలుస్తుంటే పరాకుగా జవాబిచ్చాడు.

"అరే ! నువ్వూ కళాకారుడివేనన్నమాట. మరి చెప్పలేదేం ?"

"అది వొకప్పటి మాట బాబూ."

"నారాయణా! ఒకప్పటి కళాకారుడివి మరి...."

"జీవితం అంటేనే చీకటి వెలుగులుగా బాబూ !" మధ్యలోనే అందుకున్నాడు నారాయణ.

"అవును. కళను నమ్ముకున్నవాడెవడూ బాగుపడలేదు." సానుభూతిగా అన్నాడు.

"అలా అనకండి బాబూ ! నిజమైన కళాకారుడు 'కళ' కూడూగుడ్డా పెడు

తుందని ఎప్పుడూ ఆశపడడు. కళ ద్వారా కార్లూ, బంగళాలూ రావాలని కోరు కోడు. కళనే ఆరాధిస్తాడు. కళోపాసనలో తరించాలనుకుంటాడు. కళని వుద్ధరించి జీవితాన్ని సార్థకపరచుకోవాలనుకుంటాడు. ప్రభు కూడా అలాగే అనుకునేవారు."

ఆవేశం మూలాన అతనికి దగ్గుకూడా వొచ్చింది.

"నారాయణా! ప్రభు గురించి రకరకాలుగా చెప్పుకోగా విన్నాను. కళోద్ధరణ అంటూ తిరిగి, చివరి కతను ఆస్తులన్నీ అమ్ముకుని బికారిలా వూళ్ళుపట్టి తిరుగుతున్నాడని అనుకుంటారు. ఎంతవరకు నిజం?" అంటూ కుతూహ లంగా అడిగాడు.

నారాయణ మొహం వివర్ణమయింది.

వెంటనే జవాబు యివ్వలేక కాస్త ఆగి, "వొట్టిదే బాబూ! అంతా వొట్టిది. కళ జీవితానికి అని కొందరనుకుంటే జీవితమే కళకోసం అని కొందరను కుంటారు. ప్రభు రెండో రకానికి చెందిన మనిషి. అతన్ని మోసంచేసి బికారిని చేసింది కళ కాదు బాబూ, కళ్యాణి.

ఆవేశంతో అతని మొహం ఎర్రబడింది.

అందరూ నారాయణవంక చూస్తూ స్తబ్ధుగా వుండిపోయారు.

బయటి వాతావరణంలో వున్నట్లుండి మార్పు వచ్చింది. గాలికి కిటికీ రెక్కలు కొట్టుకోవటం మొదలుపెట్టాయి. సన్నగా జల్లు ప్రారంభమైంది.

నారాయణ కిటికీ రెక్కలన్నీ మూసి లైట్లువేసి గదిలోంచి పోబోయాడు.

"నారాయణా!"

సుబ్బారావు పిలుపికి యిటు తిరిగాడు.

"ఇప్పుడిక రిహార్సలు మూడ్ పోయింది. ప్రభు గురించి నీకు తెలిసినదంతా చెపితే వినాలనివుంది."

నారాయణ నిల్చున్నచోటే మౌనంగా వుండిపోయాడు.

"ఇలా వచ్చి కూర్చో నారాయణా." అంటూ కుర్చీ చూపించాడు సుబ్బారావు.

యజమాని నౌకరు అన్న భేదాన్ని మరచి ఒక కళాకారుడిగా మర్యాద యిస్తున్న సుబ్బారావుకేసి చూస్తూ వుండిపోయాడు. అతని ఔదార్యానికీ, కళా కారుడి పట్ల అతనికున్న గౌరవానికీ మనసులోనే జోహార్లర్పించాడు.

కళని పొగుడుతూ, కళాకారుల్ని చులకనగా చూస్తున్న యీ రోజుల్లో 'సుబ్బారావూ, నీలాటి మనిషి నూటికి ఒక్కడున్నా చాలు' అనుకున్నాడు.

అతని కళ్ళల్లో ఆశ్చర్యం తొలగి కృతజ్ఞత చోటుచేసుకుంది. దగ్గరగా వొచ్చి,

"అంతస్తులు ఎరిగి మసలుకోవటం అందరికీ మంచిది బాబూ" అంటూ భుజంమీది తుండుతో నేలను దులుపుకుని కూర్చున్నాడు.

మిగతా నటీనటులంతా అతని చుట్టూ చేరారు.

గతాన్ని గుర్తుతెచ్చుకోవటానికన్నట్లు కొంత మౌనం తర్వాత చెప్పటం మొదలుపెట్టాడు.

* * *

"స్వప్న బదులు నటించటానికి ఈ అమ్మాయిని తీసుకొచ్చాను ప్రభూ!" ప్రసాదరావు అనటంతో ప్రభు అటుచూశాడు.

"రామ్మా! యిలా సిగ్గుపడేదానివి రేపు స్టేజిమీద ఏం నటిస్తావు" అని ప్రసాదరావు మందలించటంతో ఆ అమ్మాయి స్తంభంచాటునుంచి యివతలకు వొచ్చింది.

"ఈమె మంచి ఫామిలీనుంచి వొచ్చింది. తండ్రి చిన్నతనాన్నే పోయాడు. పద్దెనిమిదేళ్ళు పిల్లను గడపదాటనీయకుండా తల్లి సాధకబాధకాలన్నిటికీ వోర్చింది. యిప్పుడామెకు పక్షవాతం వొచ్చి కాళ్ళూచేతులూ పడిపోయాయి. 'మందులకీ ఇల్లుగడవటానికీ యిబ్బందిగావుంది. ఏదయినా పనిచూపించండి బాబాయిగారూ!' అంటూ వొచ్చింది.

"సరే స్వప్న చెప్పాపెట్టాకుండా పరారీ అయిందిగా. మనం ఎలాగూ హిరోయిన్‌కోసం వెతుకుతూనే వున్నామాయె. తర్ఫీదుయిస్తే యీ అమ్మాయి పనికొస్తుందేమోనని తీసుకొచ్చాను."

ప్రసాదరావు మాటలేవీ ప్రభు చెవిని సోకనేలేదు.

రెప్పవాల్చకుండా ఆ అమ్మాయినే చూస్తూ వుండిపోయాడు.

యీ పిల్లకి యింతటి అసమాన సౌందర్యం ఎక్కడ్నుంచి వొచ్చింది? వొంటిమీద ఆభరణం లేకపోయినా, కట్టుకున్నది మామూలు నూలుచీరే అయినా చూచినకొద్దీ చూడాలనిపించే రూపం.

"నీ పేరు?" ప్రభు అడిగాడు.

ఆమె తల మరింత దించుకుపోయింది. "కళ్యాణి" అంది వీణమీటినట్లుగా.

ప్రభు డైరెక్టరు ప్రసూనతోనూ, తక్కినవారితోనూ కళ్యాణి విషయం సంప్రదించాడు.



టికెక్కెట్లు చాలావరకు సేల్ అయ్యాయి. ప్రముఖులకు ఆహ్వానాలు పంపటం జరిగిపోయింది. ఎంత ప్రయత్నించినా ఇంకో ఆర్టిస్ట్ దొరకటం కష్టంగా వుంది. యీ అమ్మాయికి తర్ఫీదుయిస్తే నష్టంలేదు. నటనమాట అలావుంచి చక్కని రూపం, తియ్యని కంఠం వీటితో ప్రేక్షకుల్ని ఆకట్టుకోగలదు అన్న అభిప్రాయాన్ని వ్యక్తంచేశారు కళామందిర్ సభ్యులు.

"మంచిది. ఆర్థికమైన యిబ్బందులవల్ల కదా ఆమె కళామందిర్‌లో చేరిందన్నారు. అడ్వాన్సుగా యీ డబ్బు ఆమెకు యివ్వండి" అని 600 రూపాయలు ప్రసాదరావు చేతికిచ్చి వెళ్ళిపోయాడు ప్రభు.

* * *

థియేటరు ప్రేక్షకులతో క్రిక్కిరిసిపోయింది. తెరలోపల్నుంచి వాయిద్యాల

శ్రుతులు వీనులవిందు కల్గిస్తున్నాయి నీలంరంగు తెర రెండుగాచీలి పక్కకు తప్పుకుంది.

అది కణ్వముని ఆశ్రమం. ఓ రాతితిన్నెమీద కూచుని ప్రకృతిని చూసి పరవశించిపోతూంది శకుంతల.

ఆమె ముగ్ధమనోహర రూపాల్ని చూసి ప్రేక్షకులు హర్షధ్వానాలు చేశారు. దుష్యంతుని వేషంలో ప్రభు స్టేజిమీదకు వచ్చాడు. పొదలమాటునుంచి శకుంతలను చూశాడు. ఆమె శకుంతల వేషంలోవున్న కళ్యాణా ? లేక కాళిదాసు శకుంతలా ? అన్న భ్రమ కలిగింది అతనికి. తన్ను తాను మర్చిపోయి శకుంతలనే చూస్తుండిపోయాడు ప్రభు. అతడి హృదయం ఆమెపట్ల ప్రేమతో అనురాగంతో నిండిపోతున్నకొద్దీ అతని మొహంలోకి, కళ్ళలోకి కొత్తకాంతి ప్రవేశిస్తూంది. ఝుంకారంచేస్తూ మీదికి రాబోతున్న తుమ్మెదల బారి నుంచి తప్పించుకోటానికి లేచి వెనక్కు అడుగులేస్తూ పొదల మాటునుంచి తన వంక చూస్తున్న దుష్యంతుని చూచింది శకుంతల.

కళ్యాణి గుండె ఒక్కసారి ఆగి తిరిగి రెట్టింపు వేగంతో కొట్టుకో నారంభించింది.

'ఈయన ప్రభుకదూ! తను స్టేజిమీద యితని పక్కన నటించాలా ? యింత మంది చూస్తూవుండగా ! రిహార్సల్సు జరిగేటప్పుడు అంతదూరాన వొచ్చి నిల్చుంటేనే తాను యింటిదగ్గర కంఠతా పెట్టివొచ్చిన డైలాగులు మరచి పోయేది. గొంతు తడారిపోయేది.

'నువ్వు సిగ్గుపడుతున్నావని విడిగా తర్ఫీదు యిస్తున్నాం. స్టేజిమీద ఎవరున్నా యిలాగే నటించాలి' అన్నారేతప్ప ఒక్కమాట ప్రభు పక్కన నటించాల్సి వుంటుందని ఎవ్వరూ అన్లేదు. మునుపెన్నడూ ఎరగని తీరులో హృదయం స్పందిస్తుండగా నేరుగా అతన్ని చూడలేక బిడియంతో తలవాల్చుకుంది.

ప్రభు, 'శకుంతలా !' కళ్యాణి చేతుల్ని తనచేతుల్లోకి తీసుకున్నప్పుడు శరీరమంతా విద్యుత్తరంగాలు ప్రవహించాయి.

"శకుంతలా ! ఈరోజునుంచీ మనం భార్యాభర్తలం" అంటూ అతను వుంగరం తొడిగి పూలహారం వేస్తున్నప్పుడు వూహాకందని ఆనందానుభూతితో మైమరచిపోయింది కళ్యాణి.

చూస్తున్న ప్రేక్షకులకు వాళ్ళు నటించటంలేదు ఆ పాత్రలకు జీవం పోశారు అన్పించింది. తెర పడినప్పుడల్లా మళ్ళా ఎప్పుడెప్పుడు ఆ జంటను చూస్తామా అన్న ఆదుర్దా ప్రేక్షకులలో కలిగించారు కళ్యాణీ ప్రభులు.

నాటకం పూర్తయింది.

హాలంతా కరతాళధ్వనులతో మార్మోగిపోయింది. శకుంతలా దుష్యంతులుగా ప్రేక్షకుల హృదయాలలో నిలిచిపోయారు ఆ జంట. ఎవరినోట విన్నా ప్రశంసలే.

గ్రీన్‌రూమ్‌లో వేషంమార్చుకుని, ముఖానికున్న మేకప్ కడిగేసుకుని ఒకోటిగాతీసి పక్కనున్న పెట్టెలోవేస్తూ వేలికున్న వుంగరం తీసివేయబోతూ ఆగింది. ఇది గిల్టుదికాదేమో అన్న అనుమానం వొచ్చి తిరిగి వేలుకి వుంచుకుంది. దువ్వెనతో చిక్కుతీసుకుంటూ వుండగా,

"కళ్యాణీ!"

పిలుపువిని వెనక్కు చూసింది.

గుమ్మంలో ప్రభు నిలబడివున్నాడు.

ఒక్కక్షణం రెండుజతల కళ్ళూ కలుసుకుని విడిపోయాయి.

"కళ్యాణీ నువ్వింత అద్భుతంగా నటిస్తావనుకోలేదు. నీ నటన అమోఘం. నిన్ను స్టేజిమీదచూసి ఆనాటి శకుంతల నువ్వేనేమో అనుకున్నాను." ప్రభు ఆనందాన్ని అదుపులో పెట్టుకోలేక కళ్యాణి దగ్గరగావచ్చి ఆమెచేతులు పట్టుకున్నాడు.

కళ్యాణి తల దించుకుంది. "నన్ను అతిగా పొగుడుతున్నారు" నెమ్మదిగా సిగ్గుగా అంది. అంతలోనే ఏదో గుర్తుకొచ్చినట్లు చేతులు విడిపించుకుని "మీ వుంగరం" అంటూ వేలికున్న వుంగరాన్ని తియ్యబోయింది.

చిన్నగా నవ్వుతూ, తల అడ్డంగా వూపుతూ "ధర్మంగా ఒకసారి యిచ్చిన వస్తువును తిరిగి తీసుకునే అలవాటులేదు" అన్నాడు.

కళ్యాణి ఏదో అనబోయేంతలో ప్రసూన అక్కడికి వొచ్చాడు.

"బాగా నటించావమ్మాయ్. సాధనచేస్తే బాగా రాణించగలవు" అని మెచ్చుకున్నాడు. కళ్యాణి ఏమనాలో తెలీక మౌనం ధరించింది.

ప్రభు సలహామేరకు యీ అమ్మాయికి విడిగా తర్ఫీదివ్వటం మంచిదయింది. ప్రభు పక్కన నటించవలసిరావటంతో యీ అమ్మాయిలో సహజంగా కలిగిన తత్తరపాటు, బిడియం పాత్రపోషణకు బాగా నప్పాయి అనుకున్నారు.

రాత్రి పొద్దుపోయి ఆనందంనిండిన హృదయంతో, గాలిలో తేలిపోతున్నట్లుగా ప్రభు కారులో యిల్లుచేరుకుంది కళ్యాణి.

* * *

కళ్యాణి కళామందిరంలో చేరి మూడు నెలలు దాటింది. ప్రభు పట్లభక్తి గౌరవాలతోపాటు ఆరాధనా భావం కూడా పెంచుకుంది. 'తరాల అంతరాలు' నాటకానికి రిహార్సల్సు ప్రారంభం అయ్యాయి. ప్రభు పక్కన నటించటానికి కళ్యాణిని ఎన్నికచేశారు.

ఎవరన్నా పలకరిస్తే ముక్తసరిగా జవాబు లివ్వటం తప్ప తనంతట తానుగా ఎవరితోనూ మాట్లాడేది కాదు కళ్యాణి.

"నువ్వొచ్చి యిన్నాళ్ళయినా యింకా కొత్తపోలేదా అమ్మాయ్" అనేవాడు ప్రసూన.

కళ్యాణి సమాధానంగా నవ్వేది.

ఆ రోజు రిహార్సల్సు పూర్తయ్యేసరికి ఎనిమిది దాటింది.

"కల్యాణీ! పొద్దుపోతూంది. నిన్ను నా కారులో డ్రాప్ చేస్తాను పద" అన్నాడు ప్రభు.

కళ్యాణి తటపటాయించింది.

'ఈ రోజు ప్రసాదరావుగారు కూడా రాలేదు. యింటివరకు తోడురావటాని కైనా. ఒంటరిగా వెళ్ళటం కష్టం' అనుకుని కార్లో ఎక్కి కూచుంది.

కారురోడ్డుమీద మెత్తగా దూసుకుపోతూ వుంటే గ్లాస్‌డోర్‌లోంచి ఎదు రయ్యే వాహనాలనూ, జనాన్నీ, దుకాణాల్నీ చూస్తూ కూచుంది.

ప్రభు హోటలుముందు కారాపి దిగుతుంటే ఒకసారి అతనికేసి చూసి తల తిప్పుకోబోయింది.

"దిగు కళ్యాణీ!" అంటూ బాక్‌డోర్ తెరచాడు ప్రభు.

"నన్ను- యింటి దగ్గర డ్రాప్‌చేస్తానన్నారు" సంశయంగా అంది కళ్యాణి.

ప్రభు నవ్వుతూ "ఆకలిగా వుంది. ముందు ఏదైనా తిని నిన్ను మీ యింటి దగ్గరే డ్రాప్‌చేస్తాను, పదా!" అన్నాడు.

కళ్యాణి అతన్ని అనుసరించక తప్పలేదు.

ఎ. సి. ఫామిలీ రూమ్‌లో ప్రభుకి ఎదురుగా తల దించుకుని కూచుంది కళ్యాణి.

బేరర్‌కి స్వీట్సు, కూల్‌డ్రింక్సు ఆర్డరిచ్చాడు ప్రభు. కిటికీలకున్న కర్టెన్లనీ గోడలకున్న సీనరీలనీ కళ్యాణి చూస్తుంటే ఆమెనే చూస్తున్నాడు ప్రభు.

రెండు నిముషాలు ఆగి "కళ్యాణీ!" మృదువుగా పిల్చాడు ప్రభు.

కళ్ళెత్తి చూసింది. ఆమె మొహంలోని అమాయకత, కళ్ళల్లోని స్వచ్ఛత ప్రభుని నిలవేసినాయి.

"నీతో ఒక మాట చెప్పాలనుకుంటున్నాను" అని క్షణం ఆగి చెప్పటం మొదలుపెట్టాడు.

"మా తాతగారి హయాంలో బోలెడు ఆస్తులు, జమీ వుండేవట. నాన్నగారి చిన్నతనంలో ముందు తాతగారు, తరవాత జమీ పోయాయట. నాన్నగారికి నన్ను బారెట్లానో, ఐసీయస్సో చదివించాలని వుండేది. స్వేచ్ఛకన్న ముందు పిల్లలకు క్రమశిక్షణ యివ్వాలన్న అభిప్రాయం ఆయనది. ఒకళ్ళ తర్వాత ఒకళ్ళు ట్యూషను మాష్టర్లు రాత్రివరకూ వచ్చేవారు నాకోసం. ఎప్పుడూ ఒంటరిగా గదిలోనే గడిపేవాడ్ని. విసుగూ విరామం లేకుండా చదవబట్టేమో కొద్ది రోజుల్లోనే చదువంటే వెగటుపుట్టింది. కిటికీలోంచి అస్తమిస్తున్న సూర్యుడ్నీ, నీలాకాశంలో వజ్రాలు, వైడూర్యాలవలె మెరిసిపోతున్న నక్షత్రాల్నీ, వీధుల్లో చెట్లకింద స్వేచ్ఛగా ఆడుకునే నా వయసు పిల్లల్నీ చూస్తే చెప్పలేని ఆనందం కలిగేది. ఆ దృశ్యాల్ని చిత్రించాలనిపించేది. సైగల్, ముఖేష్ పాటలంటే నాకెంతో యిష్టం.

"నా వూహలన్నీ కలిపి ఏదో పాటలు పాడుకుని ఆనందించేవాడ్ని. అట్లా హైస్కూలు జీవితం గడచిపోయి కాలేజీలో చేరాక కొద్దిగా స్వేచ్ఛ దొరికింది. అజంతా, ఎల్లోరా, నాగార్జున శిల్పకళలు చూస్తూ పరవశించిపోయేవాడ్ని. లోకమంతా నా కళ్ళకు ఒక సుమనోహర దృశ్యంలాగా కనిపించేది. కళ అంటే అభిమానం, ఆరాధన ఏర్పడ్డాయి. నాటకాలు వ్రాయటం, వేషాలు కట్టటం, ప్రదర్శించటం మొదలుపెట్టాను. బి. ఏ. అయిందనిపించి కళామందిర్ స్థాపించాను. కళ్యాణీ నిన్నమొన్నటివరకూ ఏమనుకునేవాడ్నో తెలుసా ?" నవ్వుతూ కళ్యాణి మొహంలోకి చూసి తిరిగి కొద్దిగా ఆవేశంతో చెప్పుకుపోసాగాడు.

"కళ నా వూపిరి. కళ నా ప్రాణం. కళకి తప్ప మరొకరికి నా హృదయంలో చోటులేదనీ"_ టేబుల్‌మీద మోచేయి వుంచి చెంపకు చేయి చేర్చి, అతని మొహంలోకి చూస్తూ కుతూహలంగా వింటున్న కళ్యాణి, "మరి యిప్పుడో ?" చటుక్కున అనేసి నాలుక కొరుక్కుంది.

ప్రభు నవ్వాడు.

నవ్వుతూనే_ "యిప్పుడా ? కళతో పాటు కళ్యాణి కూడా కావాలంటోంది నా మనసు" అంటూ కళ్యాణి కళ్ళల్లోకి చిలిపిగా చూశాడు.

తల దించేసుకుంది కళ్యాణి.

"ఏమంటారు కళ్యాణీ !" ఆమె మొహంలోకి చూస్తూ, నిశ్శబ్దాన్ని భరించ లేకుండా వున్నాడు ప్రభు. ఏం చెపుతుందోనని ఆరాటంగా ఎదురుచూస్తున్నాడు.

"క్షమించండి" చాలా నెమ్మదిగా అంది తలెత్తకుండానే.

"అంటే !" ప్రభు నిటారుగా అయ్యాడు.

"నేను వివాహితను"

షాక్ తిన్నట్టు అదిరిపడ్డాడు ప్రభు.

ఆ క్షణాన అతని ముఖాన్ని చూడలేకపోయింది కళ్యాణి.

"ఎవరు కళ్యాణీ ఆ అదృష్టవంతుడు ?" కాస్త ఆగి హీనస్వరంతో అన్నాడు కుర్చీలో సరిగా కూచుంటూ.

"దుష్యంత మహారాజు."

అతని కనుబొమలు ముడిపడ్డాయి.

ఒక్క క్షణం అతని కళ్ళల్లోకి సిగ్గుపిగ్గుగా చూసి, భుజంమీది నుంచి తీసుకున్న కొంగు కొనను వేలికి మెలిబెట్టుకుంటూ నెమ్మదిగా చెప్పింది.

"ఆ రోజు స్టేజిమీద అంతమంది ప్రేక్షకుల సమక్షంలో నా వేలికి వుంగరం తొడిగి నా మెళ్ళో పూలహారం వేశారు. అది కేవలం నాటకంలో ఘట్టమే అయినా నేనలా అనుకోలేదు."

"కళ్యాణీ !" అతని పెదవులు అస్పష్టంగా పలికాయి ఆనందంతో. కళ్ళల్లోకి వెయ్యి దీపాల కాంతి ఒక్కసారిగా ప్రవేశించింది.

"కళ్యాణీ ! నువ్వు నిజంగా అలా అభిప్రాయపడ్డావా ?" సంభ్రమంగా అడిగాడు ప్రభు.

"ఔను" అన్నట్లు తలాడించటంతోనూ, కనురెప్పలు అల్లల్లాడించటంతోనూ జవాబిచ్చింది కళ్యాణి.

ప్రభు అంతరంగంలో సంతోషతరంగాలు వుప్పెనలా లేచాయి. ఆ ఆనం దాన్ని ఎలా వ్యక్తంచేయాలో తెలీక చప్పున లేచి కళ్యాణిచేతిని అందుకుని ముద్దుపెట్టుకున్నాడు.

అంతలో బేరర్ తలుపుతోసుకుని రావటంతో తన్ను తాను సంబాళించుకుని సరిగా కూచున్నాడు.

బేరర్ ప్లేట్లు సర్ది వెళ్ళిపోయాడు.




"మాటలు నేర్పితే తప్ప పలకలేని పంచవన్నెల చిలుక వనుకున్నాను సుమా యిన్నాళ్ళూ." చిలిపిగా కళ్యాణి కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు. "అనుకోకుండా ఒకే అభిరుచులు కలవాళ్ళం యిద్దరం తారసపడ్డాము. నిన్ను పెళ్ళిచేసుకుంటాను. నీలో దాగివున్న కళను వెలికితెచ్చి నిన్ను మహానటిని చేస్తాను." అట్లా మాట్లాడుతూనే తినటం ముగించాడు. కూల్ డ్రింక్ సిప్‌చేస్తూ అతని మాటలు వింటూ కూర్చుండిపోయింది ఆమె.

ఆ సంతోషంలో బేరర్‌కి పదిరూపాయలు టిప్‌వేశాడు ప్రభు.

బేరర్ సలామ్‌చేసి వెళ్ళిపోయాడు.

రూమ్‌నుంచి బయటికి రాబోతున్నవాడల్లా ఆగి, చటుక్కున కళ్యాణిని తనకు అభిముఖంగా తిప్పుకుని ఆమె భుజాలమీద రెండుచేతులూ వేసి "కళ్యాణీ! నా దగ్గర ఎప్పుడూ నటించనని మాటివ్వు" అన్నాడు.

తెల్లబోయి అంతలోనే కళ్ళు విశాలంచేసుకుని అతనికేసి చూసింది.

"ఏమీ అనుకోకు కళ్యాణీ! ఒక్క క్షణం నువ్వు పరాయిదానివన్న వూహాకే తట్టుకోలేకపోయాను. ప్లీజ్, యింకెన్నడూ హాస్యానికికూడా నా దగ్గర నటించకు" అన్నాడు.

కళ్యాణి కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి.

"ఛ. యీ మాత్రందానికే నొచ్చుకున్నావా, పిచ్చిపిల్లా" అంటూ దుమాలుతో ఆమె కన్నీళ్ళు వొత్తాడు. నుదుటిమీద ముద్దుపెట్టుకున్నాడు. యిద్దరూ బయటికి

వొచ్చారు. కళ్యాణిని ఆమె ఇంటివద్ద దింపి తిరిగివెళ్తూ 'కళ - కళ్యాణి' యిద్దరూ నా రెండుకళ్ళు. నా ఆరాధ్యదేవతలు. నా సొంతం" అనుకున్నాడు.

అతని మనసు సంతృప్తితో గర్వంతో నిండిపోయింది.

* * *

రావుగారు బాల్కనీలో వొంటరిగా కూర్చుని చదరంగం ఆడుకుంటున్నారు. ప్రభు తండ్రితో మాట్లాడాలని వెళ్ళాడు.

"నాన్నగారూ!" తండ్రికి ఎదురుగా నిలబడి పిలిచాడు ప్రభు.

తలెత్తి చూశారు రావుగారు.

మనసులోమాట ఎట్లా చెప్పాలో తెలీక తికమకపడ్డాడు ప్రభు.

"డబ్బు కావాలా?"

"ఊఁహూఁ."

"మరి?" అంటూ మళ్ళీ ఆటధ్యాసలోపడి తనకెదురుగా వున్న కొడుకుని మర్చిపోయాడు రావుగారు.

రెండు నిముషాలు అలాగే నిలబడి తన వునికిని గుర్తుచెయ్యటానికన్నట్లు చిన్నగా దగ్గాడు ప్రభు.

ఆట పూర్తి అయింది.

తలెత్తిచూశారు రావుగారు.

"నువ్వెప్పుడొచ్చావోయ్?" అన్నారు నవ్వుతూ.

"ఇప్పుడేనండి."

"ఈ రోజు మీ కళామందిర్‌కి శెలవా?"

"లేదు. మీతో మాట్లాడాలని."

"అలా కూర్చో."

ప్రభు తండ్రికి ఎదురుగా కుర్చీ జరుపుకుని కూర్చున్నాడు.

"నేను పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను" ఉపోద్ఘాతం లేకుండా సూటిగా చెప్పేశాడు.

"చాలా సంతోషం. యిన్నాళ్ళూ వొద్దన్నావని ఆగాను. ఇక శాస్త్రిగారిని పిలిపించి అమ్మాయిని వెదికే ప్రయత్నం చెయ్యమంటాను" అన్నారు.

ప్రభు తండ్రివంక చూశాడు. విషయం ఆయనకు అర్ధంకాక మాత్రంకాదు, అదేదో తనతోనే చెప్పించాలని.

"శాస్త్రిగారి అవసరంలేదు" అన్నాడు.

అర్థమయిందన్నట్లు తలపంకించి పావులదబ్బా మూత బిగించి, "ఎవరమ్మాయి ?" అని అడిగారు.

"తండ్రి లేడు. ఆర్థికమైన యిబ్బందులవల్ల కళామందిరంలో చేరింది. పేరు కళ్యాణి" అన్నాడు.

చదరంగం అట్టపడిచి దానిమీద డబ్బావుంచి, తాను నిలబడి పచార్లుచేయ సాగారు రావుగారు. తలదించుకుని ఎర్రతివాచీమీద అటూ యిటూ కదులుతున్న తండ్రి పాదాలమీద దృష్టి నిలిపివుంచాడు ప్రభు.

రావుగారు కొంచెం ఆగి, "నువ్వు పుట్టిన మూడోరోజున మీ అమ్మ పోయింది. ఇప్పుడు నువ్వున్న వయసులో అప్పుడు నేనున్నాను. చాలామంది స్నేహితులూ, శ్రేయోభిలాషులూ సలహా యిచ్చారు-మళ్ళా పెళ్ళిచేసుకోమంటూ. చేసుకోలేదు. ఎందుకో తెలుసా ?"

ప్రభు వింటున్నానన్నట్టు మౌనం వహించాడు. "మన వంశంలో రెండో పెళ్ళి ఆనవాయితీ లేదు. ఎవరూ చేసుకోలేదు కూడా. అయితే పాతికేళ్ళ వయసులో భార్యను పోగొట్టుకున్న దురదృష్టవంతుడ్నికూడా నేనొక్కడినే. వంశం గౌరవం, మర్యాద పాటించటం నా ధర్మం అనుకున్నాను. అంతే" చెయ్యి గాలిలోకి వూపి అక్కడితో ఆ ప్రసక్తి అయిపోయినట్లు క్షణం ఆగి తిరిగి చెప్పసాగారు.

"కళారాధన పేరుతో నువ్వు వూరూరూ తిరిగి స్టేజీఎక్కి నాటకాలు వేస్తున్నావు- కాదనలేదు. నాకు అయిష్టమే అయినా కాలంమారుతోందని సరిపెట్టుకున్నాను- ఒక్క విషయం నువ్వు గ్రహించే వుండాలి. నువ్వు ఉన్నత వంశానికి చెందినవాడివి కాబట్టి నాటకాలువేసినా కళాతపస్వి, కళాప్రియుడు అంటూ నీకు పొగడ్తలు అందుతున్నాయి. అదే లోకం, అదే ప్రజ, ఒక పేదవాడు ముఖానికి రంగుపులుముకుని స్టేజి ఎక్కితే, అతన్ని అందలం ఎక్కించదు. కూటికోసం కోటివిద్యలు అంటూ కొట్టిపారేస్తుంది. చూడూ, ఆ పిల్లతో కలిసి నాటకాలు వెయ్యి, అభ్యంతరంలేదు. ఇబ్బందుల్లో వుంటే సహాయం చెయ్యి. కాదనను. కాని, ఆ పిల్లమీద జాలితో యీ యింటికోడలిగా మాత్రం తీసుకురాకు."

ఎంత హుందాగా, మృదువుగా చెప్పినా ఆయన మాటల్లో మందలింపు, హెచ్చరిక తొంగిచూశాయి.

ప్రభు అభిమానం దెబ్బతింది. చివాలున లేచి నిలబడ్డాడు.

'జాలికీ, ప్రేమకీ మధ్య తేడా తెలియనంత పసివాడా తను ?'

"పెళ్ళంటూ చేసుకుంటే కళ్యాణినితప్ప ఎవరినీ చేసుకోను" దూకుడుగా అనేసి వెళ్ళిపోబోయాడు.

"ప్రభూ! అవేశంతో ఒక నిర్ణయానికి రాకు. యిలా వొచ్చి కూర్చో" తాపీగా అన్నారు రావుగారు. విసుగుతోవున్నా తండ్రిమాట తోసిపుచ్చలేక వొచ్చి కూర్చున్నాడు ప్రభు.

ప్రభు తత్వం రావుగారికి బాగా తెలుసు. అందుకే ఎలా నచ్చచెప్పటమా అన్న ఆలోచనలు మెదడులో సుడులు తిరుగుతున్నాయి.

"తండ్రిగా కాదు ఒక స్నేహితుడిగా నీకో సలహాయిస్తాను." తను సోఫాలో కూర్చుంటూ అన్నారు.

ఏమిటో చెప్పమన్నట్టు చూశాడు ప్రభు.

ఒక్క క్షణం మౌనం తరవాత "మంచి సంప్రదాయం కల కుటుంబంలోని అమ్మాయిని పెళ్ళిచేసుకో, ఆ పిల్లతో గుప్త సంబంధం అలా వుండనీ" అన్నాడు.

తండ్రికేసి చూస్తూ వుండిపోయాడు ప్రభు.

ధ్యానముద్రలో వున్నట్లు నిశ్చలంగా కళ్ళు మూసుకునివున్న ఆయన ముఖంలో ఎటువంటి భావాలూ చదవలేకపోయాడు ప్రభు. వంశం, పేరు ప్రతిష్ఠల గురించి చెప్పుకొచ్చిన తండ్రి యిచ్చే సలహా యిదా? వుత్తరోత్తరా వంశం పరువుప్రతిష్ఠలు నిలపవలసినవాడూ, ఆ వంశానికి వారసుడూ, కనుక సంప్రదాయం, ధనం, హోదా అన్నీ వున్న పిల్లను చూసి పెళ్ళాడాలి. తెర వెనుక ఎలాటి భాగోతం జరిగినా పరవాలేదు. అంటే తను రెండుగా విడిపోవాలి. ఉత్తముడు, గౌరవనీయుడు అనుకునేలా బాహ్యరూపం ధరించి స్టేజిమీద నటించాలి. తీరని కోరికలు తెరవెనుక తీర్చుకోవాలి. ఆత్మవంచన తనవల్ల కాదు. ఇటువంటి సలహా యిచ్చిన తండ్రి ?—

రావుగారు కళ్ళు తెరచి చూసేసరికి ప్రభు అక్కడ లేడు.

* * *

ఆ రోజు రిహార్సలుకి కళ్యాణి రాలేదు. ముసలావిడకి బాగులేదట. రెండ్రోజులు రాలేనని చెప్పమన్నదన్న వార్త అందించాడు ప్రసాదరావు.

సాయంత్రం తిన్నగా కళ్యాణి యింటికి వెళ్ళాడు ప్రభు.

పెంకుటింటిముందు జనం గుమికూడి వున్నారు.

కార్లోంచి దిగిన ప్రభును చూసి అత, మగ పక్కకు తప్పుకుని దారి యిచ్చారు.

ప్రభు చూసిన దృశ్యం- తల్లిశవంమీద పడి ఏడుస్తోంది కళ్యాణి. క్షణం అలాగే నిలబడిపోయాడు. తన్ను తాను సంబాళించుకుని చేరవగా కళ్యాణి చెంతకు వెళ్ళి ఆమెను వోదార్చాడు.

దహన సంస్కారానికి ఏర్పాట్లు చకచక జరిగిపోయాయి.

ఆ రాత్రి- పెంకుటింట్లో- దీపావి కెదురుగా బిక్కు బిక్కు మంటూ కూర్చుంది కళ్యాణి. వారం తిరక్కుండా కళ్యాణి మకాం చిన్నపైన్న బంగళాలోకి మారింది. ఇల్లంతా తిప్పి చూపించాడు ప్రభు. వంటకి, పైపన్లకు కళ్యాణికి తోడుగా వుండటానికి మనుషులను ఏర్పాటుచేశాడు ప్రభు.

కళ్యాణి హృదయం ప్రభు పట్ల కృతజ్ఞతతో నిండిపోయింది. అతని పక్కనే సోఫాలో కూర్చుని "మీ రుణం యీ జన్మలో తీర్చుకోలేను" అంది.

ఆమె కళ్ళు వర్షించటానికి సిద్ధంగావున్న శ్రావణమేఘాల్లా వున్నాయి. ఆనందంతో కృతజ్ఞతతో ముత్యాలవంటి కన్నీళ్ళు చెక్కిళ్ళ వెంట స్రవిస్తున్నాయి.

చప్పున వొళ్ళోకి లాక్కున్నాడు కళ్యాణిని.

"నాకు కావలసింది నీ కృతజ్ఞత కాదు. నీ ప్రేమ". సున్నితంగా ఆమె కన్నీటిని తుడుస్తూ ఆమెని హృదయానికి హత్తుకున్నాడు.

"కళ్యాణీ! యీ ఏర్పాట్లన్నీ నీమీద జాలితో చేశాననుకొంటున్నావేమో. కాదు. మన కోసం. మన యిద్దరి కోసం. యీ యింట్లో నీతో నా జీవితం కమ్మని కలలా సాగిపోవాలని."

ప్రభు మాట్లాడే ప్రతి మాటా హృదయపు లోతుల్నుంచి వస్తున్నట్లు గ్రహించి కళ్యాణి మనసు తేలికపడింది. బ్రతుకంటే భయం పోయి భావి జీవితం నందనవనంలా కన్పించింది అతని కౌగిట్లో.

* * *

చలి బాగా ముదిరిన జనవరి నెల తొలిరోజులవి. సాయంత్రం అరు కావస్తూంది. నల్లని టెరికాట్ పాంటు మీద ఎర్రని వులెన్ స్వెట్టరు తొడుకున్న ఒక యువకుడు 'కళామందిర్' బోర్డు చదువుకుని గబగబా గేటు తీసుకుని వొచ్చాడు. ద్వారం దగ్గరే వున్న నౌకరు అతన్ని ఆపి "లోపల రిహార్సల్సు జరుగుతున్నాయి" అన్నాడు.




పక్కనే వున్న ప్రసూన అనటంతో యువకుడు తిరిగి అందుకున్నాడు.

"ఆ మాట అంటారని తెలుసు సార్! ఏంచెయ్యను. పూటకోసం కోటి విద్యలు. వుద్యోగం దొరికేవరకూ మీరు ఏవేషంయిస్తే ఆ వేషంవేస్తాను. కాలేజీరోజుల్లో చాలాసార్లు స్టేజి ఎక్కాను. సార్! సార్! మీరు తల్చుకుంటే మరోపాత్ర ఎక్కడో యిరికించి నాకు వేషం యిప్పించగలరు, కాదనకండి." ప్రవాహంలా సాగుతున్న దేవదాసు మాటలు ఆగటంతో ప్రభు నవ్వుతూ "మంచిది. మిమ్మల్ని యీ రోజునుంచీ కళామందిర్‌లో సభ్యుడుగా చేర్చుకుంటాం" అన్నాడు

దేవదాసు ముఖం ఆనందంతో యింతయింది.

"కళామందిరం తన సభ్యులకు జీతాలిస్తుంది. మా సెక్రటరీ మీ జీతం నిర్ణయిస్తారు" అనగానే దేవదాసు సంతోషం పట్టలేక "చాలా చాలా థాంక్సు సార్" అంటూ ప్రభు చేతులుపట్టుకుని వూపేశాడు.

కాసేపు దేవదాసుతో మాట్లాడి ప్రభు, కళ్యాణి వెళ్ళిపోయారు.

"చలాకీగా స్మార్టుగా వున్నాడు. కుర్రాడు పనికొస్తాడు" అన్నాడు ప్రసూన ప్రసాదరావుతో,

"ఏమో చూస్తుంటే తలలు మార్చే రకంలా వున్నాడు" తన అభిప్రాయం వెలిబుచ్చాడు ప్రసాదరావు. అరగంటలో అందర్నీ చుట్టబెట్టేసి పరిచయం

చేసుకుని నవ్వుతూ, నవ్విస్తూ మాట్లాడాడు దేవదాసు.

అదే సమయంలో కళామందిరం యజమాని భూషణం వొచ్చాడు.

"కారణాంతరాలవల్ల యీ బిల్డింగు అమ్మేయ్యాలనుకుంటున్నాను. నాలు గేళ్ళనుంచీ మీరు అద్దెయిస్తూ వుంటున్నారు గాబట్టి ముందుగా మీకు చెప్పటం మంచిదనిపించింది. ప్రభుకి కొనేవుద్దేశం వుందో లేదో వారంరోజుల్లో చెప్పెయ్యమనండి" అనిచెప్పి వెళ్ళిపోయాడు.

ప్రసూన యీ విషయం ప్రభుకి ఫోన్‌లో చెప్పాడు.

"భూషణంగారితో నేను మాట్లాడతానులెండి" అని ఫోను పెట్టేశాడు ప్రభు.

* * *

"లక్షరూపాయలు కావాలి" అని అడిగిన ప్రభుకేసి ఒకసారి చూసి మళ్ళీ పేపరుచదవటంలో లీనమైపోయారు రావుగారు.

తండ్రి మౌనం ప్రభుకి చికాకు కల్గించింది.

"చెప్పండి ఎప్పుడిస్తారో" కాస్త విసుగ్గా అన్నాడు.

ఈసారి రావుగారు పేపరు మడిచి పక్కనవుంచి "లక్ష రెండక్షరాల మాటే నోయ్. లక్ష సంపాదించాలంటే ఎంత శ్రమపడాలో నీకింకా అనుభవంలేదు. మొన్ననేగా పాతికవేలు తీసుకెళ్ళావు" అన్నారు.

"భూషణం బిల్డింగు అమ్మాలనుకుంటున్నాడు. కొంటానని మాటిచ్చాను,"

"అంత డబ్బు నా దగ్గర లేదే."

ప్రభుకి తండ్రిమీద కోపం ముంచుకొచ్చింది.

'నెలకోసారి మద్రాసో, బొంబాయో వెళ్ళి రేసుల్లో తగలెయ్యటానికయితే వుంటుంది' కసిగా మనసులో అనుకున్నాడు.

పైకి, "భూషణానికి ఆ బిల్డింగు నేనే కొంటానని మాటిచ్చేశాను. యిప్పుడు కాదంటే నలుగురిలో తలెత్తుకోలేను. ఎలాగో నెలరోజుల్లో సర్దుబాటు చేసుకుని యివ్వండి" లేచి వెళ్ళిపోవటానికి వుద్యుక్తుడయ్యాడు.

"నీకెలాచెప్పాలో అర్థంకావటంలేదు" అదోలా బాధపడుతున్నట్లుగా తనలో తాను పైకి అనుకున్నారు రావుగారు.

గుమ్మంవరకూ వెళ్ళిన ప్రభు ఆ మాటలు విని ఆగి, "మీ వుద్దేశం? నేనా డబ్బు మూటగట్టి నీట్లో వొదుల్తాననా? ఇంజనీరుతో బిల్డింగు ఎస్టిమేటు చేయించాను. లక్షా పాతికవేలకి తక్కువచెయ్యదని చెప్పాడు. భూషణమైనా అమ్మా లనుకోగానే నాతో చెప్పాడుగాబట్టి అంత చవగ్గా వస్తోంది. పోటీ పెరిగితే లక్షా

పాతికవేలకిపైనే పలుకుతుంది. మీకేమైనా అనుమానాలుంటే వొచ్చి ఒకసారి చూడండి" నిష్ఠూరంగ అన్నాడు.

"బిల్డింగు విషయంకాదు నేనంటున్నది డబ్బు గురించే. నీకంతగా డబ్బు అవసరమనుకుంటే ఒక వుపాయముంది." మాటలు సాగదీస్తూ అన్నారు రావుగారు.

ఏమిటన్నట్లు చూశాడు ప్రభు.

"రాజమండ్రిలో రామచంద్రరావుగారని వున్నారు. ఆయనకో కూతురుంది. రమాదేవి_ నేను చూశాను ఆ అమ్మాయిని. బంగారు బొమ్మలా వుంటుంది. రెండులక్షల కట్నంతో ఆ పిల్లని నీకిస్తానని కబురుచేశారు. నిన్నడిగి ఏ సంగతీ రాద్దామని వూరుకున్నాను" అనేసి వెంటనే పేపరు అందుకున్నాడు ప్రభుని ఆలోచించుకోమన్నట్లు.

ప్రభుకి ఆ సమయంలో తండ్రిమీదవున్న గౌరవం మరోమెట్టు దిగజారింది. అదోలా తన తండ్రివంకచూసి గదిలోంచి విష్క్రమించాడు. కొడుకుచూపు ఆయన గుండెల్లో బాకుదిగినట్లుగా అనిపించి విలవిల్లాడిపోయారు.

టేబుల్మీదున్న కాగితం కలం అందుకుని యిలా రాశారు. "పసిపిల్లలను పెంచటం కష్టంకాదు. ఎదిగినపిల్లలే తల్లిదండ్రులకు సమస్య."

కాగితాన్ని మడిచి పేపర్వెయిట్ కిందపెట్టి సోఫాలో జారగిలబడి కళ్ళు మూసుకున్నారు.

* * *

వారం గడిచింది. భూషణం రెండుసార్లు ఫోనుచేసి "ఏంచేశావు నా మాట" అని అడిగాడు. కళామందిరం సభ్యులుకూడా ప్రోత్సహిస్తున్నారు. 'ఇంత చవుకలో రాదు. యీ బిల్డింగు చెయిజారిపోయిందంటే పిల్లి పిల్లల్ని యింటింటికీ తిప్పినట్టు యీ సరంజామాతో మనం ఎన్నిళ్ళు తిరగవలసి వుంటుందో, కొనేయటమే మంచిది' అని.

ప్రభుకి కొనాలని బాగావుంది.

పెద్దహాలుని ఆడిటోరియమ్గా వుంచి దాన్ని అనుకునివున్న విశాలమైన గదుల్ని రిహార్సల్సుకి వుపయోగించుకొవచ్చు. ఇంకా అలాటి గదులు చాలా వున్నాయి. వాటిని నాట్యమూ, సంగీతమూ నేర్పటానికి వినియోగించాలి. ఖాళీ స్థలంలో ఆర్టిస్టులకి వసతిసౌకర్యం ఏర్పాటుచెయ్యాలి. చుట్టూ చక్కని తోట వేయాలి. ప్రదర్శనలివ్వగా వొచ్చిన డబ్బుతో రీమోడల్ చేయించి రంగులు

వేయించాలి. అతని వూహల్లో కళామందిరం రూపురేఖలు దిద్దుకుని పూరిస్తూ కనిపిస్తూంది.

ఆలోచిస్తూండగానే వారం గడిచిపోయింది భూషణం వొత్తిడి ఎక్కువయింది. ప్రభు మేనేజర్ మల్లికార్జునశర్మను కలుసుకుని "శర్మాజీ, మీరెలాగయినా నాకు డబ్బు ఏర్పాటు చెయ్యాలి" అని అడిగాడు.

"ఏం చెప్పమంటావు బాబూ! రాబడితక్కువ ఖర్చులు ఎక్కువ. అందులో గత రెండేళ్ళుగా వర్షాలులేక పచ్చనిపొలాలన్నీ బీటలేసిపోయినాయి. వూళ్ళల్లో తాగటానికి నీళ్ళుకూడా పుట్టకపోవటంతో రైతులు భూములు వొదిలేసుకుని పట్నాలకు వలసపోయారు. యీ మధ్య మనవూళ్ళో రెండురోజులున్నాను. పచ్చని తివాచీలా కన్పించే చేలల్లో యిప్పుడు పుత్తగడ్డికూడ మొలవటంలేదు. పశువులకి తిండి లేదు. నీళ్ళు లేవు. ఎవరో కొందరు వయసుడిగినవాళ్ళు వూరు మీదున్న మమకారంతో వొదిలి వెళ్ళలేక అక్కడే అంటిపెట్టుకుని వున్నారుగానీ కుర్రకారంతా వెళ్ళిపోయారు. అమ్మజూపినా కొనే నాథుడు లేడు. కొద్ది రోజుల్లోనే ఆవూరు ఎడారిగా మారిపోతుందేమో ననిపించింది".

అట్లా చెబుతున్న శర్మగారి కళ్ళల్లో నీళ్ళు తిరగటం చూశాడు ప్రభు.

సిటీలో పుట్టి సిటీలో పెరిగి ప్రభుకు గ్రామాల గురించి పరిచయం పెద్దగా లేదు. అందుకే శర్మగారి మాటలు అతన్నంతగా కదిలించలేదు. అంతేకాదు డబ్బు కావాలని ఎప్పుడడిగినా శర్మగారు యిలాటి కథలు మొదలుపెడతారు.

"మన గౌరవానికి లోటులేకుండా ఎలాగో జరిగిపోతూంది...." శర్మగారి మాటలు విసుగనిపించి కుర్చీలోంచి లేచాడు ప్రభు.

"శర్మాజీ యిక చాలు" అనేసి విసురుగా యివతలికి వొచ్చేశాడు.

భూషణానికి మాట యిచ్చేశాడు. కళామందిరం సభ్యులంతా తను కొంటాడన్న అభిప్రాయంతోనే వున్నారు. డబ్బులేక విరమించుకున్నాననటం ఎంత చిన్నతనం— ప్రభుకి మతి పనిచెయ్యటంలేదు.

ఆ సాయంత్రం భూషణం మళ్ళా ఫోనుచేశాడు.

మనసు బాగులేక ఆ రాత్రి కళ్యాణి వద్దకు కూడా వెళ్ళలేదు ప్రభు. రాత్రంతా ఎడతెరిపిలేని ఆలోచనలతోటి గడిపాడు— వెలుగురేఖలు చీకట్లను మింగి వెలుగుతో లోకాన్ని నింపివేస్తున్న ఆ సమయంలో— వేకువ జామున భూషణం బిల్డింగు ఎలాగైనా కొనేయాలన్న నిర్ణయాని కొచ్చాడు ప్రభు. ● నిర్ణయం అతనికి కొంత తృప్తి నిచ్చింది. పక్కకు వొత్తిగిలి నిద్రపోయాడు.

● ● ●



పక్షం తిరక్కుండా భారీఎత్తున ఆర్భాటంగా ప్రభు పెళ్ళి జరిగిపోయింది.

ఆ రోజు రాత్రి గదిలో-

పూలతో అలంకరించిన పందిరిమంచాన్ని అనుకుని భర్త రాకకై నిరీక్షిస్తూ వుంది రమాదేవి.

ఆకు కదిలినా, చిరుగాలి సవ్వడి వినిపించినా అతనే వస్తున్నాడని గడపకేసి చూస్తూ వుంది.

గుండెల్లోంచి కోటి రాగాల ఆలాపనలు మధురంగా వినిపిస్తున్నాయి.

తొలిరేయిపి-అతనితో సమాగమాన్ని వూహల్లో మధురంగా చిత్రించుకుంటూ వుంది.

కళాభిమాని- కళాకారుడూను. తొలిరేయిని ఎంత అద్భుతంగా మలుచుకుంటాడో- ఈ రాత్రిని జీవితంలో మరువలేని రీతిలో-

అతని నడక- మాటా- చూపు- ప్రతీ కదలికా తన హృదయాన్ని మీటి, సప్త స్వరాల్ని పలికిస్తుంది.

నాట్యంరాని తనచేత నాట్యం చేయిస్తోంది.

ఊహల్లోనే తన్మయత్వాన్నీ, పారవశ్యాన్నీ అనుభవిస్తూంది ఆమె.

టంగున గంట కొట్టిన శబ్దంవిని, కళ్ళువిప్పి గోడగడియారాన్ని చూసింది.

'అర్ధరాత్రి దాటిపోయిందా ?!' అనుకుంది.

అప్పటికప్పుడే వూహల్ని విడిచి వాస్తవాని కొచ్చిన మనసు ఆలోచనకు వుపక్రమించింది.

'తనింతవరకూ పొరపాటుగా వూహించిందా ? అతనికి యీ పెళ్ళి యిష్టం లేదా ? అతని దృష్టిలో మొదటి రాత్రికి ఏ ప్రాముఖ్యతా లేదా ? కళాకారుల చిత్తాలు చిత్రంగా వుంటాయంటారు, నిజమేనా ?'

గదంతా ఒకసారి కలియచూచింది.

టేబుల్‌మీది పళ్ళు ఫలహారాలు అలానే వున్నాయి. మంచానికి అలంకరించిన పూలు వాడనైనాలేదు. తమ సహజ పరిమళాన్ని వెదజల్లుతూనే వున్నాయి.

అప్రయత్నంగా నాలుగడుగులు వేసి నిలువుటద్దంముందు నిలుచుంది.

'రమా ! అప్పుడే అభిసారికలా విరహమనుభవిస్తున్నావా. నిరుత్సాహ పడకు. ఏ క్షణాన అయినా వెల్లువ గోదావరిలా వొచ్చి నిన్ను వుక్కిరిబిక్కిరి చేయగలడు.'

ప్రతిరూపం అన్న మాటకు రమ సిగ్గుపడింది.

గదిచుట్టూ చూసింది. అందంగా కళాత్మకంగా కనిపించాయి పెయింటింగ్స్. ముని ఆశ్రమం చుట్టూ రకరకాల పొదరిళ్ళు. చెట్లమీద నెమళ్ళు, కోయిలలు. అక్కడక్కడా లేళ్ళు- పొదలమాటున అస్పష్టంగా ఆకారం. అది పురుషుడిది. అది చూస్తూ శకుంతల నిలుచున్న భంగిమను అద్భుతంగా చిత్రించాడు. ఆమె కళ్ళల్లో ఆశ్చర్యం, సిగ్గు అనురాగభావాలు స్పష్టంగా కన్పించేలా చిత్రించాడు కళ్ళను.

కొద్దిగా ముందుకు నడిచి మరో పటంముందు ఆగింది.

కొండ వెనుకగా అస్తమిస్తున్న సూర్యుడు- కొండను వొరసుకుని వొంపులు తిరుగుతూ వొయ్యారంగా పారుతున్న సెలయేరు. దూరన ఓ పెద్ద భవంతి- చుట్టూ చెట్లు-

నాట్యభంగిమలో స్త్రీమూర్తి ఓ చిత్రంలో.

వీటన్నిటికీ భిన్నంగా ఎదురుగోడమీద పెయిటింగులో పెద్ద భవంతి. ఆ భవంతి ఎదురుగా ఖాళీ స్థలం. ఒక పెద్ద చెట్టు. చెట్టు కింద వొంటిమీద బట్టలు

సరిగాళ్ళేని పిల్లలు గోళీలు ఆడుతున్నారు. వాళ్ళ [illegible] న్నాయి. వొంటిరంగు నలుపు. అయితే కళ్ళల్లో కాంతి, [illegible] కాలాతు ఉత్సాహం.

భవంతిలో నిలబడిన పసివాడు విలువైన బట్టలు ధరించి వున్నాడు. అతని ముఖంలో ఏదో దిగులు. ఆ పిల్లలవంకే తదేకంగా చూస్తూ-

పక్కన వున్న పంజరం తలుపు తెరిచింది. పంజరంలో చిలుక లేదు.

ఒకో పటాన్నే చూస్తూ కిటికీవద్ద కొచ్చి విలబడి తెర తొలగించింది.

దూరంగా తాటతోపుల వెనుక వుదయిస్తున్నాడు బాలభానుడు.

తిరుచూర్ణం అరబోసినట్టుగా వుంది ఆకాశం.

తూర్పు దిశగా బారులు తీరి సాగిపోతున్నాయి పక్షులు.

తెల్లారిపోయింది. 'కాలం ఎవరికోసమూ ఆగదు' అనుకుంది నిట్టూరుస్తూ.

• • •

రెండోరాత్రి- ఆశలన్నీ కూడదీసుకుని అతనికోసం ఎదురుచూసిన రమాదేవికి మళ్ళీ నిరాశే ఎదురయ్యింది.

మూడో రాత్రి కూడా గడిచిపోయి మామూలుగా తెల్లావారింది.

అక్కడ ప్రభు చాలా హడావుడిగా వున్నాడు. కళామందిరం కొన్నందుకు సభ్యులు, మిత్రులు అతన్ని అభినందించారు.

సభ్యులంతా కలసి కళామందిరాన్ని ఎలా రూపొందించాలో ఏయే మార్పులు చేస్తే బాగుంటుందో చర్చించారు.

ఎక్కడెక్కడ ప్రదర్శనలు యిస్తే కలక్షన్లు బాగావస్తాయో తర్కించుకున్నారు.

పగలంతా కళామందిరంలో మిత్రులమధ్య గడిపి రాత్రులు కళ్యాణితో స్వర్గసుఖాలు చవిచూస్తూ తనకు పెళ్ళయిందన్న విషయం, తనకోసం కొత్త పెళ్ళికూతురు ఎదురుచూస్తూ వుంటుందన్న విషయం విస్మరించాడు ప్రభు.

నాలుగోరోజు వుదయం ప్రభుకోసం కబురుపంపారు రావుగారు. వెంటనే యింటికొచ్చాడు. అతను వచ్చేసరికి హాల్లో పచార్లుచేస్తున్నారు రావుగారు.

"నన్ను పిలిచారట" తండ్రికెదురుగా విలబడి అడిగాడు ప్రభు.

రావుగారు ఆగి ప్రభు ముఖంలోకి చూచారు.

"ప్రభూ! నాతో చెప్పించుకోవటానికి నువ్వేమీ పసివాడివి కాదు. నీకు పెళ్ళయి మూడురోజులయింది. ఇంటిముఖం చూళ్ళేదు. మీ అమ్మ బతికివుంటే నిన్నిలా

వారిని [illegible] అమ్మాయి ఏమనుకుంటుంది? చెప్పి పెళ్ళి వంకరించు" అన్నారు మందలింపు ధోరణిలో.

'శాసించటంతప్ప కొడుకు మనసేమిటో గ్రహించలేరు' అనుకుని పైకి "ఆ వలపా మీరేయిచ్చారు, డబ్బుకోసం" అనేసి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

రావుగారు నిర్ఘాంతపోయి శిలలా వుండిపోయారు.

ఏమీ తోచక కిందిగదులు చూడటానికి వొచ్చిన రమాదేవి యాదృచ్ఛికంగా తండ్రీకొడుకుల సంభాషణ పూర్తిగా విన్నది. ఆమెకి క్షణం మతితప్పింది. విషయం అర్థమవుతున్నకొద్దీ భూమి తిరిగిపోతున్నట్టు కాళ్ళకింద కుంగిపో తున్నట్టు అనిపించింది. వొళ్ళంతా చెమటతో తడిసి ముద్దయిపోయింది. గోడకి ఆనుకుని కళ్ళుమూసుకుని ఎంతసేపు వుండిపోయిందో ఆమెకే తెలియదు.

సాయంత్రంవరకు తన గదిలోనే గడిపాడు ప్రభు.

తండ్రీకొడుకులు మళ్ళీ మాట్లాకోలేదు. భోజనాలు కూడా మౌనంగానే ముగించారు. బట్టలు మార్చుకుని కళ్యాణి యింటికి బయలుదేరాడు ప్రభు.

ద్రౌపది ఓ చీటీ అందించి 'అమ్మగారు మీ కిమ్మన్నారు' అంది.

'ప్రభూ. ఒక్క క్షణం మీతో మాట్లాడే అవకాశం కల్పించండి– రమ' అని వుంది అందులో. అతని కనుబొమలు ముడిపడ్డాయి. కొంచెం ఆలోచించి చేతిలో చీటీ పట్టుకుని చకచక మెట్లుఎక్కి పైకివెళ్ళాడు.

అది రమాదేవి గది.

అతని రాకకోసమే ఎదురుచూస్తున్నట్లు గుమ్మంలోనే నిలుచుంది ఆమె.

ఆమెను చూచి ప్రభు ద్వారం యివతలే ఆగిపోయాడు.

ఆనాడు విష్ణుమూర్తి జగన్మోహిని అవతారం ఎత్తినపుడు యిలానే వుండే వాడేమో అనుకున్నాడు మనసులో.

రమ సిగ్గువలన అతనికేసి సూటిగా చూడలేకపోయింది. విశాలంగా కలువ రేకుల్లావున్న ఆమె కనురెప్పలు బరువుగా వాలిపోయాయి. నల్లటి ముఖమల్ చెప్పుల్లోంచి, తెల్లగా మెరుస్తున్న అతని పాదాలవైపు దృష్టి నిలిపివుంచింది.

ఎందుకు పిలిచిందో తనే చెపుతుందని అతను– మగవాడు కనుక అతనే పలుక రిస్తాడని ఆమె.

ఎవరి అభిప్రాయాల్లో వాళ్ళుండి ఒకరినొకరు పలుకరించుకోలేదు.

రెండు క్షణాలు మౌనంగా గడిచిపోయాయి.

ఆమె ముందు అలా నిలబడటం యిష్టంలేక ప్రభు చేతిలోవున్న చీటిని




చూపుతూ "ఏమిటిది" అని అడిగాడు.

తలెత్తి చూసింది రమ.

'అదీ నేనే చెప్పాలా?' అన్నట్టున్నాయి ఆమె చూపులు.

అతను ముఖం మరల్చుకున్నాడు.

రమ మనస్సు చివుక్కుమంది. అయినా కూడదీసుకుంది.

"లోపలికి రండి" అంది మృదువుగా.

అతను నిలబడిన చోటునుంచి కదల్లేదు. ఆమె హృదయం మరోసారి గాయపడింది. ఎలాగో మనసుని సమాధానపరచుకుని సాధ్యమైనంత సౌమ్యంగా యిలా అంది.

"చూడండి. లవ్ ఎట్ ఫస్ట్ సైట్ అంటే నాకు నమ్మకంలేదు. నా మెడలో మూడుముళ్ళు వేశారు. నేనిప్పుడు మీ దాన్ని. ఇది నాది అనుకోగానే ఒక వస్తువు మీదయినాసరే అధికారం, అభిమానం ఏర్పడతాయి. నాతో మాట్లాడండి. కొద్ది రోజులు నాతో గడిపిచూడండి. నేనంటే యిష్టం కలుగుతుందోలేదో మీరే...."

ఆమెమాట యింకా పూర్తికాలేదు. అతను మెట్లుదిగి వెళ్ళిపోయాడు.

ఆమె అభిమానం విపరీతంగా దెబ్బతింది. కళ్ళల్లో నీళ్ళు పొంగుకొచ్చాయి. తలుపు మూసేసి తలుపుకానుకుని నిలుచుండిపోయింది.

'నాన్నా! పెళ్ళవుతుందే ఆడపిల్లల సమస్య తీరిపోతుంది అనేవాడివి కదా!

కాదు అసలు సమస్య అక్కడే మొదలవుతుంది' అనుకుంది కళ్ళనీళ్ళతో.

* * *

కళామందిర్ రీమోడలింగుకి, ఎక్స్టెన్షన్‌కి ప్లాను గీయించే హడావుడిలో వుండి 'సుప్రభాతం' కామెడీ నాటకంలో హీరోఛాన్సు దేవదాసు కిచ్చాడు ప్రభు. తనకి హీరోవేషం యిచ్చినందుకు ఎంతో సంబరపడిపోయాడు దేవదాసు. ముఖ్యంగా కళ్యాణిపక్కన తాను నటించటాన్ని తలచుకుని గాలిలో తేలిపోయాడు. అయితే హీరోయిన్ ప్రస్తావన వొచ్చినప్పుడు కళ్యాణికి బదులుగా స్వర్ణకుమారి నటించాలి అన్నపుడు అతని వుత్సాహమంతా నిప్పుమీద నీళ్ళు చల్లినట్లుగా అయ్యింది.

'సుప్రభాతం' నాటకానికి రిహార్సల్సు ప్రారంభమయాయి.

మళ్ళీ మళ్ళీ అవే ప్రదర్శించటంకంటె కొత్తవయితే బాగుంటుందని ప్రసూన సూచించటంతో ప్రభు మరో కొత్తనాటకానికి స్క్రిప్టురాయటానికి పూనుకున్నాడు. పగలంతా నిర్మాణ కార్యక్రమంలోనూ, రాత్రుళ్ళు రచనతోనూ ఎంతో వొత్తిడిగా వుంటున్నాడు ప్రభు.

ఇరవై రోజుల వ్యవధిలోనే సుప్రభాతం నాటకాన్ని విజయవాడలో ప్రదర్శించారు. కలక్షను ఏమంత రాలేదు. ప్రేక్షకులు చివరివరకూ చూచే వోపికలేదన్నట్టు మధ్యలోనే లేచిపోయారు కొంతరు. దేవదాసు, స్వర్ణకుమారి యథాశక్తి నటించారు. కొందరు ప్రేక్షకులు 'కళామందిరం నాటకం అనగానే శకుంతల జంట వుంటారనుకున్నాం' అనుకోవటంకూడా వినిపించింది.

హైదరాబాద్ తిరిగివచ్చాక నాటిక విజయవంతం కాకపోవటానికి కారణాలు ఏమిటన్న విషయమై చర్చించారు సభ్యులంతా కూర్చుని.

"కళ్యాణిగారు హీరోయిన్‌గా వెయ్యకపోవటమే నాటకం ఫెయిల్‌కావటానికి కారణం. ఆవిడ వుంటే కలక్షన్సు బ్రహ్మాండంగా వుండేవి" అనేశాడు దేవదాసు నిర్మొహమాటంగా.

"నీ మాటలతో మమ్మల్ని నవ్వించటం గొప్ప కాదోయి. ప్రేక్షకుల్లో ఒక్కడున్నా నీ మాటలకి నవ్విన పాపానపోలేదు" అన్నాడు ప్రసాదరావు.

"నేను మిమ్మల్ని బాగా అబ్జర్వ్ చేస్తున్నాను ప్రసాదరావుగారు. ఎందుకనో మొదట్నుంచీ మీకు నేనంటే గిట్టకుండా వుంది" అన్నాడు దేవదాసు.

ప్రభు యిద్దరినీ వారించి, తరాలు – అంతరాలు, శకుంతల నాటకాలు ప్రద

ర్శించబోతున్నట్టుగా పబ్లిసిటీ యివ్వమని ప్రసూనకు చెప్పారు.

* * *

ప్రభు టేబుల్‌ముందు కూర్చుని కళామందిర్ ప్లానులూ జమాఖర్చులూ చూచుకుంటున్నాడు.

అతనికి కాస్త దూరంలో సోఫాలో జారగిలబడి కూర్చుంది కళ్యాణి। అతని ముఖాన్నే తదేకంగా చూస్తూ ఏమిటో వూహించుకుంటూ అనిర్వచనీయమైన ఆనందాన్ని అనుభవిస్తోంది ఆమె.

పేజీ తిప్పుతూ అనుకోకుండా తలెత్తి చూశాడు ప్రభు.

అపురూపమైన దేదో చూస్తున్నట్టు ప్రాణాలన్నీ కళ్ళల్లో నిలుపుకుని తన మొహంలోకే చూస్తున్న కళ్యాణిని చూసి అతడు ముగ్ధుడయ్యాడు.

చేతిలోని కాగితాలు బల్లమీద పడేసి లేచాడు.

కళ్యాణి పక్కనే వొచ్చి కూచుని ఆమె ముఖానికి తన ముఖాన్ని చేరుస్తూ "కళ్యాణీ ఎమిటలా చూస్తున్నావు ?" అంటూ అడిగాడు.

కళ్యాణి చిలిపిగా చూసింది.

"ఏముంది. యీ ఆరడుగుల పొడవాటి అబ్బాయి పసిబాబుగా నా వొళ్ళోకి వొస్తే ఎలావుంటుందా అని"....

కళ్యాణి వాక్యం పూర్తికాకుండానే ప్రభు కళ్యాణి వొడిలో వాలిపోయాడు.

"నేనే పసివాడ ననుకుని జోలపాడెయ్యి. ఏం" అంటూ ఆమె చేతిని తన గుండెలమీద అమర్చుకున్నాడు.

కళ్యాణి మురిపెంగా చూసింది అతన్ని.

"ఉహూ. మిమ్మల్ని కాదు, బుల్లి ప్రభూనే జోకొడతాను. నా బాబుకి మీ రూపంతోపాటు మీ మంచి మనసు కూడా రావాలి." అతని జుట్టులోకి వేళ్ళు పోనిస్తూ అంది.

ప్రభు కళ్ళు కాంతివంతమయ్యాయి. పెదవులమీదికి చిరునవ్వు వచ్చింది.

"నిజంగా కళ్యాణీ !" అంటూ ఆమె కళ్ళల్లోకి చూశాడు.

ఔనన్నట్లు కళ్ళు అల్లల్లాడించింది.

ప్రభు తన రెండుచేతులూ ఆమె మెడచుట్టూ వేసి, తల వొంచి, పెదివుల మీద ముద్దుపెట్టుకున్నాడు.

"కళ్యాణీ ! నీకు తెలుసా ? నాకు పిల్లలంటే యిష్టమని." ఆమె మెడకు చుట్టిన తన చేతుల్ని సరిగా తీసుకుని కళ్యాణి చేతిని తన ఛాతీమీద వుంచుకుని

ఆ చేతిని మృదువుగా నిమురుతూ చెప్పుకుపోసాగాడు "నాకు తోడబుట్టిన వారెవరూ లేరు కళ్యాణీ. మా నాన్న నన్ను పంజరంలో చిలకలా పెంచారు. ఎందుకో చిన్నప్పట్నుంచీ పసిపిల్లలంటే నాకెంతో యిష్టం. వాళ్ళ బోసి నవ్వులూ, చిలిపి చేష్టలూ, ముద్దు ముద్దు మాటలూ అన్నీ నాకెంతో యిష్టం."

అతనికి వున్నట్టుండి తన చిన్నతనం గుర్తొచ్చింది.

అప్పుడు ప్రభు వయసు పదేళ్ళ లోపు.

అతన్ని చూడటానికో ఆయా వుండేది.

ఆయాకో పాప వుండేది.

ఆ పాప నేరేడుపండు రంగులో బొద్దుగా ముద్దొస్తూ వుండేది. కళ్ళు గోళీకాయల్లా మెరుస్తూ వుండేవి. నవ్వితే సొట్టలు పడేవి.

చిందరవందరగా వున్న జుట్టు సగం నుదురును కప్పేది. రమ్మని చేయి చాపితే చాలు పడుతూ లేస్తూ తపతప అడుగులేస్తూ కిలకిల నవ్వుతూ వొచ్చేది. చేయి జాపితే అందుకోబోయేంతలో ఎక్కడ్నుంచి వచ్చేదో ఆయా చప్పున అడ్డుపడి పిల్లనందుకుని 'తప్పు బాబూ! మీకు దీంతో ఆటలేమిటి? మీ బట్టలు మురికవుతాయి' అంటూ కూతుర్ని చంకనేసుకుని పోయేది.

అలా వొంటరిగా మేడమీద గదుల్లోనే ప్రభు పెరిగి పెద్దవాడయ్యాడు.

అలా తన చిన్నతనం ముచ్చటిస్తున్నవాడల్లా ప్రభు దివాలున లేచి ఆమె పరసనే కూర్చుంటూ "కళ్యాణీ! బాబుకు ఏపేరు పెడదామంటావు?" చిన్నగా అడిగాడు.

"మీ యిష్టం" సిగ్గుపడుతూ అంది.

"భరత్‌కుమార్."

"పాపవుతేనో?"

జేబులోంచి పెన్నుతీసి కళ్యాణి అరచేతిలో 'భారతి' అని రాశాడు.

కళ్యాణి ప్రభు భుజంమీద తల ఆన్చుకుంది.

ఇరువురూ కొద్దిసేపు మౌనంగా ఉండిపోయారు.

ఊహల్లో ఏవో దృశ్యాలు చూస్తూ,

"కళ్యాణీ!"

"ఊ" మత్తుగా పలికింది కళ్యాణి కంఠస్వరం.

"ఇక మీదట నువ్వు స్టేజి ఎక్కకూడదేమో, ఆ రెండు నాటకాలూ కాన్సిల్ చేయించనా?"




కళ్యాణి సరిగా కూచుంది.

"వొద్దు. డబ్బు కోసం మీరు ఎంత యిబ్బందిపడుతున్నారో చూస్తున్నాగా. యీ రెండూ కానివ్వండి. తర్వాత ఎలానూ స్టేజి ఎక్కటం బాగుండదు" అంది.

ప్రభు జవాబివ్వలేదు.

మెల్లగా లేచివెళ్ళి టేబుల్‌ముందున్న కుర్చీలో కూర్చుని కాపేపట్లో ఏకాగ్రతతో పనిలో లీనమయ్యాడు.

• • •

దేవదాసు కళ్యాణి యింటికొచ్చాడు.

కళ్యాణి అతన్ని కూచోమని తనూ కూచుంది.

దేవదాసు యిల్లంతా కలయజూచి 'మీ టేస్టు గొప్పగా వుంది. యింటివి కళాత్మకంగా తీర్చిదిద్దావు.' అన్నాడు.

"నాదేం కాదు, ఆ గొప్పంతా ప్రభుగారికే" అంది కళ్యాణి నవ్వుతూ.

"కళ్యాణిగారూ ! సుప్రభాతం ఫెయిల్యూరుకి నేనే కారణమంటున్నారు మెంబర్సంతా. మీరేమంటారు ?" అని అడిగాడు. కుతూహలపడ్తున్నట్టుగా ముందుకు వొంగాడు.

"మీ ఒక్కరిమూలంగానే అని ఎలా అనగలం?"

"కరక్టు. బాగా చెప్పారు. ఒక నటుడు బాగా నటించనంతమాత్రాన నాటకం

ఫెయిలవుతుందంటే నేను వొప్పుకోను. కథలో పట్టువుండాలి. డైలుగులు గుండెల్ని తాకాలి, నటులు నటిస్తున్నామన్న స్పృహలేకుండా పాత్రలో జీవించాలి. యిలా అంతా కలిస్తేనే నాటకం రక్తికడుతుంది. ఏమంటారు?"

ఔనన్నట్లు తలూపింది.

"మీరేమన్నా అనుకోండి కళ్యాణీ, మీరు హీరోయిన్ వేస్తే ఆ నాటకానికి బంపర్ కలక్షన్సు వొచ్చేవి. అంతేకాదు, మీ పక్కన నటించేవాళ్ళకి కూడా కొత్త శక్తి, వుత్సాహం వొస్తాయి."

కళ్యాణి మొహంలోకి చూడబోయాడు.

కళ్యాణి నవ్వి వూరుకుంది.

పనిమనిషిని పిలిచి కాఫీ తెమ్మంది.

దేవదాసు కాఫీ పూర్తిచేసి సిగరెట్టు వెలిగించాడు.

ఆ వాసనకి కళ్యాణికి కడుపులో తిప్పినట్లయ్యింది.

నోటికి చెయ్యి అడ్డంపెట్టుకుని వాష్‌బేసిన్ దగ్గరకు వెళ్ళి వాంతిచేసుకుంది.

నోరుకడుక్కుని యిటుతిరిగేసరికి గడపలో నిలబడి దేవదాసు ఆమెనే చూస్తున్నాడు.

కళ్యాణి మొహమంతా చెమటలుపట్టాయి.

నీరసంతో కళ్ళు తిరిగినట్లయి తూలిపడబోయింది.

రెండడుగుల్లో సమీపించి కళ్యాణి పడిపోకుండా పట్టుకున్నాడు దేవదాసు.

"సారీ. మీకు సిగరెట్టువాసన పడదనుకుంటా" నొచ్చుకుంటూనే కళ్యాణిని నడిపించుకొచ్చి సోఫాలో కూర్చుండబెట్టాడు.

"డాక్టరుగారికి ఫోన్‌చేస్తానుండండి" అంటూ ఫోన్‌ను సమీపించబోయాడు.

"వొద్దు. అవసరంలేదు" చెంగుతో ముఖం తుడుచుకుంటూ నీరసంగా అంది.

"అదేమిటి. అలా వాంతిచేసుకుని డాక్టరు అవసరంలేదంటారు?" కళ్యాణి వైపు ఆశ్చర్యంగా చూస్తూనే ఫోను అందుకోబోయాడు.

"అబ్బ, వొద్దండీ. యీ వాంతులకు డాక్టరుతో పనిలేదు" విసుగ్గా అని అలా అనేసినందుకు సిగ్గుపడుతూ ముఖం పక్కకు తిప్పుకుంది.

"ఐసీ, అయితే మీరు ప్రెగ్నెంటన్నమాట!" ఫోన్ పెట్టేసి కళ్యాణివైపు అదోలా చూశాడు.

కళ్యాణి జవాబివ్వలేదు.

"మీరూ ఒక మామూలు ఆడదానిలా పిల్లల్ని కనటమా? అయితే మీకు

భవిష్యత్తు ఏముంటుంది? మంచి నటిగా పైకిరావాలన్న కోరిక మీకు లేదన్న మాట" వొచ్చి ఆమె కెదురుగా కూచుంటూ అన్నాడు.

దేవదాసు మాటలు కళ్యాణికి కోపాన్నీ చికాకునూ కలిగించాయి.

ఏమిటతని వుద్దేశం?

"నటులు పెళ్ళిచేసుకోగూడదు, పిల్లల్ని కనగూడదు అనా మీ అభిప్రాయం?"

అతను చప్పున లేచినిలబడ్డాడు. "కాదు, ఇప్పుడు మీరు నా అభిప్రాయాలు వినే ధోరణిలోలేరు. మరోసారి వస్తాను. మీరు రెస్టుతీసుకోండి" అనేసి గబగబ వెళ్ళిపోయాడు.

* * *

రాజమండ్రిలో ప్రదర్శించిన శకుంతల, తరాలు - అంతరాలు నాటకాలు రెండూ ప్రభు ఆశించినంత కలక్షన్సు తేలేకపోయాయి.

మరో ట్రూపుని కాకినాడ పంపాడు.

భవననిర్మాణం చురుగ్గా సాగుతోంది.

ఇంకో యాభయివేలుంటే ఆడిటోరియంకి కావలసిన ఫర్నిచరు, భవనానికి తుదిమెరుగులు, ప్రారంభోత్సవం అన్నీ అయిపోతాయని ప్రభు అభిప్రాయం. ప్రదర్శనలిస్తూ అంత సొమ్ము కూడబెట్టటం సాధ్యంకాదనీ, అందుకు చాలా వ్యవధి పడుతుందనీ ఆ మధ్య యిచ్చిన ప్రదర్శనలవల్ల తెలిపోయింది.

మళ్ళీ డబ్బు సమస్య.

కేవలం నాటకాలమీద ఆధారపడితే అంత పెద్దమొత్తం చేతికిరాదు. మధ్యలో పని నిలిపివేయవలసివస్తుంది. తలపెట్టిన పని పూర్తవుతేగాని ప్రభుకి నిద్రపట్టదు.

ఆలోచనల్లో మునిగిపోయాడు.

కొంత డబ్బు తండ్రిని అడిగితేనో అన్న అభిప్రాయం కల్గింది. దాంతో తాను యింటిమొఖం చూడక చాలానాళ్ళయిందన్న విషయం గుర్తుకొచ్చింది. వెంటనే యింటికి బయలుదేరాడు. ప్రభు వెళ్ళిన కాసేపటికి దేవదాసు కళ్యాణి యింటికి వొచ్చాడు.

పనిమనిషి అందించిన కాఫీతాగి సిగరెట్టుబదులు వక్కపొడి నోట్లోవేసు కుంటూ "మీకోసం కొత్త అలవాటు చేసుకున్నాను" అన్నాడు నవ్వుతూ.

ఏదో మాగజైను చూస్తున్నదల్లా "పోనీలెండి ఒక్క చెడ్డఅలవాటు మానుకున్నారు" అంది కళ్యాణి.

"అమ్మమ్మ ఎంతమాట అనేశారు. మనిషి అలవాట్లకు బానిసండీ. ఒక్క

సారిగా మానుకోవటం కష్టమండీ. అన్‌లెస్ ఆ మనిషికి పట్టుదల, ఆత్మ విగ్రహం వుంటేతప్ప" అని క్షణం ఆగి "ఫరెగ్జాంపుల్ మీ విషయం తీసుకోండి. ప్రభు పక్కనే నటించటానికి మీరు అలవాటుపడిపోయారా. వున్నట్టుండి స్టేజిమీద నా పక్కన నటించమంటే నటించగలరా?"

కళ్యాణి ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూశాడు.

మాగజైనులోంచి తలెత్తి ఒక్కక్షణం చూసి సమాధానమివ్వకుండా వూరు కుంది కళ్యాణి.

"కోపం వొచ్చిందా?" టీపాయ్‌మీదున్న పేపరు తీసుకుంటూ అడిగాడు.

లేదన్నట్టుగా తల అడ్డంగా వూపింది.

"అమ్మయ్య, బతికించారు." కళ్ళు గట్టిగా మూసుకుని గుండెలమీద చేయి వేసుకున్నాడు. అతని అభినయానికి నవ్వొచ్చింది కళ్యాణికి. తెల్లని పలువరస తళుక్కున మెరిసేలా అందంగా నవ్వింది.

నవ్వుతుంటే మరీ అందంగా కనిపిస్తున్న కళ్యాణిముఖాన్ని చూస్తూ తన్ను తానే మరచిన దేవదాసు తెప్పరిల్లి,

"కళ్యాణీ! పొగడ్త అనుకోకపోతే మీలో గొప్ప టాలంటు వుంది. నా అభిప్రాయం ఏ కళాకారుడూ గిరిగీసుకుని ఒక పరిధిలో కూర్చోగూడదు. కళాకారుడు స్వేచ్ఛాజీవి కావాలి. అతను ఏ ఒక్కరికీ అంకితమైపోగూడదు."

ఏదో ఆవేశంలో వుండి మాట్లాడుతున్నట్టు అన్నాడు.

అతను చెపుతున్నదేమిటో అర్థంకానట్టు చూసింది.

"మీరేమీ అనుకోనంటే కొన్ని సూచన లివ్వాలనుకుంటున్నాను."

సాభిప్రాయంగా చూశాడు.

"చెప్పండి" అంది కళ్యాణి.

"ముందు ముందు మీకు మంచి భవిష్యత్తు వుందనిపిస్తోంది. కానీ చేతులారా మీకు మీరే పాడుచేసుకుంటున్నారు. మీరు ప్రభుతో తప్ప ఎవరితోనూ నటించరు. మీ యిద్దరినే స్టేజిమీద చూసీ చూసీ ప్రేక్షకులకు కొద్దికాలానికే విసుగు పుడుతుంది. ఎందుకంటారా? ఆడియన్సుకి ఎప్పుడూ ఛేంజికావాలి. అందుకని మీరు ఫ్రీగా యితరులతో కూడా నటించటానికి అలవాటుపడాలి."

కళ్యాణి ముఖాన్ని పరీక్షగా చూస్తూ యింకా యిలా అన్నాడు.

"నటన విషయంలో మీరిప్పుడు కనపరుస్తున్న ఏకాగ్రత పిల్లల తల్లి అయితే చూపించలేరు. కనిపెంచే వయసు ముందు మీకు చాలా వుంది.




ముఖ్యంగా మీరు స్టేజిమీద నాలుగు కాలాలపాటు రాణించాలన్నా, ప్రభు మీ యింటికి వస్తూపోతూవుండాలన్నా మీరు మీ అందం కాపాడుకోవాలి. మీ శ్రేయోభిలాషిగా, తోటి నటుడిగా యివి నా సలహాలు. బాగా ఆలోచించుకోండి," లేచాడు.

కళ్యాణి సమాధానానికి ఎదురుచూడకుండా నే నిష్క్రమించాడు.

అతను వెళ్ళిపోయాక కూడా కళ్యాణి అట్లానే కూచునిపోయింది.

దేవదాసు అనేసి వెళ్ళిన చివరి మాటలు ఆమె చెవుల్లో గింగురుమంటున్నాయి.

* * *

ప్రభు యింటికి వెళ్ళాడు.

నౌకరు ద్వారా తండ్రి బొంబే వెళ్ళాడని విని 'వ్యసనాలకోసం తగలేసే దాంట్లో పదోవంతు ఒక మంచిపనికోసం వినియోగించలేరు' అనుకున్నాడు.

ఆయన తిరిగి ఎప్పుడొస్తారో ఆ యింట్లో ఎవరికీ తెలీదు.

శర్మాజీని అడిగితేనో. మళ్ళీ ఏదో కథ అల్లుతాడు. అయినా అడిగిచూస్తే నష్టమా? ఏదో ఆశ రెపరెపలాడగా శర్మాజీని పిలిపించాడు.

"శర్మాజీ! నాకో పాతికవేలు అప్పుగా యిప్పించగలరా?" అని అడిగాడు.

'పాతికవేలా?' కాస్త ఆలోచించి 'నాన్నగార్ని రానీయండి' అని గొణుకున్నాడు.

దబ్బు అందే మార్గం కన్పించటం లేదు. కళామందిరం అలా అసంపూర్తిగా వొదిలేయటం యిష్టంలేదు.

ఆలోచనలు చుట్టుముట్టాయి. అస్తిమితంగా గదిలో పచార్లు చేస్తున్నాడు. నౌకరు వొచ్చి పిలిచినా భోజనానికి వెళ్ళలేదు.

రాత్రి ఎనిమిదిగంటలు దాటింది. గదిలో లైటన్నా వేసుకోకుండా అలా పచార్లుచేస్తూ అప్పుడప్పుడు కిటికీదగ్గర ఆగి చీకట్లోకి చూస్తూ ఆలోచిస్తున్నాడు.

మంజీరాల సవ్వడి, ఆ వెనకే గాజుల గలగల వినిపించి ద్వారంవైపు చూస్తూ స్విచ్ నొక్కాడు.

అప్పటివరకూ నాదే రాజ్యం అని విర్రవీగుతున్న చీకటిని క్షణంలో జయించి గదంతా వెలుగుతో నింపేసింది మెర్క్యూరీ లైటు.

రమాదేవి చేతిలో వో చిన్న దంతంపెట్టితో గదిలో ప్రవేశించింది. నేలవైపే చూస్తూ మెల్లిగా అడుగులు వేసుకుంటూ వొచ్చి ప్రభు సమీపాన ఆగింది.

అతను నిలబడిపోయాడు.

ఒకటి రెండు క్షణాలు గడిచిపోయాయి.

'ఎందుకొచ్చావని అడగొచ్చుగదా. ఆమాత్రం మాట్లాడటం కూడా యిష్టం లేదన్నమాట.

మనసులో చెలరేగుతున్న భావాలను అదిమిపెట్టి నెమ్మదిగా "ఇవి మీ అమ్మ గారి నగలు. పెళ్ళి సమయంలో మామగారు నాకు యిచ్చారు. తిరిగి యివ్వమని మళ్ళీ ఎన్నడూ అడగను. వీటితో మీ అవసరం తీరితే సంతోషిస్తాను," అంది.

అతను క్షణకాలం ఆమెవేపు నివ్వెరపాటుతో చూశాడు. చేయి చాపి పెట్టెని అందుకోలేదు. అక్కడ్నుంచి కిటికీవద్దకువెళ్ళి బయటికిచూస్తూ వుండిపోయాడు.

రమాదేవి ముఖం వివర్ణమయింది.

చేతిలో పెట్టెతో భర్తవంక అలా చూస్తూ వుండిపోయింది, పొంగుకొస్తున్న దుఃఖాభిమానాలతో వుద్విగ్నమవుతున్న మనసును బలవంతంగా నిగ్రహించు కోడానికి ప్రయత్నిస్తూ

అతనివైపు రెండడుగులు వేసి "వీటికి నాలాగా శరీరమూ, మనసూ లేవుగా. వొట్టి లోహపు నగలు. వీటిని తీసుకోవటానికి మీకు అభ్యంతరం దేనికి ?...." ఆపైన యింకోమాట మాట్లాడినా దుఃఖం వెల్లువలై పారుతుందని గ్రహించి పెట్టె అక్కడ వుంచి, గదిలోంచి బయటికొచ్చేసి, ఎవరో వెనుక తరుముకొస్తు న్నట్టుగా మెట్లెక్కి తనగదిలోకి వెళ్ళిపోయింది.

ప్రభు శిలలా వుండిపోయాడు.

టేబుల్‌మీద పెట్టె అందుకుని మూత తెరిచాడు.

కెంపులు, పచ్చలు, ముత్యాలు పొదిగిన బంగారునగలు. మూత వుంచి గదిలో అసహనంగా పచార్లుచెయ్యటం మొదలుపెట్టాడు. మళ్ళీ వొచ్చి మూత తీసి చూశాడు. యాభై వేలకు పైనే విలువచేస్తాయి అవి. తీసుకోవటానికి మనసొప్పలేదు.

రమ పలుకులు యింకా మనసులో మెదులుతూనే వున్నాయి. తనంతట తాను యిచ్చినపుడు పుచ్చుకోవటంలో తప్పేముంది? పైగా తిరిగి యిచ్చేస్తేనే బాధపెట్టినవాడవుతాడు ఆమెను. తను యిలా ఆలోచించటానికి ముఖ్యకారణం డబ్బు అవసరమేనా?

చాలా సేపటికి పెట్టెను బీరువాలో భద్రపరచి, పడుకుని నిద్రపోయాడు.

* * *

ప్రభు అనుకున్న ప్రకారం కళామందిరం అద్భుతంగా రూపొందింది. ప్రారంభోత్సవానికి పిలవవలసినవారిని పేరుపేరునా గుర్తుతెచ్చుకొని జాబితా తయారుచేశాడు.

ప్రింటయిన ఆహ్వాన పత్రికలు యింటికొచ్చాయి.

ప్రభు స్వదస్తూరితో రాసి పోస్టుచెయ్యవలసిన కార్డులు వేరుగా, స్వయంగా ఆహ్వానించవలసినవి వేరుగా పొందుపరచాడు.

నౌకర్ని పిలిచి పోస్టుచేయవలసిన కార్డులు యిచ్చాడు.

తండ్రిచేతికి ఆహ్వానపత్రిక యిచ్చి "నాన్నగారూ మీరు తప్పక రావాలి" అని ఆహ్వానించాడు.

రావుగారు తలూపి వూరుకున్నారు.

పైనుంచి అంతా గమనిస్తున్న రమ, ప్రభు తన్నుకూడా పిలుస్తాడనుకుంది.

ప్రభు మిగిలిన కార్డులు తీసుకుని బయటికి వెళ్ళిపోయాడు.

పచ్చని మామిడితోరణాలతో, రంగురంగుల బల్బులతో కళామందిరం దేదీప్యమానంగా వెలిగిపోతూంది. ప్రభు, కళ్యాణి అతిథుల్ని రిసీవుచేసుకుంటున్నారు.

ఒకపక్కనుంచి శ్రావ్యమైన సంగీతం వినిపిస్తూంది.

సాయంత్రం ఆరు గంటలయింది. అందరూ ఆడిటోరియంలోకి చేరుకున్నారు. ముఖ్య అతిథిని వేదికమీదికి ఆహ్వానించి ప్రభు అతనికి పూలమాల వేసి సత్కరించాడు. ఆయన ప్రభుని చాలా పొగిడాడు. 'వెనకబడి పోతున్న నాటకకళను

పుద్ధరించ బూనుకున్న యీ యువకుడు అభినందనీయుడు.' ఇతని నాటకాలు ఒకటి రెండు చూశాను. ఇతని కృషి, పట్టుదల కొనియాడ దగినవి. ఇలాటి యువకులంతా ముందుకొచ్చి నాటక కళను వృద్ధిలోకి తేవాలి' అంటూ వుపన్యాసం ముగించాడు ఆయన.

ఆ తరవాత కొందరు సినీ కళాకారులు ప్రసంగించారు.

'కళామందిర్ పేరు తరచు వింటూనే వున్నాము. రెండు సంవత్సరాలుగా వీరికి నాటక కళాపరిషత్ పోటీలలో ప్రథమ బహుమతి లభిస్తోంది. ప్రభుత్వం నుంచి కూడా కొంత ఆర్థిక సహాయం ప్రోత్సాహం లభిస్తే వీరి కృషి మరింత ఫలిస్తుంది' అంటూ మాట్లాడారు.

ఆ తర్వాత ప్రభు మాట్లాడాడు. 'నాటక పరిశ్రమ ఎందుకు వెనకపడుతున్నదో వారి యిబ్బంది లేమిటో వివరిస్తూ అందరి సహకారం వుంటే నాటక పరిశ్రమ కూడా సినిమా పరిశ్రమవలనే విస్తరించగల దన్నాడు. కళామందిరం స్థాపనలో వ్యాపారోద్దేశం లేదన్నాడు. సమాజంలోని కుళ్ళుని, చెడుని, నాటక కళ ద్వారా కొంతయినా తొలగించటమే తన ధ్యేయమన్నాడు; వ్యక్తులలోని మానవతను వికసింపజేయటానికి నాటకం వుపకరిస్తుందనే వుద్దేశంతో తాను రంగాన్ని స్వీకరించా నన్నాడు.

తర్వాత ఒక నాటకం ప్రదర్శింపబడింది.

స్వర్గకుమారి భామాకలాపం అభినయించి ప్రేక్షకుల అభిమానాన్ని చూరగొంది.

ఆ తర్వాత విందు కార్యక్రమం. అన్ని పనులు ముగిసేసరికి రాత్రి పన్నెండు దాటింది.

కళ్యాణి కోసం చూసిన ప్రభుకి ఆమె ఓ మూల కుర్చీలో కునికిపాట్లు పడుతూ కన్పించింది. గబగబా ఆమెను సమీపించి "కళ్యాణీ!" అని పిలిచి తట్టి లేపాడు.

"నువ్వింకా యిక్కడే వున్నావా? వెళ్ళిపొమ్మని చెప్పానుగా" అంటూ ఆమెకి చెయ్యి అందించి తీసుకొచ్చిన కారులో కూర్చోబెట్టాడు. కళ్యాణి అతని భుజంమీద తల ఆన్చుకుంది.

పోర్టికోలో కారు ఆపుకుని కళ్యాణికి చేయి అందించాడు. నిద్రకళ్ళతో వున్న కళ్యాణిని అమాంతం చేతుల్లోకి ఎత్తుకుని తీసుకెళ్ళి పక్కమీద పరుండ వేశాడు.




తాను డ్రెస్ మార్చుకుని ఆ వేళ జరిగిన విశేషాలన్నీ డైరీలో పొందు పరచాడు. లైటార్పి కళ్యాణి పక్కన పడుకుని నిద్రపోయాడు.

*   *   *

వారం రోజుల తర్వాత.

ప్రభు కాఫీ తాగుతూ ఆవేళ దినపత్రిక చూస్తున్నాడు. ఒక పేజీ అంతా కళామందిరం ప్రారంభోత్సవ వేడుకలతో, అభినందనలతో, ప్రముఖుల ఉపన్యాసాలతో, ఫోటోలతో నిండిపోయింది. ప్రభు కళ్ళు గర్వంతో మెరిశాయి. అనుకున్నది సాధించిన తృప్తితో అతని మనసు నిండిపోయింది. కళ్యాణిని పిలిచి పేపరు చూపించాడు.

అక్కడ గదిలో రమాదేవి ఆరోజు పేపరు చూస్తోంది. ఆమె దృష్టి ఒక ఫోటోమీద నిల్చిపోయింది. ప్రభు ఠీవిగా ఫుల్‌సూటులో వున్నాడు. అతని కెదురుగా యించుమించు అతని వయసులోనే వున్న యువకుడు కరచాలనం చేస్తున్నాడు. ప్రభు పక్కన ఆనుకుని నిలబడి వున్న కళ్యాణి నవ్వుతూ చేతులు జోడించి వున్నది. వారిచుట్టూ యింకా చాలామంది వున్నారు. అట్లా ఫోటోని తదేకంగా చూస్తున్న రమాదేవికి క్రమంగా ఫోటోలోని మనుషులు మసగ్గా అల్లుకుపోయినట్లు కన్పించసాగారు.

కళ్ళు మూసుకుంది.

కళ్ళల్లోంచి జలజలా నీళ్ళు రాలి పేపరును తడిపేశాయి.

గుండెల్లోంచి బాధ.

వ్యక్తంచెయ్యలేని బాధ-

కళ్ళు అద్దుకుని గబగబా మేడదిగి వెళ్ళిపోయింది మామగారికి మందు యివ్వ టానికి.

* * *

నాటక కళాపరిషత్తువారి లేఖ అందుకుని ప్రభు ఢిల్లీ వెళ్ళాడు.

ప్రభు లేడని తెలుసుకుని దేవదాసు కళ్యాణి యింటికి వొచ్చాడు.

"కళ్యాణీ, ఏం ఆలోచించుకున్నావ్?" అని అడిగాడు.

"ఏ విషయం?" ఏమీ ఎరుగనట్లే అడిగింది కళ్యాణి.

"నువ్వంత తేలిగ్గా మర్చిపోతావని అనుకోను. నేనిచ్చిన సలహాలు నిన్ను వెంటాడుతూనే వుంటాయి" తాపీగా అని సోఫాలో కూర్చున్నాడు.

అతని ఏకవచన ప్రయోగం— అధార్టీ చెలాయిస్తున్నట్టు మాట్లాడుతున్న తీరు కళ్యాణికి నచ్చలేదు.

మౌనం వహించింది.

"కళ్యాణీ! నీకు నా అనే వాళ్ళెవరూ లేరు. నువ్వంటే నాకు అదో రకమైన అభిమానం. అందుకే అదే పనిగా చెప్తున్నాను. ఒక్క మాటడుగుతాను చెప్పు. ఎప్పుడయినా ఎవరికైనా ప్రభు నిన్ను తన భార్యగా పరిచయం చేశాడా? నువ్వు తనికి తాళికట్టించుకున్న భార్యవు కావు. అతనికి భార్య వుంది. ఆమె అంద మైనది. గుణవతి. చదువుకున్నది. ఇవ్వాళ కాకపోతే రేపయినా అతని సంసారం పెరుగుతుంది. ఖర్చులు పెరుగుతాయి. అప్పుడు నీ కింద ఖర్చు పెట్టటమంటే కష్టంగానే వుంటుంది. నీ సంపాదన నీకు వున్ననాడు నీ బెట్టు సరి నీకు వుంటుంది. పిల్లల కోడిలా తయారయితే రేపు వాళ్ళ గతేమిటి? మేము నీ బిడ్డలం, నీ వారసులం అని కోర్టుకి ఎక్కే అధికారం వాళ్ళకి వుంటుందా! నిదానంగా ఆలోచించుకో. నీ అందాన్ని పాడుచేసుకోకు. అవ కాశాల్ని జారవిడుచుకోకు" కళ్యాణి మొహంలో మారుతున్న రంగుల్ని గమ నిస్తూ యింకా చెప్పుకు పోతున్నాడు. "ప్రభుకు భయపడి నిన్ను బుక్ చేసుకోవ టానికి ఎవరూ ముందుకు రావటంలేదు. నువ్వు 'ఊ' అంటే వారానికో ప్రద ర్శన యివ్వవచ్చు. నీ పేరు వాడవాడలా మోగిపోతుంది. సినిమా ఛాన్సు కూడా తగలొచ్చు. అప్పుడు ఏ పోస్టరు చూసినా ఏ పత్రిక చూసినా కళ్యాణి

పొమ్మలే. కళ్యాణికి ప్రకాశంసేలే. రహస్యంగా పని జరిగిపోయే ఏర్పాటు నేను చేస్తాను. ఏమంటావు?"

కాసేపటికి "నన్ను ఆలోచించుకోనివ్వండి" అంది.

"పుణ్యకాలం కాస్తా దాటిపోయేవరకూ ఆలోచిస్తూనే వుండు" కాస్త విసుగ్గా అన్నాడు.

"లేదు. ఏ సంగతీ రేపు ఫోనులో చెప్తాను."

"గుడ్. ఆ మాత్రం తెగింపు, ధైర్యం వుంటే ముందుకు పోగలవు" లేచాడు.

కళ్యాణి మాట్లాడలేదు. దేవదాసు వెళ్ళిపోయాడు.

కళ్యాణి మనసు గందరగోళంగా తయారయింది. ఆలోచనలు తెగటంలేదు. ఓ వేపు ప్రభు, మరో వేపు పూరిస్తున్న భవిష్యత్తు. ఆ లోచిస్తున్నకొద్దీ దేవదాసు మాటలు నిజమనిపిస్తున్నాయి. వున్నట్టుండి ఓ వుపాయం తట్టింది. దేవదాసు మాటలు నిజమో కాదో పరీక్షించి చూడాలనుకుంది.

లేచి పనిమనిషిని తలుపేసుకోమని చెప్పి పక్కవాళ్ళ యింట్లోకి వెళ్ళింది.

తలుపులు మూసివున్నాయి.

ఇల్లు నిశ్శబ్దంగా వుంది.

వేళ్ళతో తలుపుమీద టకటక చప్పుడు చేసింది.

తలుపులు తెరుచుకున్నాయి.

ఆమె ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసుకుని చూసింది.

"ఏమిటీవిడ యిలా ఆశ్చర్యపోతూంది. ఎన్నడూరాని తను వొచ్చినందుకా?" మనసులో అనుకుని చిన్నగా నవ్వుకుని, "నా పేరు కళ్యాణి. మీ పక్కింట్లో వుంటున్నాము. యీవేళ మీ యింటికి రావాలనిపించి వొచ్చాను" అంది.

ఆవిడ "రండి" అంటూ లోపలికి దారితీసింది.

కళ్యాణి అనుసరించింది. కళ్యాణి కెదురుగా సోఫాలో కూర్చుంది ఆమె.

ఆవిడ ఏం మాట్లాడకపోవటంతో తానే ప్రారంభించింది కళ్యాణి.

"పిల్లలు స్కూలుకు వెళ్ళారా?"

"ఆ."

"మీవారు?"

ఆవిడ అదోలా చూసింది. "ఈ వేళప్పుడు ఆఫీసులో వుంటారు."

"మీ యింట్లో యింకో ఆవిడని చూశానే."

"ఆవిడ మా అత్తగారు."

ఆవిడ చివాలున లేచి లోపలికెళ్ళింది.

ఈవిడ స్వభావమే యింత కాబోలు. అడిగినమాటకి జవాబుతప్ప ఒక్క మాటా మాట్లాడదే.

రెండు గ్లాసుల్లో జ్యూస్‌తెచ్చి ఒకటి బల్లమీద వుంచి రెండోది తాను తీసుకుంది ఆమె.

'తీసుకోమనయినా అనదేమో' అనుకుంది కళ్యాణి.

"ఒక్కరే వుంటారనుకుంటా, పగలంతా ఏంతోస్తుంది?" యధాలాపంగా అడిగింది.

"ఇంటిపని, వంటపని, ఆయనా పిల్లలూ వెళ్ళాక మా అత్తగారూ నేనూ ఛోంచేస్తాం. ఆవిడ ఏ పక్కింటికో ముచ్చట్లకి వెళ్తుంది. నేను ఏ పుస్తకమో పట్టుకుంటాను. అంతకన్నా ఏం పన్లుంటాయి మాబోటివాళ్ళకు."

'మాబోటివాళ్ళకు' అనే మాటలో వ్యంగ్యం, ఎత్తిపొడుపు ధ్వనించాయి.

జ్యూస్ సిప్‌చేస్తూ ఆవిడ మాటమాటకూ గుమ్మంవేపు చూడటం గమనించి,

"ఎవరికోసం చూస్తున్నారు? పిల్లలకోసమా" అంది కళ్యాణి.

"కాదు. మా అత్తగారు వస్తారేమోనని."

"మీ అత్తగారంటే అంత భయమా మీకు" చొరవగా అంది.

"మిమ్మల్ని రానిచ్చినందుకు కోప్పడతారు."

అప్పుడే అందుకున్న జ్యూస్‌గ్లాసు బల్లమీద వుంచేసింది కళ్యాణి.

"ఏమీ అనుకోకండి. నే నీయింటి కోడల్ని. ఆవిడ వొచ్చారంటే మిమ్మల్ని నన్నూ కలిపి ఏకేస్తారు. మీరంటే యీ వీధిలో ఎవరికీ మంచి అభిప్రాయం లేదు. ప్రభుగారిది సొంతయిల్లు కాబట్టి గాని అద్దెకున్నట్టయితే ఎప్పుడో ఖాళీ చేయించేవాళ్ళు."

కళ్యాణి కళ్ళల్లో గిర్రున నీళ్ళుతిరిగాయి. మనసు ముక్కచెక్కలయింది. కడివెడుపాలల్లో చిన్న వుప్పుకల్లు. గబగబా యింటికొచ్చి దుఃఖంతో మంచంమీద వాలిపోయింది.

'ఇన్నాళ్ళూ తాను భ్రమలో బ్రతికిందా?'

'అంతా తనని ఓ పతితగా చూస్తున్నారా?'

'ఇలాటి జీవితాన్నా తాను కోరుకున్నది?'

'ప్రేమించానన్నాడు, యింట్లోతెచ్చిపెట్టాడు. ప్రాణంగా చూచుకుంటున్నాడు'. అతన్ని యింకేమీ అడగలేకపోయింది. తానున్నది నందనవనంలో అనుకుం

టున్నది. అది భ్రమ.

మనసు తేలికపడేవరకూ తలగడలో తలదూర్చి ఏడ్చింది.

లేవగానే దేవదాసుకి ఫోన్ చేసింది.

"హలో! ఏం నిర్ణయించుకున్నావు!" అవతలినించి దేవదాసు అడిగాడు.

"మీరు చెప్పినట్టు వింటాను." కుడిచేత్తో కన్నీళ్ళు తుడుచుకుంటూ జవాబిచ్చింది.

"గుడ్. అంతా నాకు వొదిలెయ్. ఉదయం ఎనిమిదిగంటలకంతా వస్తాను. సిద్ధంగా వుండు." ఫోన్ పెట్టేశాడు దేవదాసు.



* * *

అప్పుడే టాక్సీ దిగి మెట్లెక్కుతున్న ప్రభుకి-

దేవదాసు, పురుషోత్తం, దామోదర్ ఎదురయ్యారు.

వాళ్ళు తన యింట్లోంచి రావటం చూసి విస్మయం చెందాడు ప్రభు. కనుబొమలు ముడిపడినాయి. వాళ్ళు ప్రభుని చూడగానే కంగారుపడ్డారు.

తృటిలో మామూలుగా అయిపోయి "ఏమిటి యిలా దయచేశారు పురుషోత్తం గారూ?" అడిగాడు ప్రభు.

"అబ్బే. ఏంలేదు. కళ్యాణి మా నాటకంలో హీరోయిన్ వేషం వెయ్యటానికి వొప్పుకుంది. ఇంకో రెండేళ్ళవరకూ మా కంపెనీ నాటకాల్లో తనే హీరోయిన్‌గా వుంటానని ఎగ్రిమెంటుకూడా రాసిచ్చింది. అడ్వాన్సు యిచ్చి వెళ్దామని ..." నీళ్ళునములుతూ అన్నాడు అతను.

ఒంట్లోని రక్తమంతా మొహంలో కేంద్రీకృతమైనంత ఎర్రబడిపోయాడు ప్రభు.

వాళ్ళతో యిక ఒక్కమాట మాట్లాడలేదు.

ఒక అంగలో లోపలికి వెళ్ళిపోయాడు.

పురుషోత్తం, దామోదర్ దేవదాసు ముఖంలోకి చూశారు.

దేవదాసు వాళ్ళకి అభయమిస్తున్నట్లుగా ఓ చిరునవ్వు పారేసి టాక్సీడోర్ తెరిచాడు.

ముగ్గురూ కూర్చున్నాక టాక్సీ కదిలింది.

"కళ్యాణీ!" ప్రభు గట్టిగా పిలిచాడు.

ఆ పిలుపులోని కాఠిన్యానికి అదిరిపడింది కళ్యాణి. గదిలోనుంచి గదిగుమ్మం వరకు వచ్చి ఆ గుమ్మాన్ని పట్టుకుని అక్కడే ఆగిపోయింది.

"వాళ్ళెందుకొచ్చారు?" దూకుడుగా అడిగాడు ప్రభు.

జవాబివ్వలేదు కళ్యాణి.

"నే విన్నది నిజమేనా?"

".... .... .... .... ...."

"గర్భవతివన్న సంగతి మర్చిపోయావా? స్టేజి ఎలా ఎక్కుదామనుకున్నావు? అసలెలా మాటిచ్చావు? ఎందుకిచ్చావు?"

కోపంతో వూగిపోతూ ప్రశ్నించాడు.

"ఎబార్షన్ చేయించుకున్నాను."

సోఫాలో కూర్చుని వొంగి బూటులేసులు విప్పుకుంటున్నవాడల్లా చివ్వున తలెత్తి చూశాడు.

తల బాగా వొంచుకుని బొటనవేలు నేలకు రాస్తూ నిలుచునుంది కళ్యాణి. అతని కోపం, ఉద్రేకం నీరుగారిపోయాయి. కళ్యాణికేసి అలా చూస్తూ వుండిపోయాడు కొద్ది సేపు.

తర్వాత ఎప్పటికో "నాతో జోక్ చేస్తున్నావా కళ్యాణీ!" చాలా హీన స్వరంతో అడిగాడు.

"లేదు, మీతో నిజమే చెపుతున్నాను. తల్లినికావడం, పిల్లల్ని కనడం యిష్టం లేదు. మీ మనసుకి కష్టంకలిగిస్తే మన్నించండి," అని, అతనిముందు దోషిలా తలదించుకు నిలుచోడం యిష్టంలేనట్టు అక్కడినుంచి కదిలి గదిలోకి వెళ్ళి పోయింది.

శిలావిగ్రహంలా కూర్చుండిపోయాడు ప్రభు.

అతని కళ్ళముందు ఆనాటి కళ్యాణిరూపం మెదిలింది.

మురిపెంగా, ఎంతో సంతోషంగా ఆ కబురందించిన కళ్యాణిలో నాడు ఎంత అందం. ఎంత అమాయకత! ఆ కళ్ళల్లో, మాటల్లో పసిపాపల తాలూకు స్వచ్ఛత, నిర్మలత్వం.... ఏవీ!?.... ఇంతలోనే కళ్యాణి మనసు విషభాండంలా ఎలా తయారయింది? అమృతాన్ని కాళీచేసి ఆ స్థానంలో విషాన్ని ఎవరు నింపారు? కళ్యాణిలో స్వతహాగానే యీ మార్పు వొచ్చిందా?.... ఎందుకని? తనేం లోటు చేశాడు? ఏం తక్కువచేశాడు?'

ప్రశ్నలు చిక్కుముళ్లల్లా విడువడటంలేదు. మనసంతా వికలమయింది. ఎందుకో ఆ క్షణాన అతనికి ఇల్లు, తండ్రి, రమాదేవి గుర్తుకొచ్చారు. అక్కడ కూర్చోబుద్ధికాలేదు. ఆ విషయం మాట్లాడం యిష్టంలేకదానిలా లోపలికి వెళ్ళిపోయిన కళ్యాణిని పిలిచి పలకరించాలనిపించలేదు. లేచి ఆమెకు చెప్పకుండా యింటికి వెళ్ళిపోయాడు.

* * *

ప్రభు మనసుకి స్తిమితం కరువయింది. మాట మాత్రంగానైనా తనతో చెప్పకుండా కళ్యాణి అటువంటి పనికి ఎలా పూనుకుందో అతనికి బోధపడటం లేదు. తన మనసంతా విప్పి కళ్యాణిముందుంచాడు. పిల్లలంటే తనకెంత 'మక్కువో చెప్పాడు. ఆ రోజు కళ్యాణి కళ్ళల్లో మెరిసిన గర్వం, సంతోషం, సంతృప్తి అబద్ధంమాత్రం కావు. ఇంతలోనే ఏమైంది? ఎందుకు మారిపోయింది. ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోతూందేకానీ సమాధానాలు మాత్రం లభించటంలేదు.

ఎక్కువ సమయం కళామందిర్‌లోనే గడుపుతున్నాడు ప్రభు.

కళామందిర్ ఇప్పుడు పెళ్ళియిల్లులా కళకళలాడుతోంది.

ఓ ప్రక్క రిహార్సల్సు జరుగుతూవుంటాయి. ఓ ప్రక్క ఘల్లు ఘల్లుమంటూ మువ్వల సందడి. మరోపక్క సంగీతసాధన. రకరకాల వాయిద్యాల ధ్వనులు. నేర్చుకునేవాళ్ళు, చూడటానికి వచ్చిపోయేవాళ్ళతో ఎప్పుడూ సంరంభంగా వుంటూంది.

కళామందిర్ ఆడిటోరియమే కావాలంటే ఎడ్వాన్సుగా బుక్‌చేసుకోవలసి వస్తోంది.

ప్రభు రాసిన 'చౌరస్తా' నాటకాన్ని డైరెక్టుచేస్తున్నాడు ప్రసూన. హీరో వేషం మరో ఆర్టిస్టుకిచ్చాడు ప్రభు.

ఒకరోజు దేవదాసు ప్రభు ముందుకొచ్చి నిలబడి "నేను వెళ్ళిపోవాలను

కుంటున్నాను. తెలవిప్పించండి." అన్నాడు చేతులు జోడించి.

ప్రభు అభ్యంతరం చెప్పలేదు మౌనంవహించాడు.

"మీ మేలు యీ జన్మలో మర్చిపోలేను, వస్తాను." అని కళామందిర్‌లో తన గది ఖాళీచేసి వెళ్ళిపోయాడు దేవదాసు.

రోజులు వాటంతట అవే గడిచిపోతున్నాయి.

కళ్యాణిని చూడాలని మనసు పీకుతున్నా వెళ్ళటానికి మనస్కరించటంలేదు. పగలంతా కళామందిర్‌లో గడిపి రాత్రికి ఇల్లు చేరుకుంటున్నాడు. రమాదేవి అతనికి వడ్డిస్తుంది. ఎవరు వొడ్డిస్తున్నారో- ఏం తింటున్నాడో ధ్యాసలేకుండానే భోజనం ముగించుకుని తన గదిలోకి వెళ్ళిపోతాడు.

ఆ రోజు-

పదిగంటలు దాటింది.

చీకట్లోకి చూస్తూ బాల్కనీలో నిలుచున్నాడు ప్రభు.

అతనిచూపు అనినచోట దృష్టి నిలవడంలేదు. మనసు ఎక్కడో వుంది.

'ప్రభూ!' సన్నని కంఠం దగ్గర్లో వినిపించి బుజంమీదుగా మెడతిప్పి చూశాడు.

మసక వెలుతురులో రమాదేవి.

"ఏమిటి" ఏదో ధ్యాసలో వుండి అప్రయత్నంగానే అన్నాడు.

ప్రభు నోటినుంచి వెలువడిన ఆ చిన్నమాటకే ఆనందపడిపోయ్యింది రమాదేవి. వెంటనే మాట్లాడలేకపోయింది.

ప్రభు తిరిగి ఆమెను పలకరించలేదు.

తన ఆలోచనల్లో యీదుకుపోతున్నాడు.

ధైర్యాన్ని కూడదీసుకుని అతనికి చాలా సమీపాన మోకాళ్ళమీద కూర్చుని అతని పాదాలమీద తన మృదువైన చేతుల్నుంచింది.

ప్రభు తల తిప్పిచూశాడు.

ఆ మసకచీకట్లో అతని కళ్ళల్లోకి చూడ్డానికి ప్రయత్నిస్తూ అర్థింపుగా అంది. "ఒకేవొక చిన్న కోరిక ప్రభూ! నన్ను తల్లిని చెయ్యండి. మళ్ళీ ఎప్పుడూ ఏదీ మిమ్మల్ని అడగను."

తన భర్త తన కోరిక తప్పక తీరుస్తాడన్న ఆశతో తన రెండుచేతులతో అతని రెండుకాళ్ళనూ పెనవేసి, చెంపను అతనికాలికి ఆన్చి, ఆ మాత్రం స్పర్శా సుఖానికే తన్మయత్వం అనుభవిస్తూ కళ్ళు మూసుకుంది.




ప్రభుకి చప్పున కళ్యాణి మాటలు గుర్తుకొచ్చాయి.

కాళ్ళను పెనవేసి 'ప్రభూ! నన్ను తల్లినిచేయండి' అని ప్రాధేయపడుతున్న రమాదేవిని చూస్తుంటే జాలనిపించింది.

మనసులో ఏమూలో ఎక్కడో ఆమెమీద ఆపేక్షలాంటి భావం కలిగింది.

మరుక్షణం అతని మనసంతా కళ్యాణిరూపంతో నిండిపోయింది. కళ్యాణిని తను ప్రాణాధికంగా ప్రేమించాడు. కళని ఆరాధిస్తున్నట్టే కళ్యాణినీ ఆరాధిస్తున్నాడు. కళ్యాణికి దూరంగా, కళ్యాణిని చూడకుండా తనుండలేడు. తన తనువూ, మనసూ కళ్యాణివే. కళ్యాణి లేక తానన్న వ్యక్తి లేడు. ఇలా అనుకోగానే 'వొదులు' అంటూ కాళ్ళు విడిపించుకుని గదిలోకి వెళ్ళి తలుపులు మూసుకున్నాడు.

సజీవ శిల్పంలా రెప్పయినా కదల్చకుండా మూసివున్న తలుపులకేసి చూస్తూ కూర్చుండిపోయిన రమాదేవి గుండెల్ని చీల్చుకుని వో వేడి నిట్టూర్పు బయటికొచ్చింది.

సిగ్గు, అభిమానం విడిచి అతని కాళ్ళు పట్టుకుంది.

నిరాకరించాడు. అంతకు మించిన అవమానం ఏముంటుంది తాళికట్టించుకున్న భార్యకి.

అభిమానంతో, అవమానంతో దుఃఖం పొంగుకొచ్చింది.

పెదిమలు బిగించి గట్టిగా కళ్ళు మూసుకుంది.

బలవంతాన మనసును అదుపులోకి తెచ్చుకుని లేచి తన గదివైపు సాగిపో పోయింది.

*　　　*　　　*

ప్రభు మనసూ, శరీరమూ ఏకమై కళ్యాణికోసం తహతహలాడసాగాయి.

ఆ రోజు సాయంత్రం కళ్యాణి యింటికి వెళ్ళాడు.

కళ్యాణి యింట్లో లేదు. "అమ్మగారు రిహార్సిల్సుకి వెళ్ళారు" అని పని మనిషి చెప్పింది.

గిరుక్కున వెనుతిరిగి వెళ్ళిపోయాడు.

రెండో రోజు వెళ్ళాడు. కళ్యాణి లేదు.

మూడో రోజు వెళ్ళాడు. "మీరొస్తే వుండమని చెప్పారు అమ్మగారు." అంది పనిమనిషి.

సోఫాలో కూర్చున్నాడు. పత్రిక తిరగేశాడు. మనసు పరిపరి విధాలపోయింది.

కళ్యాణిలో యింత చొరవ, తెగింపు ఎలా వొచ్చాయి వున్నట్టుండి ?

ఫోన్ మోగింది.

అందుకున్నాడు.

"ప్రభూ ! మీరేనా !" కళ్యాణి కంఠం అవతలనుంచి.

"ఊఁ."

"నాకెందుకో మీరు యింట్లోనే వుంటారనిపించింది. రిహార్సిల్సు అయిపో యాయి. వొచ్చేస్తున్నాను. ఇంట్లోనే వుండండి, ప్లీజ్ !" ఫోన్ పెట్టేసింది ఆమె.

పది నిముషాల తర్వాత—

తలుపులు తోసుకుని లోపలికి వొచ్చిన కళ్యాణిని కళ్ళప్పగించి చూశాడు ప్రభు.

ఇంతకుముందు కళ్యాణి చాలా సింపిల్‌గా వుండేది. స్టేజిమీద తప్ప నగలూ, లిప్‌స్టిక్ వేసుకునేది కాదు. పల్చని చీరలు కట్టేదే కాదు.

"ఏమిటి అలా చూస్తున్నారు ? ఇంకా నామీద కోపం పోలేదా !" వొచ్చి ప్రభు పక్కనే కూచుంది.

ప్రభు మాట్లాడలేదు.

కళ్యాణి ప్రభుచేతిని తన చేతిలోకి తీసుకుంది.

ప్రభుతో మార్పులేదు.

శాస్త్ర ఆగి కళ్యాణి ప్రారంభించింది.

"ప్రభూ ః వుంటే తిభి, లేకపోతే పస్తులుండే ఆ రోజుల్లో నన్ను నటిని చేసి స్టేజీ ఎక్కించారు. నా అదృష్టమో, మీ ప్రయత్నమో మొదటి ప్రదర్శనకే మంచి పేరొచ్చింది. ఆ రోజు నేను అనుభవించిన ఆనందం జన్మలో మర్చి పోలేనిది. ఆ రోజునుంచే నా మనసులో నటిగా పైకిరావాలన్న కోరిక మొల కెత్తింది. మీరు కళాహృదయులు. నన్ను అర్థంచేసుకోండి. మీతోపాటు కళారంగంలో నన్నూ కృషిచేయనివ్వండి. ఆ రోజు మీరు హోటల్లో అన్న మాటలు గుర్తుతెచ్చుకోండి. నన్నొక మహా నటిని చేస్తానన్నారు. అప్పుడే మర్చిపోయారా ః మీతోపాటు నన్నూ ముందుకు తీసుకెళ్ళండి. యిది నా విన్నపం" అంటూ వొడిలో వాలిపోయింది.

కళ్యాణి ఆలోచనలు యివి మాత్రమేనా ః తల్లి కాదల్చుకోకపోవటానికి కారణం నటిగా పేరు తెచ్చుకోవాలన్న కాంక్ష ః పిల్లలు నటనా జీవితానికి ప్రతి బంధకాలు అవుతారనుకున్నదా ః తానే అపోహపడ్డాడా ఆమె గురించి ః

కళ్యాణి కళ్ళల్లోకి చూశాడు.

తేలిగా, అమాయకంగా వున్నాయి ఆ చూపులు.

ప్రభు మంచులా కరిగి పోయాడు.

ఆమెను చేతుల్లోకి తీసుకుని హృదయానికి హత్తుకున్నాడు.

అతని కౌగిట్లో కళ్యాణి తృప్తిగా నిట్టూర్చింది.

కొద్దిసేపటికి అతని వొళ్ళో తల పెట్టుకుని పడుకుని "నేను మీకేమవుతాను ః" అని గారాబంగా అడిగింది.

"నువ్వు ః నా ప్రాణానివి. నా ఆరాధ్య దేవతవు"

వొంగి ఆమె నుదిటిని చుంబించాడు.

"అదిని మాత్రం కాదు" సూటిగా కళ్ళల్లోకి చూసింది.

"కళ్యాణి!" ప్రభు గుండెల్లోంచి పిలుపు వొచ్చింది.

"నేను చెప్పనా ః ఏమవుతానో" షర్టుగుండీ విప్పుతూ, పెడుతూ అంది.

ప్రభు చూస్తూ వుండిపోయాడు.

"వెలయాలని."

"కళ్యాణీ !" ప్రభు గొంతులో బాధ సుళ్ళుతిరిగింది. "నేనెప్పుడయినా నిన్ను ఆ దృష్టితో చూశానా ః రమాదేవిని ఏపరిస్థితుల్లో పెళ్ళిచేసుకున్నానో వినూ...!"

"తెలుసు- వుండండి. నన్ను మాట్లాడనివ్వండి."

ప్రభు పెదవులమీద వేలుంచింది.

"రమ మీద నాకు కోపం లేదు. కానీ లోకం, మన చుట్టూవున్న వ్యక్తులు మన బంధానికిచ్చిన నిర్వచనం యిది. పోనీండి- యిన్నాళ్ళూ నన్ను చూడకుండా ఎలా వుండగలిగారు?" కళ్యాణి గొంతు గద్గదమైంది. "మీ కోసం- నేను తపించి పోయాను. మీకు దూరంగా నేను బ్రతకలేను" ప్రభుని మాట్లాడనివ్వకుండా అతన్ని పెనవేసుకుపోయింది.

పదిహేను రోజుల తర్వాత-

ముందు వరుసలో కూర్చుని నాటకం చూస్తున్నాడు ప్రభు. స్టేజిమీద కళ్యాణి దేవదాసులు ప్రేయసీప్రియులుగా నటిస్తున్నారు. ఎంత సరిపెట్టుకోవాలనుకున్నా మనసు ఆగటంలేదు. ముఖమంతా ఎర్రబడిపోయింది. వేడి వూపిర్లు వస్తున్నాయి.

లేచి వెళ్ళిపోవాలనుకున్నాడు.

తమాయించుకుని కూచున్నాడు.

మొదటి సీను ముగిసింది.

తెర వాలింది.

వెనకసీట్లో ఎవరిదో సంభాషణ.

'అతని నటన అతిగా వుంది కదూ! బహుశా ప్రియుడేమో!'

'నాటకాలవాళ్ళకి నీతి ఎక్కడిది. యివ్వాళ వీడితో, రేపు యింకొకడితో- అంతా ప్రియులే'

వినలేకపోయాడు ప్రభు.

ఆడిటోరియంలోంచి బయటకు వొచ్చేశాడు

ప్రభుకు మెలకువ వొచ్చేసరికి కళ్యాణి పక్కన వుంది.

"డ్రామా సాంతం చూడకుండానే వొచ్చేశారే" కళ్యాణి చేయివేస్తూ అడిగింది.

"తలనొప్పిగా వుంది."

"తగ్గిందా?"

"ఊఁ."

"డ్రామా బాగుందని చాలా మెచ్చుకున్నారు. కలక్షను కూడా ఎప్పుడూ రానంత వొచ్చిందట."




"ఊ."

"నన్ను తెగ పొగిడారు. యివన్నీ నాకు చెందవు. యివి అందుకోవలసిన వ్యక్తి వేరే ఉన్నారని చెప్పాను."

సీలింగు వంక చూస్తూ వింటున్నాడు ప్రభు.

ఫోను మోగింది.

చేయి చాచి అందుకున్నాడు.

"హలో. ప్రభుగారున్నారా?" అవతల్నుంచి రమాదేవి కంఠం ఆదుర్దాగా వినిపించింది.

"ప్రభునే మాట్లాడుతున్నాను. ఏమిటి?"

"మామగారికి రాత్రినుంచీ బాగులేదు. డాక్టరుగారు యిప్పటివరకూ వుండి యిప్పుడే వెళ్ళారు. ఆయన స్పృహలో లేరు. నాకు భయంగా వుంది. మీరో సారి రండి."

"అలాగే. యిప్పుడే వస్తాను" రిసీవరు పెట్టేసి మంచంమీంచి లేచాడు.

"ఎవరూ ఫోన్?" ప్రభుని గమనిస్తూ అడిగింది కళ్యాణి.

"రమాదేవి. నాన్నగారికి బాగులేదట." షర్టు వేసుకుని తలుపు తీసుకుని బయటకు వెళ్ళాడు.

రెండు నిమిషాల్లో కారు గేటుదాటిన చప్పుడు విని కళ్యాణి బద్ధకంగా అటు తిరిగి కళ్ళు మూసుకుని పడుకుంది.

* * *

రావుగారికి ఇంకా స్పృహ రాలేదు.

రమాదేవి ఆయన మంచానికి దగ్గరగా కుర్చీలో కూర్చుని వుంది.

గది బయట ఓ నౌకరు గోడకి ఆనుకుని కునికిపాట్లు పడుతున్నాడు.

ప్రభు గదిలోకి వచ్చాడు.

అతన్ని చూడగానే రమ లేచి నిలబడింది.

ప్రభు తండ్రి మంచంవద్ద నిలబడి ఆయనవంక తదేకంగా చూడసాగాడు.

హుషారుగా కూర్చుని చదరంగం ఆడుకుంటూనో- పుస్తకం చదువుకుంటూనో- రాసుకుంటూనో- ఠీవిగా సోఫాలో కూర్చునో కనిపించే తండ్రి అలా నిస్సహాయుడై వ్యాధికి తలవొగ్గి మంచంపై పడివుండటం చూచి ప్రభు మనసు జాలితో నిండిపోయింది.

"నాన్నగారూ!" అని పిలిచాడు.

అలాటి స్థితిలోనూ కొడుకు పిలుపుకి బలవంతాన కనురెప్పలెత్తి చూసాలని ప్రయత్నించారు రావుగారు.

"ఎలా వుంది మీకు?"

కొడుకు ప్రశ్న ఆయనకు బలాన్నిచ్చిందిలా వుంది. కళ్ళు తెరచి చూశారు.

"ఎలా వుంది?" ప్రభు మళ్ళీ అడిగాడు.

ఆయన కొడుకు చేతిని అందుకొని గుండెలమీద వుంచుకున్నారు.

ఆయన తల తిప్పి పక్కకు చూశారు. కళ్ళ నీళ్ళు నింపుకున్నారు.

ప్రభుకు తండ్రి తత్వం బాగా తెలుసు. ఆయన కంట తడిపెట్టింది చచ్చిపోతానన్న భయంతో కాదు.

తల తిప్పి చూశాడు. రమాదేవి గోడకి ఆనుకుని వుంది.

ప్రభు అటోలా చూడగానే ఆమె తల దించుకుని గది వెలుపలికి వెళ్ళిపోయింది.

తిరిగి మగతలోకి జారిపోయారు రావుగారు.

ప్రభు తన గదిలోకి వెళ్ళిపోయాడు.

ఉదయం విజిట్‌కి వొచ్చిన డాక్టరు, రావుగార్ని పరీక్షించి, యింజక్షను యిచ్చి, మరికొన్ని మందులు రాసియిచ్చాడు.

ఆయన వెనకే వెళ్ళిన ప్రభు "ఏమంటారు? పరిస్థితి ఎలా వుంది?" అని అడిగాడు.

"హార్టు ఎటాక్, మైల్డ్ స్ట్రోకు వొచ్చింది. తిరిగి రాకుండా జాగ్రత్తపడాలి" అన్నాడు.

ఆ పగలంతా యింట్లోనే వుండిపోయాడు ప్రభు.

సాయంత్రమయింది.

ప్రభు మనసు కళ్యాణియింటివైపు పగ్గంవేసి లాగుతోంది. ఎంత ప్రయత్నించినా వెళ్ళకుండా వుండటం అతనికి సాధ్యంకాలేదు.

బట్టలు మార్చుకున్నాడు.

బయల్దేరబోతుండగా 'కూడండి' అన్న స్వరం వినవొచ్చింది.

పక్కనే రమాదేవి.

"ఎంత పొద్దుపోయినా యింటికి వొచ్చెయ్యండి. మామగారికి తెలివి వొచ్చేసరికి మీరు దగ్గర లేకపోతే బాధపడతారు."

ఆమె వెళ్ళిపోయింది యీ మాటలు అనేసి.

ప్రభు మౌనంగా గడప దాటాడు.

కళ్యాణి యింటి తలుపులు తెరిచే వున్నాయి.

లోపలికి వెళ్లబోయినవాడల్లా, అక్కడ దృశ్యం చూసి విభ్రాంతపోయినట్లు గుమ్మంలోనే ఆగిపోయాడు.

కళ్యాణి దేవదాసులు ఎదురెదుగా కూర్చుని ఫోటోలు చూసుకుని నవ్వుకుంటున్నారు. దేవదాసు చనువుగా కళ్యాణి వొడిలోని ఫొటో అందుకోబోయినవాడల్లా ప్రభును చూచి చప్పున ముందుకుచాపిన చేయి వెనక్కి తీసుకుని లేచి నిలబడ్డాడు.

దేవదాసు చర్యలను చూచిన కళ్యాణి తలతిప్పి గుమ్మంవేపు చూసింది.

"ఓ ప్రభూ! మీరా రండి," అంటూ కుర్చీలోంచి లేచింది.

ప్రభు దేవదాసువైపు నిశితంగా చూశాడు.

"నమస్తే. కళ్యాణిగారికి ఫోటోలు యిచ్చివెడదామని వొచ్చాను" అనేసి గబగబ వెళ్ళిపోయాడు.

ప్రభు కుర్చీ కిటికీదగ్గరగా జరుపుకుని కూర్చున్నాడు.

"మీరు డ్రామా సాంతం చూడనేలేదుగా. ఫొటోలు చూడండి." అంటూ ప్రభు పక్కగా కుర్చీలో కూర్చుంది ఆమె.

ఒకో ఫొటో అందిస్తుంటే చూసి పక్కన పెడుతున్నాడు ప్రభు.

చాలామటుకు ఫొటోలన్నీ దేవదాసు, కళ్యాణి కలిసివున్నవే.

ప్రభు మనసులోని అలజడిని గమనించకుండా ఆయా సీనులని వుత్సాహంగా వర్ణించుకుపోతూంది కళ్యాణి.

"తల నొప్పిగా వుంది తర్వాత చూస్తాను" అంటూ ఫొటోలు పక్కన పెట్టేశాడు.

"అరె, చెప్పలేదేం" అంటూ ఫొటోల్ని బీరువాలో వుంచి ప్రభు కుర్చీ వెనక్కి వొచ్చి అతని నుదురు వొత్తసాగింది. ప్రభు చేయి వెనక్కి పోనిచ్చి కళ్యాణి రెక్క పుచ్చుకుని తనముందుకులాగి నిలుచోబెట్టాడు. ఆ విసురుకి కళ్యాణి బిత్తరపోయి చూసింది.

ప్రభు తమాయించుకుని,

"కళ్యాణీ! నువ్వు నాకోసం నాటకాలు వేయటం మానుకోలేవా?" అని అడిగాడు, కళ్యాణి కళ్ళల్లోకి సూటిగా చూస్తూ.

అట్లా చూస్తూ వుండిపోయింది కళ్యాణి.

"సంకుచితుడ్ననుకో, స్వార్థపరుడ్ననుకో, ఇంకేమైనా అనుకో. కళ్యాణీ! నువ్వు పరాయివాళ్ళతో నటించటం నాకిష్టంలేదు. నువ్వు దూరమైతే నేను భరించలేను. నువ్వు ఎప్పటికీ నాకు కావాలి. నా దానివిగానే వుండిపోవాలి. చెప్పు. అలా అని నాకు మాటివ్వు." ఆవేశంతో కళ్యాణి రెండుచేతులూ పట్టుకుని కుదుపుతూ అడిగాడు.

కళ్యాణి అవాక్కైగా వుండిపోయింది

"చెప్పవేం కళ్యాణీ!" అతని గొంతులో అసహనం ధ్వనించింది.

"ఏం చెప్పను. మీరు స్వయంగా ఆర్టిస్టు అయివుండి తోటిఆర్టిస్టును అవమానపరుస్తున్నారు. ఒక్కమాట చెప్పండి. నేను పరిచయం కాకపూర్వం మీరు ఎన్నో నాటకాలు వేశారు. ఎందరితోనో నటించారు. అందరినీ ప్రేమించారా? వాళ్ళందరికీ నాలాగా ఆశ్రయం యివ్వగలిగారా? ప్రేమ అనేది హృదయాలకి సంబంధించినదేకానీ శరీరాలకి సంబంధించింది కాదు. నా పక్కన ఎవరు నటిస్తున్నారన్న విషయం కాదు నాకు ముఖ్యం. నా పాత్రకు న్యాయం చేకూరుస్తున్నానా అనే."

కళ్యాణి భుజాలమీదున్న అతని చేతులు తొలిగిపోయినాయి. నాకే పాఠాలు నేర్పేంతగా ఎదిగిపోయింది. చాలా మారిపోయింది అనుకున్నాడు.




కళ్యాణి తన గదిలోకి వెళ్ళిపోయింది.

దీర్ఘంగా, నిదానంగా ఆలోచిస్తే కళ్యాణి మాటల్లో తప్పులేదనిపించింది.

అయినా ఏమూలో గుండెల్లో ముల్లు గుచ్చుకున్నట్టు బాధ కలుక్కు-మంటూనేవుంది.

ఆ రాత్రి ప్రభు కౌగిలిలో వొదిగిపోయి పడుకున్న కళ్యాణి అనుకుంది, 'ప్రభూ నీ కౌగిలికన్న పదిమందీ నన్ను పొగుడుతుంటే కలిగే ఆనందమే ఎక్కువ అనిపిస్తుంది. ఎక్కడ చూచినా కళ్యాణి పేరు, ఏ నాటకంలోనూ కళ్యాణి-కళ్యాణి లేదంటే ప్రేక్షకులు నిరాశతో తిరిగిపోవాలి. కళ్యాణివేస్తే కనకవర్షం కురుస్తుంది అనాలి కంపెనీవాళ్ళు. త్వరలో సినీనటిని కావాలి. అదే నా ధ్యేయం నా లక్ష్యం- నా కోరిక.'

• • •

రావుగారు కొద్దిగా కోలుకున్నారు.

తనగదిలో చిన్నగా అటూ యిటూ తిరగగలుగుతున్నారు.

సాయంత్రంవేళ-

మంచంమీద దిండునానుకుని కూర్చుని కిటికీలోంచి అస్తమిస్తున్న సూర్యుడ్ని చూస్తున్నారు.

రమాదేవి పళ్ళరసం గ్లాసుతో గదిలో ప్రవేశించింది.

గ్లాసు మంచంపక్కనేవున్న బల్లమీద వుంచి, తిరిగివెళ్ళిపోడానికి వెనక్కి తిరిగింది.

"అమ్మా! రమా!"

పిలుపు విని మంచందగ్గరగా వొచ్చి "పిల్చారా?" అని అడిగింది నెమ్మదిగా నమ్రతగా.

"కూర్చోమ్మా!" అన్నారు రమను పరికిస్తూ.

రమ కూర్చోలేదు.

"ఏమిటి చెప్పండి" అంది సౌమ్యంగా.

సన్న జరీవున్న గులాబీరంగు చీర. మెడలో సన్ననిగొలుసు, చేతులకు రెండేసి బంగారు గాజులుతప్ప ఏ ఆభరణాలూ లేవు. చిక్కివున్నా చందనపు బొమ్మలా వుంది. రమను చూస్తూంటే రావుగారి మనసు కలుక్కుమంది.

బి.ఏ. పాసయి యింట్లో తీరుబడిగావుంటున్న రమ, రావుగారు తమ యింట్లోవున్న రెండురోజులూ ఆయన అతిథిసత్కారాల బాధ్యత తాను వహించింది.

తండ్రి చెప్పగా వీణవాయించి వినిపించింది.

ఓ రోజు పుస్తకం చేతిలోవుంచుకునే పరధ్యానంగా ఎటోచూస్తూ ఆలోచిస్తున్నారు రావుగారు.

రమ గదిలోకి తొంగిచూసింది.

గాజుల చప్పుడికి తలతిప్పి,

"యిలా రామ్మా!" అని పిలిచారు రావుగారు.

"వుండండి. యిప్పుడే వస్తాను" అంటూ వెళ్ళిన రమ-

వీణతోసహా తిరిగివొచ్చింది.

రావుగారు మౌనంగా చూస్తూ కూర్చున్నారు.

తివాచీమీద కూచుని శృతి సరిచూసుకుని పాట అందుకుంది.

తన్మయంగా వింటూ వుండిపోయారు రావుగారు.

పాట పూర్తికాగానే వీణ అందుకుని లేచింది.

"రమా! వీణ వాయించమని నేను అడగలేదుగా" అన్న ప్రశ్నకు,

"మీరు అన్యమనస్కంగా దేన్ని గురించో ఆలోచిస్తునారు. ఇప్పుడు యిక ప్రశాంతంగా పడుకుని విద్రపోండి." అని వీణతీసుకుని చిరునవ్వుతో గదిలోంచి వెళ్ళిపోయింది.

ఈ పిల్ల దగ్గర ఎదుటివారి మనసుల్ని చదవగల శక్తి వుంది.

నిజంగానే ఆ క్షణాన ఆయన తన కొడుకుని గురించి ఆలోచిస్తున్నారు.

రమలాటి పిల్ల భార్యగా వొస్తే ప్రభు తప్పక మారుతాడు అనుకున్నారు.

ఎదురుగా వున్న రమను చూస్తే రావుగారికి గతమంతా గుర్తు కొచ్చింది.

"రమా! నీకు నేను అన్యాయం చేశాననుకుంటున్నావు గదమ్మా!" ఆవేదనగా అన్నారు.

రమాదేవి మౌనం ధరించింది.

"లేదమ్మా. నాకా వుద్దేశం లేదు. ప్రభు దుర్మార్గుడు కాడు. వాడిది వెన్నలాటి మనసు. తొందరపాటు ఎక్కువ. ఏది తోస్తే అది చేసేవరకూ నిద్ర పట్టదు వాడికి. వాడ్ని బాగా చదివించాలనుకున్నాను. కానీ నాటకాల పిచ్చిలో పడ్డాడు. కళ్యాణి అనే పేదపిల్ల తిండికిలేక కళామందిరంలో చేరింది. ఆ పిల్ల మీద వ్యామోహం పెంచుకున్నాడు. ఆ రోజుల్లోనే నేను మీ యింటికి రావటం జరిగింది. నిన్ను చూశాక ప్రభుకు తగిన భార్యవు నువ్వే ననిపించింది. ఈ ఆలోచనల్లో నేనున్న సమయంలో ప్రభు కళామందిరం కొనటానికి లక్ష రూపాయలు కావాలని అడిగాడు. నిన్ను చేసుకుంటే రెండు లక్షల రూపాయలు కట్నంగా వస్తాయని అబద్ధమాడి ఆశపెట్టాను. వాడు ఒప్పుకోలేదు. పైగా ఆ సలహా యిచ్చినందుకు నామీద కోపగించుకుని నాతో మాట్లాడటం మానుకున్నాడు. మళ్ళీ ఏమాలోచించుకున్నాడో, కొన్నాళ్ళ తరువాత తన అంగీకారం తెలియజేశాడు. నీ సాహచర్యంలో వాడు తప్పక మారతాడనే ఆశతో నేను చాలా సంతోషించాను. రమా! చిన్నతనాన్నే తల్లిని పోగొట్టుకున్న ప్రభుకి తల్లీతండ్రీ నేనే అయి పెంచాను. వాడు రవ్వంత కష్టపడినా నేను సహించలేను. అందుకే మీనాన్న యిచ్చినట్లుగా రెండు లక్షలు అందజేశాను."

"..............."

ఆయనకు కోడలితో యింకా ఏదేదో చెప్పాలని వుంది. ఆ క్షణాన ఆయనకు భార్య తలపుకొచ్చింది. 'రాజేశ్వరీ! నువ్వుంటే కోడలికి చెప్పగలిగే దానివి' అనుకున్నారు.

చివరికిలా అన్నారు.

"రమా! నీ ప్రయత్నంలో లోపం వుంటుందని నేననుకోనమ్మా! అయినా చూడు" ఏకధాటిగా మాట్లాడంవలన ఆయాసం వచ్చి ఆయన ఆగారు.

"మీకు భోజనం వేళయింది." గొంతు పెగల్చుకుని ఆ మాట అని గదిలో

నుంచి వెలుపలికి వచ్చేసిన రమాదేవి సరాసరి తన పడకగదిలోకి వెళ్ళి తలుపులు మూసుకుంది.

అరగంట తరువాత తలుపులు తెరుచుకొని బయటికొచ్చి మామగారికి భోజనం తీసుకువెళ్ళింది.

రమాదేవి మొహంలోకి చూసిన రావుగారు, 'కోడలి మనసు నొప్పించాననుకుంటా. ఈ విషయాలన్నీ పెళ్ళికి పూర్వమే చెప్పేసి వుండవలసింది. ఐనా— రమ యోగ్యురాలు, గుణవతి. లోపల హాలాహలాన్ని దాచుకుని పైకి గంభీరంగా వుండగలదు" అనుకున్నారు.

*　　　*　　　*

కళ్యాణి బిజీ ఆర్టిస్టు అయిపోయింది. కీర్తిదాహంతోపాటు సౌందర్యోపాసన కూడ మనస్సులోన పెరిగిపోయింది. ప్రభు యిప్పుడు కళ్యాణికి ఏ విషయంలోనూ అడ్డుచెప్పడంలేదు.

ప్రకస్త్రీన సమయం కళామందిర్‌లోనే గడుపుతున్నాడు. అనేక విధాలుగా కళామందిర్‌ని వృద్ధిలోకి తేవడమే అతని ధ్యేయం. కళామందిర్‌లో అదనంగా చిత్రలేఖనం ప్రవేశపెట్టాడు.

*　　　*　　　*

రెండు నెలలు గడిచాయి.

కోలుకున్నాననుకున్న రావుగారికి మళ్ళీ నొప్పి వచ్చింది. రమాదేవి అయన పక్కనే విడిచిపెట్టకుండా సేవలు చేస్తోంది. రమ యేడుస్తోంది. ప్రభు కోసం మనిషి వచ్చాడు. కళ్యాణి యింట్లో, ఆమె పక్కనపడుకుని నిద్రపోతున్న ప్రభు దిగ్గున కళ్ళు విప్పి చూసి 'కలా!' అనుకున్నాడు. తనమీద వున్న కళ్యాణి చేతిని సున్నితంగా తీసి పక్కన పెట్టి గడియారం కేసి చూశాడు.

రెండు గంటలు చూపిస్తోంది గడియారం.

పక్కమీంచి దిగి, కళ్యాణికి నిద్రాభంగంకాకుండా మెల్లగా తలుపు తెరచుకుని కారులో యింటికి బయలుదేరాడు.

పావుగంటలో యింటికొచ్చిన ప్రభు, తండ్రి గదిలోకివెళ్ళి తొంగిచూశాడు. రావ్‌గారు నిద్రలో వున్నారు. అయన సమీపంలో కుర్చీలో కూర్చుని రమాదేవి కునికిపాట్లు పడుతోంది.

ప్రభు మనసు తేలికపడింది. తన గదిలోకి వెళ్ళి పడుకున్నాడు. నిశ్చింతగా




నిద్ర పోయాడు,

ఆ మర్నాడు ఉదయం కళ్యాణి యింటికి వెళ్ళాడు.

"ప్రభూ ! నేనంటే మీకు యిష్టంపోతున్నది. అర్ధరాత్రి, అపరాత్రి అనకుండా రమ ఎప్పుడు గుర్తుకొస్తే అప్పుడు పక్కలోంచి లేచివెళ్ళిపోతున్నారు." కళ్యాణి ప్రభుమీద అలక ప్రదర్శించింది.

"రమకోసం కాదు కళ్యాణీ !"

"తెలుసు...."

"నీకు నిజంగా తెలీదు కళ్యాణీ ! రమని నేను...."

ప్రభు మాట కడ్డొచ్చి "ప్రేమించడంలేదు అంటారు. అంతేనా ? ఎలా నమ్మమంటారు ? రాత్రికి రాత్రి రమ గుర్తుకొచ్చేగా నాకు చెప్పనన్నా చెప్పకుండా లేచి వెళ్ళిపోయారు."

కళ్యాణి కోపం దుఃఖంగా మారింది.

"నాకు మీరు తప్ప ఎవరున్నారని ? మీరు నన్ను నిర్లక్ష్యంచేస్తే సహించలేను."

కళ్యాణి కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి.

అది చూసి ప్రభు విచలితుడయ్యాడు.

కళ్యాణిని దగ్గరకు తీసుకుని "నీకెందుకొచ్చిందీ అనుమానం ?" ప్రేమగా అడిగాడు.

"కళామందిర్ వాళ్ళు నా గురించి ఏమనుకుంటున్నారో తెలుసా ? మీకు నా మీద వ్యామోహం తీరిపోయిందట. మీరు నన్ను విడిచిపెట్టేస్తారట" ఏడుపు గొంతుతో అంది.

"పిచ్చి కళ్యాణీ ! నువ్వు నమ్మేశావా ?" కళ్యాణి తలను తన గుండెలకు హత్తుకుని నవ్వుతూ అడిగాడు.

"ఊఁ హూఁ."

"కానీ, వాళ్ళ నోర్లు మూయించాలని వుంది." అంది మళ్ళీ తనే.

"తప్పకుండా. ఏంచెయ్యమంటావో చెప్పు."

కొస్త ఆగి "కళామందిరం నా పేర పెట్టండి" అంది.

చాలా నెమ్మదిగా అయినా ప్రభుకి వినిపించేలా.

ఎంతసేపటికీ ప్రభునుంచి జవాబు రాకపోయేసరికి అతని ముఖంలోకి పరీక్షగా చూసింది.

అతను ఏదో ఆలోచిస్తున్నట్టుగా వున్నాడు.

కళ్యాణి అతని చెంతనుంచి లేచి సరిగాకూర్చుంది. తనలో తాను అనుకున్నట్లుగా అతన్ని వోరగాచూస్తూ అంది.

"వాళ్ళ మాటలు నిజమేనన్నమాట."

"అదికాదు కళ్యాణీ ! కళామందిరం కొన్న డబ్బూ, దాని బాగుచేతలకై వెచ్చించిన డబ్బూ మొత్తం రమాదేవిదే. ఆ విషయం నీకూ తెలుసు."

"ఇవ్వాలని లేనప్పుడు ఏదో వోవొంక చెప్పాలిగా. మీ మనసులో నా స్థానమేమిటో తెలుసుకోవాలనే అడిగాను. అర్థమయింది యిప్పటికి" కళ్యాణి కళ్ళు నీటితో నిండాయి.

"మీకు నేను భార్యను కాలేను. నాకు పుట్టిన పిల్లలు మీ ఆస్తికి హక్కుదారులు కాలేరు."

కళ్యాణి చివ్వున లేచిపోయింది.

ప్రభు కళ్యాణి చేయిపట్టుకుని ఆపాడు.

కళ్యాణి మనసులో యిన్ని ఆలోచనలూ భయాలూ వుండా ఆపనికి పూనుకుంట. అతని మెదడులో ఆలోచనలు పరుగెత్తాయి. ప్రభుకి కళ్యాణి మనసు

అర్థమయినట్లుగా అన్పించింది.

ఉల్లాసంగా "కళ్యాణీ! రేపీపాటికి కళామందిర్ నీపేర వుంటుంది. సాయంత్రమే లాయర్ దగ్గరకు వెడదాం. నామాట నమ్ముతావా?" కళ్యాణి కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు.

అతని చూపులకీ, యిచ్చిన వాగ్దానాలకీ కళ్యాణి మొహంలోకి మునుపటి కాంతివచ్చింది.

అతని కాళ్ళదగ్గర కూర్చుని, అతని వొడిలో తల పెట్టుకుని 'నేను అదృష్టవంతురాల్ని.' అస్పష్టంగా ఏవో గొణుక్కుంది.

* * *

ప్రభు కళ్యాణియింట్లో వుండగా రావుగారు పోయారు.

వెంటనే రమ్మని కబురుచేశారు ప్రభుకి.

ప్రభు హుటాహుటి బయలుదేరి వెళ్ళాడు.

అశ్రుపూర్ణ నేత్రాలతో మామగారి శవం ప్రక్కన కూర్చుంది రమ. ప్రభు తండ్రి కాళ్ళవద్ద శిలలా నిలబడిపోయాడు.

మనసు కొన్నేళ్ళు వెనక్కి పరుగెట్టింది.

చిన్నతనం- ఆయన వాత్సల్యం- జలుబుచేసినా ఆయన చేసే ఆర్భాటం, ఒళ్ళు వెచ్చబడితే నిద్రాహారాలు మాని ఆయన తన్ను అంటిపెట్టుకుని వుండటం-

తోటిపిల్లలతోకలిసి తిరిగితే ఎక్కడ చెడిపోతాడోనన్న ఆయన తాపత్రయం- కళామందిరం విషయంలో ఆయన సలహాలు తాను పెడచెవినిపెట్టటం- సాంప్రదాయం అంటూ ఆయన యిచ్చే సలహా ఆధారంగా ఆయన్ను తాను అనుమానించటం-

ఆయన వూర్లోలేనప్పుడు ఆయన డైరీలు వెతికటం-

ఎక్కడా ఏ ఆచూకీ దొరక్కపోగా ఓ చోట 'రాజేశ్వరీ! నీ జ్ఞాపకాలనుంచి దూరంగా వుండాలని రేసులకు బానిసనయ్యాను. ఏ ఒక్క అలవాటూ మానుకోలేకుండా వున్నాను.' అని వ్రాసుకున్నారు. డైరీల్లో- ఆయన దినచర్య- తల్లి గురించి తన గురించి రాసుకునేసరికి పశ్చాత్తాపం కలిగింది.

ప్రభు కళ్ళు నిండుకున్నాయి. టప్‌టప్‌మంటూ కన్నీళ్ళు జారి ఆయన పాదాలమీద పడినాయి.

జరగవలసిన కార్యక్రమమంతా యధావిధిగా జరిగిపోయింది.

కళామందిర్ సభ్యులు ప్రభుని పలకరించడానికొచ్చారు.

తమ సంతాపం తెలిపిన తరువాత నార్త్ఇండియాలో తమ ప్రదర్శన విషయమై ప్రస్తావించారు.

ప్రభు రెండునెల్ల క్రితం నార్త్ఇండియాలో పర్యటిస్తూ ప్రదర్శనలకు ఏర్పాట్లుచేశాడు.

ఇప్పుడు వారి దగ్గరనుంచి రమ్మని ఆహ్వానం వచ్చింది.

"మన ప్రోగ్రాంలో ఏమార్పు వుండదు. మీరంతా వెళ్ళండి. నాల్రోజులు ఆలస్యంగా అయినా నేను వొచ్చి మిమ్మల్ని కలుస్తాను." అనిచెప్పి వాళ్ళను పంపేశాడు.

రావుగారి దినవారాలు భారీఎత్తున జరిగాయి.

తండ్రిపేరుమీద ధానధర్మాలు విరివిగా చేశాడు ప్రభు.

రమాదేవి తండ్రి రామదాసుగారు అస్వస్తతగావున్నా దినాలకి హాజరయ్యారు.

మామగారియెడ ముభావంగా ప్రవర్తించాడు ప్రభు.

రామదాసుగారు ప్రయాణమైనరోజున రమాదేవిని కలుసుకుని తనతోవొచ్చి కొద్దిరోజులు వుండివెళ్ళమని అడిగారు.

తండ్రి ఆరోగ్యం కళ్ళారా చూసిన రమాదేవికి తండ్రివెంట వెళ్ళి కొద్ది రోజులు ఆయనకి సేవచేయాలని వున్నా ఆ కోరికను చంపుకుంది.

ఇటువంటి పరిస్థితులలో తను యిల్లువిడిచి వెడితే యీ యింటితో తన బంధం పూర్తిగా తెగిపోతుంది. జాబు వ్రాసి, తనని రమ్మని అడిగేవారెవరూ లేరు. ఇంతవరకూ పరిస్థితులు తండ్రికికూడా తెలియొచ్చు.

ఇన్నివిధాల ఆలోచించి "యిటువంటి పరిస్థితులలో నేను నీవెంట రావడం బాగుండదు నాన్నా! మీ ఆరోగ్యం జాగ్రత్త" అని తండ్రిని సాగనంపింది రమాదేవి.

రెండురోజుల తర్వాత శర్మగారి నడిగి పదివేలరూపాయలు తీసుకుని కళ్యాణి యింటికి వెళ్ళాడు ప్రభు.

"ఈరోజు అమ్మగారి నాటకం వుందట రాజమండ్రిలో. అమ్మగారు నిన్ననే వెళ్ళారు." అని చెప్పింది పనిమనిషి.

కళామందిర్ సభ్యులను కలుసుకోవడానికి వొంటరిగా రైలెక్కాడు ప్రభు.

* * *

భర్త నార్త్ఇండియా వెళ్ళాడని పనివాళ్ళద్వారా తెలుసుకున్న రమాదేవి బరువుగా నిట్టూర్చింది.




తనేమీ పరాయిది కాదుగా. భార్యేగా. ఒక్కమాట వెళుతున్నట్లు చెపితే తప్పా? అనుకోగానే కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఏ వేళకయినా పలకరించి మంచిచెడ్డలు విచారించే మామగారు పోయారు. తన ఇష్టానుసారం ప్రవర్తించడంతప్ప తనభార్య తనకోసం, తన మాటకోసం అహర్నిశలూ ఎదురు చూస్తుంటుందన్న ధ్యాసలేదు ప్రభుకి. ఇంత పెద్ద ఇంట్లో ఎడారిలో వున్నట్టుగా వుంది.

భర్త తిరిగివచ్చాక ఆదరిస్తాడన్న నమ్మకం సన్నబోతుంటే జీవితంమీద విరక్తి, ఆ విరక్తి స్థానంలో వైరాగ్యం చోటుచేసుకుంటూవుంది ఆమెలో.

అంతలోనే గోరంత ఆశ. ఏమూలనుంచో మిణుకు మిణుకు మంటూ రేపుమీద ఆశ.

తన ఓర్పుకీ, నిరీక్షణకీ ప్రతిఫలం లభిస్తుంది. ఫలిస్తుంది.

ఎప్పటికయినా తనభర్త తనని ఆదరిస్తాడనుకుంటే ఆశ-

కాదనుకుంటే నిరాశ- నిస్పృహ.

మనసుతో ఘర్షణపడుతూ- రాజీకివస్తూ రోజునో యుగంలా గడుపుతోం ఆమె.

ఉదయం పదిగంటల వేళ-

తన గదిలో కూర్చుని తండ్రికి జాబు వ్రాస్తోంది.

గది గుమ్మంలోంచి నౌకరు "అమ్మా!" అని పిలిచాడు.

తలెత్తి చూసింది రమాదేవి.

"శర్మాజీ మీతో మాట్లాడాలని వచ్చారు."

"వస్తున్నానని చెప్పు" అని వ్రాస్తున్న వుత్తరం పూర్తిచేసి ప్రక్కనపెట్టి క్రిందికి దిగివచ్చింది.

"మీతో కొంచెం మాట్లాడదామని వచ్చానమ్మా!" అన్నారు శర్మాజీ.

రమాదేవి తివాచీమీద కూర్చుంటూ "కూర్చోండి" అంది.

ఆమెకి కొద్దిదూరంలో శర్మాజీ కూర్చున్నారు.

"ఇప్పుడు ముఖ్యంగా మీకు చెప్పవలసిందేమిటంటే-" ఉపోద్ఘాతం లేకుండా అసలు విషయానికొచ్చేశాడు శర్మాజీ.

"మీ పెళ్ళప్పుడు రావుగారు యీ యిల్లు తనఖాపెట్టి రెండున్నర లక్షలు అప్పుతెచ్చారు."

రమాదేవి విస్మయంగా చూసింది కొత్త విషయం వింటున్నట్టు.

శర్మాజీ నిదానంగా చెప్పుకుపోయారు.

"ఆ తర్వాత రావుగారికి సుస్తీచేసినప్పుడూ, ఆయన దినవారాలకూ, ప్రభు బాబు నార్త్ఇండియా వెళ్ళటానికీ యాభయివేలు ఆ సేటుదగ్గరే తెచ్చాను. మొత్తం మూడులక్షలన్నమాట."

"... ... ... ... ... ..."

"రావుగారు పోవటంతో అతను మొహమాటంలేకుండా తన మొత్తం తనకి యిమ్మని అడుగుతున్నాడు."

"వారిని రానివ్వండి," అందామె నెమ్మదిగా.

"కాదమ్మా! రావుగారికి నేనంటే ఎంతో నమ్మకం- ముప్ఫయి ఏళ్ళుగా యీ యింటి అజమాయిషీ నేనే చూస్తున్నాను. ఆయనగారు రహస్యంగా వుంచమన్న విషయం యిప్పటివరకూ బయటపెట్టటం జరగలేదు."

రమాదేవి ముఖంలోకి చూస్తూ-

"మీరు కట్నంగా తెచ్చిన రెండులక్షలూ తామిచ్చినవేనని ప్రభుకి తెలియకూడదని రావుగారి కోరిక."

రమాదేవి మౌనంచూసి తిరిగి ఆయనే మాట్లాడారు.

"ప్రభు యింటి విషయాలు ఎప్పుడూ పట్టించుకోలేదు. ఆ విషయాలు ప్రభుకి తెలియటంకూడా వారికి యిష్టంవుండేది కాదు. బాంకులో చిల్లిగవ్వ లేదు. బ్యాంకు పుస్తకాలు నాదగ్గరే వున్నాయి." పాసుబుక్కులు రమాదేవి ముందుంచాడు.

రమాదేవి వాటివైపు కన్నెత్తికూడా చూడలేదు.

"శర్మాజీగారూ! మొదట్నించీ యింటివిషయాలన్నీ మీరే చూస్తున్నారు గాబట్టి, యీ సమస్యకు కూడా నిదానంగా ఆలోచించి మీకు ఎట్లా తోచిందని తోస్తే అట్లా చెయ్యండి," అంది.

రమాదేవి అట్లా అనాలనే కోరుకుంటున్న ఆయన,

"నాకు ఎటూ ఆలోచన రాక మీ దగ్గరకు వచ్చాను. రావుగారు బతికున్న రోజుల్లో అవసరమొస్తే నోటిమీద లక్షకాకపోతే పదిలక్షలు తీసుకెళ్ళమన్న మనిషే యితను." ముక్కుమీదికి జారిపోతున్న కళ్ళజోడుని చూపుడు వేలుతో పైకి తోసుకుని,

"తమరేమీ అనుకోనంటే ఒక్క మాట...." అని గొంతు తగ్గించి, "అతనికి ప్రభుబాబు యీ అప్పు తీరుస్తాడన్న నమ్మకంలేకనే యీ వొత్తిడి తెస్తున్నాడు" అన్నాడు.

రమాదేవి లేచి నిలబడింది.

"వారిని యింటికి ఒకసారి రమ్మని టెలిగ్రాం యివ్వండి." అని తన గదిలోకి వెళ్ళిపోయింది.

నెలరోజుల తర్వాత.

"అమ్మా! ఒకటికాదు, పది టెలిగ్రాములిచ్చాను. ఒక్కదానికీ జవాబు లేదు. ఆ నాటకాలవాళ్ళని వెంటేసుకుని ఎక్కడెక్కడ తిరుగుతున్నాడో. సేటు చూస్తే వూరుకునేలా లేడు. సరిగ్గా నెల టైమిస్తాను, పైకం వొచ్చిందా సరే, లేదా ప్లీడరు నోటీసు యిస్తానంటూ బెదిరిస్తున్నాడు." అని చెప్పి వెళ్ళాడు శర్మాజీ. గడువురోజులు గడిచిపోయాయి. ప్రభు జాడలేదు. అతని వుత్తరంకూడా లేదు."

శర్మాజీ ఆవేళ వొచ్చి,

"అమ్మా! అతను ఆగేలా లేడు. పరువుపోయాక మనం నలుగురికీ ముఖం చూపించలేం. నాకు ఒక వుపాయం తోస్తూంది. మనం మూడు లక్షలు బాకీ పడివున్నాం. ఈ రోజు కాకపోతే రేపయినా యింకోచోటునుంచి పైకం వచ్చే అవకాశం లేదు. ఈ భవంతి రావుగారి తాతగారి హయాంలో కట్టింది. చాలా

పాతబడిపోయింది. ఎంత ఎక్కువ లెక్కకట్టుకున్నా రెండున్నర లక్షలకు మించి పలకదు. అతని బాకీకి బదులు యీ భవనం తీసుకుంటాడేమో అడిగి చూద్దాము.

"ఇక మనం వుండేది ఎక్కడంటారా?- కళామందిరంలో ఎన్నో గదు లున్నాయి. ప్రభుబాబు వచ్చినా యింతకుమించి మరో ఏర్పాటు చెయ్యలేరు. కాబట్టి మీరు ఆలోచించి మీ నిర్ణయం చెపితే మీ మాటప్రకారం చేస్తాను."

ఆలోచనే తనది. నిర్ణయం మీదే అన్నట్లు చూస్తూ జవాబుకై నిలబడ్డాడు శర్మాజీ.

అప్పటివరకూ వూపిరి బిగబట్టుకుని శర్మాజీ మాటలు విన్న రమాదేవి "మంచిది. మీకు తోచినట్టు చెయ్యండి." అనేసి ఆగకుండా తనగదిలోకి వెళ్ళిపోయింది.

ప్రభు రాకపూర్వమే వ్యవహారం సెటిల్ చెయ్యాలన్న అతని కోరిక తీరింది. తృప్తిగా నవ్వుకున్నాడు.

ప్రభు భార్యను కన్నెత్తి చూడడు. వున్నదంతా తీసుకెళ్ళి వుంచుకున్న దానికి దోచిపెడుతున్నాడు. ముప్ఫయి ఏళ్ళనుంచీ కనిపెట్టుకుని వున్న తనయినా తినకుండా పరాయిదానికి పోవటమెందుకనిపించి, సేటు తొందరచేయకపోయినా శర్మాజీనే కల్పించి, సేటును పురిగొల్పి వ్యవహారం నడిపించాడు. ప్రతిఫలంగా సేటు శర్మాజీకి పాతికవేలు ముట్టచెపుతానని నోటు రాసియిచ్చాడు. వృద్ధాప్యంలో కష్టపడనక్కరలేదు. కృష్ణారామా అంటూ కూర్చుని తినొచ్చు. ఆలోచిస్తూ భవిష్యత్తుకు పథకాలు వేస్తున్నాడు శర్మాజీ.

రమాదేవి చిన్న సూటుకేసుతో అతనిముందు నిలబడింది. ఆయన తెల్లబోయి చూశాడు.

"శర్మాజీ! నాకు స్టేషను వరకూ బండి తెప్పించిపెట్టండి." అందామె.

"ఇప్పుడే తొందరేముంది?" మాటలు తడబడినాయి. రమాదేవి అతని ముఖంలోకి చూసి "ఎప్పుడయినా తప్పదుగా. వారు వొచ్చాక సంగతులన్నీ చెప్పండి. ఒక్క విషయమూ దాచకండి." అంది.

శర్మాజీ బయటికి నడిచాడు.

* * *

రమాదేవి కూర్చున్న బండి యింటి ఆవరణ దాటి వీధిలోకి వచ్చేసింది. రమాదేవి కళ్ళు యింకా ఆ యింటినే నిర్నిమేషంగా చూస్తున్నాయి.



ఆమె కళ్ళనిండా నీళ్ళున్నాయి.

ఆ రోజు-

మేళతాళాల మధ్య, ఊరేగింపులతో ఒంటినిండా ఆభరణాలతో పచ్చని తోరణాలతో దేదీప్యమానంగా, దేవేంద్రభవనంలా వెలిగిపోతున్న యింట్లో కాలు పెడుతూ ఇది నా యిల్లు, ఇంట్లోని వాళ్ళంతా నా వాళ్ళు, నా ఆశలు తీరేది, కోరికలు పండేది యిక్కడే అనుకుంది.

ఈనాడు-

తీరని కోరికలతో, నేరవేరని ఆశలతో, కలతబారిన హృదయంతో, కన్నీళ్ళతో, కట్టుబట్టలతో యిల్లు విడిచి వెళ్ళిపోతోంది.

జీవితం ఎంత విచిత్రమైనది!

కన్నీటి పొరల మధ్య మసకమసకగా కనిపిస్తోంది భవంతి.

కొంగుతో కళ్ళు వొత్తుకుని తనకీ, యింటికీ మధ్య పెరిగిపోతున్న దూరాన్ని చూస్తూ కూర్చుంది.

బండ మలుపు తిరిగింది.

*　　*　　*

బెంగుళూరు, మైసూరు, ఢిల్లీ, చండీఘడ్ వంటి ప్రముఖ పట్టణాల్లో కళా మందిర్ ప్రదర్శన లిచ్చింది. ఆశించినంత ఆదరణ ఎక్కడా లభించలేదు. తెలుగు నాటకాలపట్ల వుత్సాహం, అభిమానం చూపినవారే వాటిని పరమ బోర్‌గా ఫీలయ్యారు. సినిమాలు చూడటంలో ప్రదర్శించిన వుత్సాహం నాటకాల పట్ల చూపించలేకపోయారు. వాతావరణం సరిపడక కొందరు నటులకి సుస్తీ చేసింది. మిగిలినవారిలో వుత్సాహం సన్నగిల్లింది.

ప్రభు చేతిలో పైకం కూడా యించుమించు అయిపోవచ్చింది. అంతా కలిసి తిరిగిపోవాలంటూ పట్టుబట్టారు. ప్రభు తిరుగుప్రయాణానికి ఏర్పాట్లు చేశాడు.

ఇంటికి వేసున్న తాళం చూసి ఆశ్చర్యపోయాడు ప్రభు.

పుట్టి బుద్ధిఎరిగింది మొదలు యింటికి తాళంవెయ్యగా చూడటం యిదేమొదలు.

తిన్నగా కళామందిరానికి వెళ్ళాడు.

సభ్యులంతా ఏదో తర్జనభర్జనలు పడటం దూరాన్నుంచే గమనించాడు. ప్రభు సమీపించటంతో మాటలు ఆపివేశారు.

నిశ్శబ్దంగా అందరూ అతన్నే చూస్తూ వుండిపోయారు.

ఆ చూపుల్ని తట్టుకోలేకపోయాడు ప్రభు.

"ఏమిటీ ? ఏం జరిగింది ? అంతా బయటే నిలబడ్డారేం ?"

ప్రభు ప్రశ్నలకి ఏ ఒక్కరినుంచీ జవాబు రాలేదు.

ప్రభును చేయిపట్టుకుని పక్కకు తీసుకుపోయాడు ప్రసూన.

"ప్రభూ ! నువ్వు ఆవేశపడకుండా నిదానం వహించు. అన్ని వేళల్లోనూ మనం అనుకున్నవన్నీ అనుకున్నట్లు జరగవు."

ప్రసూన యీ మాటలు ఎందుకంటున్నాడో ప్రభుకి బోధపడలేదు. అయోమయంగా ప్రశ్నార్థకంగా చూశాడు.

ప్రసూన ప్రభు చేతుల్ని అందుకున్నాడు.

"కళ్యాణి కళామందిరాన్ని ఎవరో నవాబుకి రెండులక్షలకి అమ్మేసిందట."

ప్రభు అదిరిపడ్డాడు.

అంతకన్నా సూర్యుడు పశ్చిమాన వుదయించాడని ప్రసూన చెపితే నమ్మేవాడేమో !

"కళ్యాణి- కళామందిర్ అమ్మేసిందా ? నో- నేను నమ్మను. వుండండి. నేనిప్పుడే వెళ్ళి కనుక్కొస్తాను" ఆవేశంగా వెళ్ళబోయిన ప్రభుని ఆపి,

"కళ్యాణి వూర్లోలేదు. డబ్బు తీసుకుని దేవదాసుతో వెళ్ళిపోయిందట." ప్రభు కొయ్యబారిపోయాడు.

ప్రసూన వోదార్పుగా ప్రభు భుజంమీద చెయ్యి వేశాడు.

ప్రభులో కదలిక లేదు

వినకూడనిది విన్నట్టు-

చూడకూడనిది చూసినట్టు-

విభ్రాంతితో నిలబడిపోయాడు.

ప్రభుని ఆ స్థితిలో చూసినవారంతా కంగారుపడ్డారు. ఏం చెయ్యాలో- ఎలా అతన్ని వోదార్చాలో తెలీక ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

కాసేపయ్యాక నిలబడే వోపిక లేనివాడిలా ఓ బండరాతిమీద కూలబడ్డాడు ప్రభు.

అతని మస్తిష్కంలో శతకోటి రైళ్ళు పరుగెడుతున్నాయి.

నేను విన్నది నిజమా ?! అనుకుంటున్నాడు పదేపదే.

ఆ రోజు మొదటిసారి కళ్యాణిని చూడటం-

ఆమెతో నటించడం-

హోటల్లో కళ్యాణి మాటలు.

అరడుగుల అబ్బాయి- పసిపాపగా వొడిలోకొస్తే అంటూ కళ్యాణి మురిపెం- ఒకొక్కటే గుర్తుకొస్తుంటే, కళ్యాణి నిజంగా తన్ను ప్రేమించలేదా ? అంతా నటనేనా ? కళ్యాణి వంచితా ?-

ప్రభు ఆలోచనలు ముందుకు సాగడంలేదు.

బుర్ర వేడెక్కిపోతోంది.

"ప్రభూ ! లే నాయనా ! ఇంటికి పోదాం పద."

శర్మాజీ గొంతు విని తలెత్తాడు.

శర్మాజీ చేతులు పట్టుకుని,

"శర్మాజీ వీళ్ళు చెపుతున్నది నిజమేనా ? కళ్యాణి కళామందిర్ అమ్మేసిందా ? దేవదాసుతో వెళ్ళిపోయిందా ? అబద్ధమని చెప్పండి." అన్నాడు పసివాడిలాగా.

ప్రభు కంఠంలోని దైన్యతకు అంతా చలించిపోయారు. ప్రభుకి కళా

మందిర్ ప్రాణంలో ప్రాణం. దాన్ని వృద్ధిలోకి తేవడానికి అహర్నిశలూ అతను పడిన శ్రమ, చేసిన కృషి అందరకూ తెలుసు.

"ప్రభూ! అబద్ధాన్ని నమ్మినంత తేలికగా నిజాన్ని నమ్మలేకపోవటం మన బలహీనత. పద, నీతో చాలా విషయాలు మాట్లాడాలి" అని నచ్చజెప్పి, తనతో తీసుకువెళ్ళాడు శర్మ.

* * *

శర్మాజీ చెప్పిన విషయాలన్నీ విన్నాక ప్రభు యించుమించు పిచ్చివాడే అయ్యాడు.

కాసేపు ఆగాక కళామందిర్ వైపు నడకసాగించాడు.

ప్రయాణంలో రెండురోజులనుంచీ నిద్రలేని కారణంగా తల విపరీతంగా నొప్పిగా వుంది. కళ్ళు మండుతున్నాయి. నడుస్తున్నాడు.

నిన్నటివరకూ తనో జమీందారు వారసుడు. కళామందిర్ యజమాని.

ఈ రోజు- నిరాశ్రయుడు. మనదంటూ ఏదీ మిగిలిలేదు. తనవారంటూ ఎవరూ లేరు. అతని మనస్సు తెల్లకాగితంలా సూన్యం అయిపోయింది.

కాళ్ళీడ్చుకుంటూ కళామందిర్ గేటు తెరుచుకుని లోపలికి వచ్చాడు. ఇంకా అక్కడే, చెట్లనీడన నిల్చుని అతనికొరకే నిరీక్షిస్తున్నారు కళామందిర్ సభ్యులు.

ప్రభు తిన్నగా ప్రసూన చెంతకు వచ్చాడు.

"ప్రసూనగారూ! నా దగ్గర యీ గొలుసు, వుంగరం తప్ప యింకేమీ మిగలలేదు. వీటిని అమ్మి తలా కొంచెం సర్దండి." అని అవి అతని చేతిలో పెట్టి వెనుతిరిగాడు.

"ప్రభూ! ఎక్కడికి వెడుతున్నావు? కళామందిర్ మాటేమిటి?" వెనుక నుండి అడుగుతున్న ప్రసూనకి సమాధానం చెప్పలేదు. ముందుకు సాగిపోయాడు.

"మళ్ళీ అతను ఎవరికీ కనిపించలేదా?" కుతూహలంగా అడిగాడో శ్రోత.

"ఆత్మహత్య చేసుకుని చచ్చిపోయివుంటాడు."

"కళ్యాణి మూలంగా అభిమానించిన కళకి దూరమైపోయాడు. పాపం అతని జీవితమే మలుపుతిరిగిపోయింది."

"కళ్యాణి తప్పు మాత్రం ఏముంది. తన భవిష్యత్తు తను చూసుకుంది." అందొక ఆర్టిస్టు,

"ఛట్. కళ్యాణిని వెనకేసుకుని వస్తున్నావంటే నీ బుద్ధీ అటువంటిదేనని




తెలిసిపోతోంది. ప్రాణానికి ప్రాణంగా ప్రేమించి పువ్వుల్లో పెట్టి పూజించిన ప్రియుడి ప్రేమని కాదని మధ్యవొచ్చిన ఎవడిమాటో నమ్మి వాడితో లేచి పోతుందా ?

"అన్నేళ్ళు అతనితో కాపురంచేసి అతని మనసేమిటో గ్రహించలేకపోయిందీ ?"

"నేనే ప్రభునై వుంటేనా ముందా కళ్యాణినీ, దేవదాసునీ మూడు లోకాల్లో ఎక్కడ దాక్కున్నా వెతికిపట్టుకుని ముక్కచెక్కలుగా నరికేసి వుండేవాడిని." ఆవేశంగా, కసిగా, ఉద్రేకంగా అన్నాడు మురళి.

నారాయణ ఆ యిద్దరివంకా ఓసారి మౌనంగా చూశాడు.

"నారాయణా ! ప్రభు యింకా బ్రతికే వున్నాడంటావా ?" సుబ్బారావడిగిన ప్రశ్నకు నారాయణ క్షణం మౌనంవహించి తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

* * *

"పదిహేను సంవత్సరాల తర్వాత-"

"తరవాత ?"

"కళామందిర్ పెళ్ళియిల్లులా కళకళలాడుతోంది. కొత్తగావేసిన రంగులు కంటికి ఆహ్లాదం కలిగిస్తున్నాయి. ఆవరణలో ఎత్తుగా, గుబురుగా పెరిగిన చెట్లకి అమర్చిన రంగురంగుల బల్బులు కాంతులు వెదజిమ్ముతూ గమ్మత్తుగా మెరుస్తున్నాయి. గేటు కిరువైపులా అరటిస్తంభాలు. ద్వారాలకి మామిడి తోరణాలు. గేటుపైన ఆర్చికి కళామందిర్ అన్న బేనర్ వేలాడుతోంది. దాని క్రిందనే

స్వాగతమ్ బోర్డు. ఆ ఆవరణంతా కార్లతో, స్కూటర్లతో నిండివుంది. జన ప్రవాహంలా లోపలికి వెళ్తున్నారు. రోడ్డుకి కాస్త అవతలగా నుంచుని కళా మందిర్‌ని, లోపలికి వెళ్తున్న జనాన్ని తదేకంగా చూస్తున్నాడు ఒక మనిషి.

"ఆ మనిషి ప్రభునా?" ఒక ఆర్టిస్టు కుతూహలంగా అడిగింది. నారాయణ ఆమెవైపు ఒకసారి చూసి చెప్పుకుపోసాగాడు. "అతడి ముఖం పీక్కుపోయి వుంది. గడ్డం మాసివుంది. బట్టలు మురిగ్గా, చిరుగులుపట్టి వున్నాయి.

అతడు వోపికతో అక్కడే నిలుచుని వున్నాడు.

లోపల కార్యక్రమాలు మొదలయినట్లున్నాయి. బయట జనం సందడి తగ్గింది. వీధంతా ప్రశాంతంగా వుంది. గేటువద్ద కాపలాదారు వున్నాడు. అతడికి నడివయసు దాటివుంటుంది. తెల్లని యూనిఫారం ధరించి చేతిలో లాఠీపట్టుకుని వున్నాడు. కళామందిర్‌వైపే చూస్తూ నిలుచున్న ఆ వ్యక్తిని యితడు ఓ కంట కనిపెడుతూనే వున్నాడు. అతను రోడ్డుదాటి కళామందిర్ గేటును సమీపించాడు. శ్రోతలందరూ నారాయకేసి చూస్తూ కుతూహలంతో వింటున్నారు. బయట వానజల్లు పడుతూనేవుంది

"ఇదుగో భాయీ! యిలా చూడు." వాచ్‌మన్ భుజంమీద చెయ్యివేశాడతను.

"లోపల ఏం జరుగుతున్నదో చూడొచ్చా? ఎక్కువసేపు వుండనులే. పది నిముషాల్లో వచ్చేస్తాను."

వాచ్‌మన్ అతన్ని ఒక్కక్షణం క్రిందినుంచి మీదివరకూ చూసి "వెళ్ళు" అన్నాడు.

అతను లోపలికి వెళ్ళి గోడవారగా నిల్చున్నాడు.

ఆరుబయట ఖాళీస్థలంలో షామియానాలు వేసివున్నాయి.

బారులు తీర్చివున్న కుర్చీలలో, ఆడమగ ఆసీనులయి వున్నారు. స్టేజిమీద మైకుముందు నిలబడివున్న అతను మాట్లాడుతున్నాడు.

"నువ్వు చెప్తున్నది?"

"ఉష్. విను" అంటూ పక్కతను వారించాడు.

"ఈ కళామందిర్‌కి పూర్వచరిత్ర చాలావుందని విన్నాను యీ కళామందిర్ తర్మాత ప్రభాకరచక్రవర్తి. అతను రావుబహద్దూరుగారి మనవడట. అతను కళాతపస్వి, కళాభిమాని, కళాకారుడు. అతని హయాంలో యీ కళామందిరం కళలకు నిలయంగా నిత్యకళ్యాణం పచ్చతోరణంగా వుండేదట. చీకటి వెలుగు లనేవి మానవ జీవితాలకే పరిమితమని అనుకుంటాం. కాని అది పొరపాటని

పిస్తూంది. ప్రాణం లేకపోయినా, జీవకళ వుట్టిపడుతూ గతవైభవాలను చాటే ఎన్నో కళాఖండాలు, దేవాలయాలు, భవనాలు పీటికికూడా చీకటి వెలుగులు వుంటాయని యీ కళామందిరాన్ని చూచి మనం నమ్మవచ్చు. గ్రహణంపట్టిన సూర్యుడిలా యిది కొన్నేళ్ళు చీకటిలో వుండిపోయింది. ఓ నవాబుగారు దీన్ని కొన్నాళ్ళు విలాసమందిరంగా వుపయోగించుకుని, విదేశాలకు వెళ్ళిపోయారు. తర్వాత యిది ఘోస్ట్ బంగళాలా మారింది. నవాబుగారు అమ్మజూపిన బంగళాని మన హీరో హరిక్రిష్ణగారు కొనటంతో దీని దశ తిరిగింది. ఇది మనందరికీ గర్వకారణం. హరిక్రిష్ణగారి గురించి నేను వేరుగా మీకు పరిచయం చెయ్యానవసరం లేదు. ఆయన ఒక్కసారిగా హీరోగా తెరమీదికి రాలేదు. ఎన్నోసంవత్సరాలనుంచీ నాటకరంగంలో కృషిచేసి, పెద్దల మెప్పులూ, సన్మానాలూ అందుకుని సినీరంగంలోకి ప్రవేశించారు. ఆయన సినీఫీల్డులోవుంటూ నాటకరంగాన్ని ఉద్ధరించ బూనుకోవటం గొప్ప విషయం. ఈ కళామందిరాన్ని, వసతిగృహంగా మార్చకుండా తిరిగి కళామందిర్‌గానే తీర్చిదిద్దాలన్న ఆయన సంకల్పం ఎంతో వున్నతమైనది."

కరతాళధ్వనులు మారుమ్రోగాయి.

అతడు తన్ను తాను మరచి వింటున్నాడు.

కళ్ళు అప్రయత్నంగా తడిసిపోయినాయ్.

ఆనందమో, దుఃఖమో తెలియని అనుభూతిలో శరీరం కంపిస్తూంది.

"ఏయ్ ఎవరునువ్వు? ఇక్కడ ఎందుకు నిలబడ్డావు? నడు బయటికి" అంటూ అతని భుజంమీద చెయ్యివేశాడొక వాలంటీరు.

వాలంటీరువేపు చూడకుండానే తన భుజంమీద వున్న చేతిని తొలగిస్తూ, "వుండు చూడనివ్వు" అంటూనే స్టేజివైపు చూడసాగాడు అతను.

"వుండులేదు, గింక లేదు. ముందు బయటికి నడువ్" అంటూ అతని భుజం మీద చెయ్యివేసి బలంగా ముందుకు తోశాడు వాలంటీరు.

"నోటితో చెప్పితే పోయేదానికి చెయ్యి వుపయోగించటం దేనికి?" అంటూ అక్కడ్నుంచి గేటువైపు నడిచాడు అతను.

గేటు దాటబోతుండగా,

"బాబూ!" అన్న ఆర్ద్రమైన పిలుపు వినిపించి అక్కడే నిలబడి చూశాడు.

గేటు కాపలాదారు ఏడుస్తున్నాడు.

"నువ్వు నన్ను గుర్తుపట్టావా ఇస్మాయిల్" అని అడిగాడు అతను.

"బాబూ! ఈ భవనం హక్కుదారు, యజమాని అయివుండి మీకు వెళ్ళ గొట్టించుకునే స్థితి వొచ్చిందా" అంటూ కుమిలి కుమిలి ఏడుస్తున్నాడు అతను.

"ఇస్మాయిల్ వుండు. ఎవరైనా వింటే...." అతను గబుక్కున తలతిప్పి అటూ యిటూ చూశాడు.

"పొరపాటే బాబూ" అంటూ అతను దుఃఖాన్ని దిగమింగటానికి ప్రయత్నిస్తూ, "వుండండి బాబూ! యిప్పుడే వస్తాను." అని లోపలికి వెళ్ళి రెండు నిముషాల్లో మోకాళ్ళపైకి కట్టిన ముతకపంచె, గళ్ళచొక్కా వేసుకున్న ఓ పద్దెనిమిదేళ్ళ కుర్రాడితో తిరిగివచ్చాడు.

"సర్వీమా, నువ్విక్కడ వుంచో" అని ఆ కుర్రాడికి సంజ్ఞలతో చెప్పి,

"పదండి బాబూ" అంటూ అతన్ని కళామందిర్ ఆవరణ వెనకభాగంలో వున్న తన పెంకుటింటివేపు తీసుకుపోయాడు.

అతను వేపచెట్టుకింద ఆగిపోయాడు.

ఇస్మాయిల్ యింట్లోంచి ఓ నులకమంచం తెచ్చి చెట్టుకిందవాల్చి "కూర్చోండి బాబూ" అన్నాడు.

"ఈ చెట్టు చాలా పెద్దదయింది కదూ ఇస్మాయిల్!"

"అవును బాబూ!"

"ఆ రోజు తప్పితే నా యింటిముందు ఎందుకులే బాబూ అన్నా వినకుండా ఎండాకాలం హాయిగా చెట్టుకింద మంచంవాల్చుకుని నన్ను తల్చుకో అన్నారు."

ఇస్మాయిల్ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"ఇస్మాయిల్ నాకు ఆకలిగా వుంది. తినటానికేమైనా వుందా?" మంచంమీద కూర్చుంటూ అడిగాడు అతను.

"ఇప్పుడే వస్తానుండండి బాబూ" అంటూ బయటికెళ్ళిన ఇస్మాయిల్ పది నిముషాల్లో పాలగ్లాసుతో పళ్ళతో తిరిగొచ్చాడు.

మంచంపక్కన ఎత్తుపీటవేసి తెచ్చిన పళ్ళని గాజుప్లేటులో పెట్టి దానిమీద వుంచాడు.

"బాబూ యివి తిని విశ్రాంతి తీసుకోండి. ఓ గంటలో వచ్చేస్తాను" అని వెళ్ళిపోయాడు.

తెల్లవారింది.

ఇస్మాయిల్ ఓ మూల కుంపటి వెలిగించి రొట్టెలుచేసే ప్రయత్నంలో వున్నాడు.

ప్రభు లేచి మంచంమీద కూర్చున్నాడు.

* * *

శ్రోతల ముఖాల్లో ఆశ్చర్యం! ఆనందం!

ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు.

ప్రభు బ్రతికేవున్నాడా? కళామందిరం చూడటానికి వొచ్చాడా? యిన్ని ప్రశ్నలు మనసులో మెదిలినా పైకి అడిగితే నారాయణ చెప్పటం ఎక్కడ ఆపివేస్తాడోనని కుతూహలాన్ని తమ మనసుల్లోనే అణచుకున్నారు.

"లేచి ముఖం కడుక్కొని రండి బాబూ! వేడి వేడి రొట్టెలు తిందురుగాని" పిండి గిన్నెలో వేసి కలుపుతూ అన్నాడు ఇస్మాయిల్.

ప్రభు అతను చెప్పినట్లు చేశాడు.

మంచంమీద సరిగా కూచుని "నీలాగే మనుషులంతా మంచి మనసున్న వాళ్ళయితే యీ రోజు నేను యిట్లా వుండేవాడ్ని కాదు" అన్నాడు.

ఇస్మాయిల్ రొట్టె కాలుస్తూ ఏమీ అనలేదు.

ఉండి వుండి "మీరు అమ్మగారి దగ్గరికి వెళ్ళవలసింది" అన్నాడు.

ప్రభు ఇస్మాయిల్ వేపు చూస్తూ నిట్టూర్చాడు.

కిటికీలోంచి కళామందిర్ వేపు చూస్తున్నాడు.

ఇస్మాయిల్ రొట్టె తిరగేసి మంట తగ్గించాడు.

"డబ్బుకోసం పెళ్ళిచేసుకున్నాను తప్ప ఆమెను భార్యగా ఒక్కనాడయినా చూశానా? ఆమె నోరుతెరిచి చిన్న కోరిక కోరినా తీర్చానా? ఏ ముఖం పెట్టుకు వెళ్ళను."

తనలో తాను గొణుక్కున్నాడు.

ఇస్మాయిల్ లేచి తన పనిమీద వెళ్ళిపోయాడు.

సాయంత్రం అయింది. చీకటిపడింది.

నులకమంచంమీద నడుం వాల్చాడు.

వొళ్ళు తెలియకుండా నిద్రపోయాడు.

* * *

మర్నాడు——

పగలంతా అదే చెట్టుకింద అలాగే పడుకుని కళామందిర్ వైపు చూస్తూ గడిపేశాడు ప్రభు.

గతం అంతా గుర్తుకొచ్చి అతని మనసు బాధతో నిండిపోయింది.

ఆలోచిస్తూ మోచేతి వొంపులో ముఖం దాచుకుని కళ్ళుమూసుకుని పడుకున్నాడు. మునిమాపువేళ దాటిపోవటంగానీ, ఇస్మాయిల్ వొచ్చి దీపం వెలిగించటంగానీ అతనికి తెలియనేలేదు.

"బాబూ యింకా నిద్రపోతున్నారా? లేవండి భోజనంచేసేసి పడుకుందురుగాని."

"ఊ" అంటూ లేచి కూర్చున్నాడు ఇస్మాయిల్ మాటతో.

వెళ్ళిపోతున్న ఇస్మాయిల్ని ఆపి,

"చూడూ, కళామందిర్‌లో నాకేదయినా పని దొరుకుతుందేమో అడిగి చూస్తావా? చివరిరోజులు యిక్కడే గడిపెయ్యాలనుకుంటున్నాను" మెల్లగా అన్నాడు.

ఇస్మాయిల్ తెల్లబోయాడు.

"బాబూ! నా మాట ఒకటి వినండి. మీరే ప్రభుబాబని వాళ్ళకి చెప్పేస్తాను. అప్పుడు ...."

"ఇస్మాయిల్." అతని గద్దింపు ఇస్మాయిల్ నోరుమూయించింది.

"ఇప్పుడేకాదు, నేను చచ్చిపోయాకకూడా నేను ఫలానా అని ఎవరికీ తెలియటానికి వీల్లేదు, గుర్తుంచుకో. నువ్వనుకునే ప్రభాకర చక్రవర్తి ఎప్పుడో చచ్చిపోయాడు."

ప్రభు కంఠంలో యీసారి కోపంకన్నా దైన్యం ధ్వనించింది.

ఇస్మాయిల్ ఓ నిట్టూర్పు విడిచి వంట ప్రయత్నం చెయ్యటానికి వెళ్ళాడు.

అరగంట తర్వాత ఇస్మాయిల్ పెట్టింది తినేసి పచార్లుచేస్తున్నాడు ప్రభు.

ఇస్మాయిల్ అతనికి పక్క సరిచేస్తున్నాడు.

"ఇస్మాయిల్! కళామందిరంలో నవాబుగారు ఎన్నేళ్ళు కాపురంచేశారు?"

"అతను కాపురం చేశాననుకుంటున్నారా బాబూ. దీన్ని సానికొంపగా...."

"ఆ" ప్రభు ఆగిపోయాడు.

వెంటనే తన తప్పు గ్రహించి ఆగిపోయాడు ఇస్మాయిల్.

"నాతోపాటు కళామందిర్ కూడా దైన్యాన్ని అనుభవించిందన్నమాట....చెప్పు అంతా వివరంగా చెప్పు. నా గుండె ఏనాడో బండగా మారిపోయింది. కాకపోతే నేను ఏనాడో చచ్చిపోయి వుండవలసింది."

ఆవేశంలో నిజంచెప్పి అతని మనసు కష్టపెట్టినందుకు ఇస్మాయిల్ నొచ్చుకున్నాడు. కళామందిరాన్ని ప్రభుబాబు పవిత్రదేవాలయంలా చూచుకునేవాడని అతనికి తెలుసు.



ఇక తప్పదన్నట్లు చెప్పటం మొదలుపెట్టాడు.

"మొదట్లో నవాబుగారు ఒక్కరే ఆడపిల్లలతో వొచ్చి వారం పదిరోజులు గడిపి వెళ్ళిపోయేవారు. ఆ తర్వాత గానాబజానాలూ, రాకపోకలూ ఎక్కువయినాయి. చాలామంది ఆడపిల్లల్ని తెచ్చారు.

"బాబూ కళ్ళారాచూస్తూ ఏమీ అనలేని పరిస్థితి నాది. పొట్టకూటికి పనిచేసేవాడు చెప్పబోతే ఎవరు వినిపించుకుంటాడు?

"మూడేళ్ళపాటు అట్లా వ్యాపారం సాగించారు నవాబుగారు.

"ఓ రోజు అర్ధరాత్రి పోలీసులు పెద్దఎత్తున దాడిచేసి అందర్నీ పట్టుకుపోయారు. నవాబుగారు ఏమయ్యాడో ఎట్లా తప్పించుకున్నాడో తెలియదు. కొన్నాళ్ళకి నవాబుగారి తమ్ముడినంటూ ఒకాయన పెద్ద పెద్ద తాళంకప్పలు బిగించి, చూసుకుంటూ వుండమని వెళ్ళిపోయాడు."

"అంతే బాబూ. మళ్ళీ పన్నెండేళ్ళవరకూ యిటువేపు రాలేదు. తలుపులు తీయలేదు. ఎటూ పోలేక, మందిరాన్ని విడిచిపెట్టలేక నేను మాత్రం దీన్నే అంటిపెట్టుకుని వున్నాను.

"బాబూ! అప్పుడు గనక కళామందిర్‌ని చూస్తే మీగుండె చెరువయిపోయేది."

"ఊఁ" బాధగా మూలిగాడు ప్రభు.

ఇస్మాయిల్ గడపమీద కూర్చుని "బాబూ కళ్యాణమ్మ సంగతి విన్నారా?"

తల పంకించాడు ప్రభు.

"మిమ్మల్ని అన్యాయంచేసినవాళ్ళెవరూ బాగుపడలేదు బాబూ. శర్మాజీకి పిచ్చిపట్టింది. ఆయనకి రోజూ పెదబాబుగారు కల్లో కనిపించి, 'నా కొడుక్కి అన్యాయంచేస్తావా? నిన్ను చంపేస్తాను' అంటూ బెదిరించేవారట. దాంతో అతను పిచ్చిపిచ్చిగా కేకలుపెట్టేవాడట. నిద్రపట్టక, భయంతో వొణుకుతూ కొడుకుల్ని లేపి,

"రావుగారు వచ్చారేమో చూడండి. నన్నొక్కడన్నా దాయమని గొడవచేసే వాడట. చివరికి కొడుకులకి కూడా విసుగెత్తి చాలా కాలం ఆయన్ను గదిలో వేసి తాళంపెట్టి వుంచారట. ఓ రోజు రావుగారు తరుముకొస్తున్నట్టు భయపడి అదే ధ్యాసలో పరుగిడుతూ రోడ్డుమీద లారీకింద పడి చచ్చిపోయాడు."

"ఇక చాలు ఇస్మాయిల్, చెప్పకు."

మంచంమీద కూచునే వోపిక లేక వొరిగిపోయాడు ప్రభు.

ఇస్మాయిల్ పక్క పరచుకుని పడుకున్నాడు. నిద్రపట్టలేదు.

అనవసరమైన విషయాలన్నీ చెప్పి ప్రభు మనసు నొప్పించినందుకు యిప్పు డతను బాధపడుతున్నాడు. ప్రభు స్వాభిమానం సంగతి అతను బాగా ఎరుగును.

తన యింట్లో వూరికే వుండి తింటానికి అతను యిష్టపడటం లేదు. ఇలా గన్నా ఆయన ఋణం తీర్చే అవకాశం లేదు. ఈయనే ప్రభు అని తెలిస్తే కళా మందిరం వాళ్ళు నెత్తిన పెట్టుకుని గౌరవిస్తారు. కానీ ఒప్పుకోడు.

ఆలోచనలతో ఎప్పటికో నిద్రపట్టింది ఇస్మాయిల్‌కు.

* * *

రెండు రోజుల తర్వాత-

ఆ రోజు వుదయం పొద్దెక్కి లేచాడు ప్రభు.

ఇస్మాయిల్ అప్పటికే పనిలోకి వెళ్ళిపోయినట్టుగా యింటికి గొళ్ళెం వేసి వుంది. ప్రభుని లేపటం యిష్టంలేక ఇస్మాయిల్ రోజూచేసే పని అది.

కాలకృత్యాలు ముగించుకుని గొళ్ళెం తీసుకుని యింట్లోకి వెళ్ళాడు ప్రభు.

ఎత్తిపెట్టిన ప్లేటులో పళ్ళు పాలగ్లాసు పక్కనే ఓ చీటీ మడత కన్పిం చాయి.

ముందుగా చీటీ విప్పాడు.

ఇస్మాయిల్ వుత్తరం అది.

'బాబుగారికి,

ఇస్మాయిల్ అనేక నమస్కారములతో వ్రాయునది. జీవితంలో దగా పడి,

దిక్కుతోచక కడుపు చేత్తోపట్టుకుని తిరుగుతున్న రోజుల్లో- చేరదీసి కడుపు నిండా అన్నం పెట్టారు. పని చూపించారు. ఉండటానికి యిల్లు యిచ్చారు. దేవుడయినా యింతకన్నా ఏం చేస్తాడు? మిమ్మల్ని యీ స్థితిలో చూస్తూ మాటల్లో చెప్పలేని బాధను అనుభవిస్తున్నాను. నోరు తెరచి పని చూపించమని అడిగారు. కళామందిర్ తెరిచింది యీ మధ్యనే. ఇంకా పనులేమీ లేవని చెప్పారు సుబ్బారావుగారు. ఆయన చాలా మంచి మనిషి. నేనిక ఉద్యోగం చెయ్యలేననీ నా స్నేహితుడికి దయతో నా స్థానం యిప్పించవలసిందనీ కోరగా ఆయన ఒప్పుకున్నారు. దీనికి మరో ఉత్తరం జతపరుస్తున్నాను. అది చూపిస్తే మిమ్మల్ని పనిలోకి తీసుకుంటారు. మూడు కాలాలు దాపరించాయి. నా కోసం మీరు దిగులుపడకండి. నా రోజులు ఎక్కడైనా గడచిపోతాయి. మీ క్షేమం కోసం అల్లాని ప్రార్థిస్తున్నాను.

మీ సేవకుడు,

ఇస్మాయిల్.

నిశ్చేష్టుడై నిలబడిపోయాడు ప్రభు.

'అంతా స్వార్థపరులూ, దగాకోరులే కాదు. ఇస్మాయిల్ వంటి మహాత్ములూ, త్యాగబుద్ధి కలవారూ వుండబట్టే యీ భూమి యిలా వుంది' అనుకున్నాడు.

పళ్ళు తినాలనిపించలేదు. పాలు గటగట తాగేసి తలుపుగొళ్ళెం వేసి బయలుదేరాడు.

అతని మనసునిండా ఆలోచనలు.

ఒకప్పటి కళామందిర్ సర్వాధికారి, ఈనాడు కాపలాదారుగా చేరబోతున్నాడా? ఓడలు బండ్లు- బండ్లు ఓడలు అంటే యిదేనా?

తనీ పని చేయగలడా? తను బతికి వున్నది ఎందుకోసం?

తనిక ఎంతోకాలం బతకడు-

కళామందిర్ మీద చెరగని మమత- చూడాలన్న కోరిక- నాటకరంగ భావం యింత దూరం లాక్కొచ్చాయి.

ఇక్కడే చివరిశ్వాస విడవాలన్న తుదికోరిక.

కళామందిర్ మెట్లదగ్గరికొచ్చి వెళ్ళనా? వద్దా? అన్న సందిగ్ధంలో ఆగిపోయాడు.

సుబ్బారావు కుర్చీలోంచి చప్పున లేచి,

"అయితే మీరేనా ప్రభు?"

సంభ్రమాశ్చర్యాలతో నారాయణ రెండు చేతులూ పట్టుకున్నాడు.

అక్కడ వున్న తక్కినవారంతా నిశ్చేష్టులయిపోయారు.

నారాయణ అందరి ముఖాలు పరికించాడు.

వాళ్ళందరి ముఖాల్లో సంభ్రమాశ్చర్యాలు–

'అతను నేనే ప్రభును' అని ఒక్క మాటంటే బ్రహ్మరథం పట్టేలా కనిపించారు.

నారాయణ హృదయం ఒక్కక్షణం రెపరెపలాడింది.

చివరికిలా అన్నాడు, "మీరు పూర్తిగా వినండి. అట్లా కూర్చోండి."

సుబ్బారావుతో పాటు మిగిలినవారంతా కుతూహలంతో వింటున్నారు.

"ఆ రోజు ప్రభు కళామందిర్ దగ్గరికి వొచ్చేసరికి ఆ మెట్లమీద నేను కూర్చుని వున్నాను.

ఆ ఒక్క మాటతోనే వినేవాళ్ళ ముఖంలో వుత్సాహం, ఆతృత నీళ్ళుకారిపోయినా, ఆ విషయం గమనించనట్టే చెప్పుకుపోసాగాడు.

"ఆయనే ప్రభు అని నేను గుర్తుపట్టలేదు. పాతికేళ్ళ వయసులో అందంగా ఆరోగ్యంగా వుండే ప్రభు మాత్రమే నాకు గుర్తున్నాడు.

మామూలు దుస్తుల్లో, చిక్కి బలహీనంగా వున్న ఆయనను నేను పోల్చుకోలేకపోయాను.

"ఎవరు నువ్వు? ఎందుకని యిక్కడ కూర్చున్నావు?" అని ఆయనే నన్ను అడిగారు.

"భోంచేసి రెండు రోజులైంది. యిక్కడేదయినా పని దొరుకుతుందేమోనని వొచ్చాను."

"ఏం పని చెయ్యగలవు?"

"ఏదైనా సరే."

"ఇంతకు ముందు ఏం చేసేవాడివి."

"ఇదే కళామందిరంలో పదిహేనేళ్ళ క్రితం నాటకాలేసేవాణ్ని."

ఆయన నా వైపు తదేకంగా చూసి జేబులోంచి ఒక చీటీ తీసి నా చేతిలో పెడుతూ "ఇది తీసికెళ్ళి లోపల చూపించు. నీకు పని దొరుకుతుంది" అన్నారు.

నేను గుడ్లప్పగించి చూశాను.

నా వొంటిమీద బట్టలు అధ్వాన్నంగా వుండటం చూసి తను తొడుక్కున్న చొక్కా విప్పి నాకిస్తూ 'తొడుక్కో' అన్నాడు.




నేను చొక్కా వేసుకుని తిరిగి చూసేసరికి ఆయన లేడు.

"వీధిలోకి వెళ్ళి చూశాను. కనుపించలేదు." నారాయణ చెప్పటం ఆపాడు.

ఎవరి నోటివెంటా మాట రాలేదు.

అందరి హృదయాల్లో ప్రభు నిలిచిపోయాడు.

గడపలోకి వచ్చిన మనిషిని చెయిజార్చుకున్నాం. ఇక తిరిగిరాడు. ఆయన్ను చూసే అవకాశం యికలేదు అన్న బాధతోనూ, ఒక గొప్ప కళాకారుడు, కళా తపస్వి జీవితం ఇలా అయిపోయిందన్న ఆవేదనతోనూ అందరి హృదయాలూ బరువెక్కినాయి.

"నారాయణా! ఆయన్ను గురించి యిన్ని విషయాలు నీకెలా తెలిశాయి?" అన్నాడు మురళి.

"చొక్కా జేబులో ఆయన డైరీ వుండిపోయింది."

"ప్రభు డైరీకోసం తిరిగిరాలేదా?"

సుబ్బారావు అడిగిన ప్రశ్నకు లేదన్నట్టు తల అడ్డంగా వూపాడు ప్రభు.

"మరి కళ్యాణి సంగతేమిటి?" చంద్రికళ కుతూహలంగా అడిగింది

నారాయణకన్న ముందు సుబ్బారావు అందుకుని—

"పదిహేనేళ్ళ క్రితం జనంలో గొప్ప సంచలనం కలిగించింది కళ్యాణి మరణవార్త. ఆమె రైల్లో ప్రయాణంచేస్తుండగా ఎవరో ఆమెను బలవంతం

చేసి, దగ్గరున్న డబ్బు, నగలు తీసుకుని పరారీ అయినట్లు, శవం రైలు పట్టాల వక్కన దొరికినట్లు చదివాం. ఆ తర్వాత తెలియటానికి ఏముంది?"

నారాయణ లేచి నిలబడి, "చాలా పొద్దుపోయింది బాబూ. వాన కూడా వెలిసింది. యిళ్ళకు వెళ్ళండి" అన్నాడు.

బరువుగా నిట్టూర్చి ఒక్కొక్కరే లేచారు.

"నారాయణా. మనం చాలా దురదృష్టవంతులమోయి. అలాటి మంచి మనిషిని దూరంచేసుకున్నాం. మన హరికృష్ణగారికి ప్రభు అంటే ఎంత పిచ్చి భక్తి అనుకున్నావు! ఆయనే కనపడివుంటే కళామందిరం మొత్తం ఆయనకు అప్పగించి ఆయన సలహా ప్రకారం నడిపించివుండేవాళ్ళం...."

నారాయణ ముఖం అటు తిప్పుకున్నాడు.

* * *

మరుసటిరోజు సుబ్బారావు, నారాయణను పిలిచి "నారాయణా! ప్రభు జీవితాన్నే నాటకంగా వ్రాసి వేయించాలని వుంది. నీ అభిప్రాయం ఏమిటి?" అన్నాడు.

నారాయణ మౌనం వహించి, "కళని ఆరాధించాడంతే. కానీ కళ్యాణిని గుడ్డిగా నమ్మి పిచ్చిగా ప్రేమించిన యువకుడు ఎట్లా సర్వనాశనమైపోయాడో పదిమందికీ తెలుస్తుంది. అలాగే చెయ్యండి" అని అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు.

* * *

నారాయణ పట్ల అవే గౌరవమర్యాదలు చూపిస్తున్నారు కళామందిరంలో. అయినా నారాయణ తన స్థానం గుర్తెరిగి ప్రవర్తిస్తున్నాడు.

నాటకానికి స్క్రిప్టు రాయటం పూర్తయింది. రిహార్సల్సు మొదలయినాయి.

నారాయణ మౌనంగా కూచుని చూస్తాడు. అతనికి వెనకటి రోజులు గుర్తుకు వచ్చి, కళ్ళల్లో నీళ్ళు తిరుగుతాయి. లేచి వెళ్ళిపోతాడు.

రిహార్సల్సు జోరుగా సాగుతున్నాయి.

ఆ రోజు ప్రభు, కళ్యాణి పాత్రలతో రిహార్సల్సు జరుగుతున్నాయి.

నారాయణ బయట రూంలోంచి కిటికీగుండా చూస్తున్నాడు.

ప్రభు పాత్రధారి కుర్చీలో కూచున్నాడు.

కళ్యాణి పాత్రధారిణి అతని కుర్చీ వెనకగా నిలుచుని అతని తలను మున్నితంగా, వేళ్ళతో నొక్కుతూ. ది.

నేయి వెనక్కి. పోనిచ్చి ఆమెరెక్క పుచ్చుకుని తనముందుకు లాగి కూర్చో

బెట్టుకున్నాడు.

ఆ విసురుకి ఆమె బిత్తరపోయి చూసింది.

"కళ్యాణీ! నువ్వు నా కోసం నాటకాలు వెయ్యటం మానుకోలేవూ?"

కళ్యాణి ముఖంలోకి సూటిగా చూస్తూ అడిగాడతను.

అట్లా చూస్తూ వుండిపోయింది కళ్యాణి.

"స్వార్థపరుడ్నే అనుకో. ఏమయినా అనుకో. కళ్యాణీ! నువ్వు దూరమై పోతే భరించలేను. నువ్వు ఎప్పటికీ నాకు కావాలి. నామానివిగానే వుండిపోవాలి. నాకు మాటివ్వు."

ఆవేశపడిపోతూ కళ్యాణి భుజాలు కుదుపుతూ అడిగాడు.

కళ్యాణి మాట్లాడలేదు.

"చెప్పవేం కళ్యాణీ!" వోపికలేనట్లు అడిగాడు.

"ఏం చెప్పను? మీరు ఆర్టిస్టు అయివుండి తోటి ఆర్టిస్టును అవమానపరుస్తున్నారు. ఒక మాట చెప్పండి. నేను రాకపూర్వము మీరు ఎన్నో నాటకాలు వేసారు. ఎందరి సరసనో నటించారు. అందరినీ ప్రేమించారా? వాళ్ళందరికీ నాలాగా ఆశ్రయం యివ్వగలిగారా? ప్రేమ అనేది మనసుకే గాని శరీరాలకు సంబంధించినది కాదు. నా పక్కన ఎవరు నటిస్తారన్నది కాదు నాకు ముఖ్యం. నా పాత్రకి నేను న్యాయం చేకూరుస్తున్నానా లేదా" అనేదే.

కళ్యాణి భుజంమీద వున్న అతని చేతులు సడలిపోయాయి.

"కోపం వచ్చిందా?" గోముగా అడిగింది.

"నటిని కావాలన్న ఆ కోరిక తప్ప మరో వుద్దేశం లేదండీ. నాలో ఆకోరిక రేపిందీ, నన్ను మహానటిని చేస్తానని మాటిచ్చిందీ మీరే. నా శరీరంలో వూపిరి వున్నంతవరకూ నేను మిమ్మల్నే ప్రేమిస్తాను" అంటూ అతని పాదాలమీద తల అన్చింది.

'వొట్టిది. అంతా నటన'

గిరుక్కున బయటకు వచ్చి ఓ చెట్టుమొదట్లో కూలబడ్డాడు నారాయణ.

మళ్ళీ గతం.... కళ్యాణి మాటలు.... ఆ దృశ్యాలు.

ఎంత నమ్మకంగా మోసగించింది కళ్యాణి. కీర్తికాంక్ష నటి కావాలన్న తన కోరికముందు తన ప్రేమ, తను పనికిరాకుండా పోయాడు. నిజమని చెప్పి నమ్మించి దగాచేసింది.

ఆమెమీద ప్రేమతో తనే తండ్రిని, కట్టుకున్న భార్యను దూరంచేసుకున్నాడు.

ప్రాణంగా భావించుకున్న కళామందిర్‌ని పోగొట్టుకున్నాడు.

అభిమానించిన కళకు దూరమయ్యాడు- భ్రష్టుడయ్యాడు.

పాతికేళ్ళు- పంజరంలో చిలకలా పెరిగిన తాను అందరినీ నమ్మేవాడు. అంతా నా వాళ్ళే- మనుషులంతా ఒకే కుటుంబం అనుకునేవాడు. అందుకే మోసపోయాడు.

తనవాళ్ళనుకున్నవాళ్ళే తనకు శత్రువులయ్యారు.

తాను ప్రపంచాన్ని నిజంగా చూసింది యీ పదిహేనేళ్ళనుంచే.

రకరకాల మనుషుల మధ్య తిరిగాడు. ఆవేదన్నుంచి, జ్ఞాపకాల నుంచీ దూరం కావాలని తిరిగాడు

క్షుద్బాధ తీర్చుకోవటానికై తిరిగాడు.

తన తోటి మనుషుల్ను చూచి ఆశ్చర్యపడ్డాడు.

ప్రపంచం అంటే యిదా? మనుషులంటే వీళ్ళా? అనిపించి విరక్తి కలిగింది.

ఎక్కడచూచినా స్వార్థం, స్వలాభం. స్నేహంలో.... బంధుత్వంలో.... స్వార్థంలేకుండా ప్రవర్తించే మనిషే తారసపడలేదు.

నాల్గురోజులు ఆప్యాయంగా అన్నంపెట్టి స్నేహపూర్వకంగా ప్రవర్తించింది సిస్టర్ మరియ-

"నీ గొంతు ఎంతో గంభీరంగా, మార్దవంగా వుంటుంది. నీకు తెలుసా?" అంది ఒకసారి.

"నువ్వు మతం పుచ్చుకో. నీ జీవనానికి లోటుండదు. నీ వుపన్యాసాలవుతే మంత్రించినట్లు వింటారు జనం" అంది.

మతం పుచ్చుకోకపోతే ఆదరించలేని దయాహృదయం ఆమెది.

చర్చి అరుగుమీదనుంచి మకాం ఎత్తేశాడు.

కార్మికవాడల్లో తిరిగాడు. నాయకులిచ్చే వుపన్యాసాలు విని వుడుకురక్తం పొంగులెత్తింది. త్వరలోనే ఆ వాడికి నాయకుడయ్యాడు.

అనుకోకుండా నాయకుడి యింటికి వెళ్ళటం తటస్థించిందోరోజు-

రెండస్తులమేడ. పట్టు పరుపులు. ఖరీదయిన ఫర్నిచరు. సిల్కుబట్టలు. ఖరీద యిన సిగరెటు కాలుస్తూ- ఎప్పటికోగాని ఇంటర్వ్యూ లభించలేదు.

లోపల పదిలక్షల పెట్టుబడితో ఇండస్ట్రీ స్థాపించే మంతనాలు జరుగుతున్నాయి. మనసు విరిగిపోయింది. నాయకులు చెప్పే నీతులన్నీ కార్మికవర్గాలకేనా? నీతిగా, నియమంగా వుండవలసింది సామాన్య ప్రజలేనా?

నాయకులు సర్వభోగాలూ అనుభవిస్తూ వుపన్యాసాలివ్వటానికే అనుకున్నాక విరక్తితో వెనుతిరిగాడు.

కళ్యాణి కీర్తిదాహానికి లొంగిపోయి తనను వంచించింది.

కానీ తాను చాలామందిలో చూసింది ధనదాహం. ప్రపంచం నడుస్తున్నదే డబ్బుమీద. ఆ డబ్బు సంపాదించటంకోసం మనిషి కరవని గడ్డిలేదు. తొక్కని పెడత్రోవలు లేవు. దౌర్జన్యం- దోపిడీలు- హత్యలు- అన్నీ డబ్బుకోసమే.

మనసు చెదిరిపోయింది. విరిగిపోయింది. పిచ్చివాడిలా వీధులవెంట తిరిగాడు.

ఆరోగ్యం చెడిపోయింది. జీవితంమీద ఆసక్తి నశించింది.

చివరిసారిగా తన ఆశలసౌధం- తన వూపిరి కళామందిర్‌ని చూసుకుని ఆఖరిశ్వాస అక్కడే వొదలాలన్న తలంపుతో వొచ్చాడు.

ఇస్మాయిల్, సుబ్బారావువంటి మనషులే తారసపడకపోతే మనుషులమీద తాను ఏర్పరచుకున్న దురభిప్రాయం అట్లా నిలిచిపోయేదే.

కళ్యాణి తప్పుకూడా పెద్ద నేరంగా కనిపించటంలేదు యిప్పుడు. స్వార్థంతో ప్రేమను తృణీకరించి వెళ్ళిపోయిందంతే!

తన ఆలోచనలు ఎక్కడ్నుంచి ఎక్కడకు మళ్ళాయి? ఒకప్పుడు ఆలోచించే అవసరం, తీరికా వుండేవికావు.

ఇప్పుడా ఆలోచనలు తనను వొదలటంలేదు.

ఒంటరితనంలో తన్ను చుట్టుముట్టేవి ఆలోచనలే.

తనే ప్రభు అని ఒక్కమాట అనేస్తే.... కళనీ, కళాకారుల్నీ ప్రేమించే సుబ్బారావు సంబరపడిపోతాడు. తిరిగి కళామందిర్ తన ఆధ్వర్యంలోకి వస్తుంది.

కానేవు ఘర్షణ మనసులో—

'చెప్పను. చెప్పలేను' అనుకుంటూ కళ్ళు గట్టిగా మూసుకున్నాడు.

* * *

ఆ సంవత్సరం జరగనున్న నాటక కళాపరిషత్ పోటీలలో పాల్గొనటానికి సుబ్బారావు తన ట్రూపుతో ఢిల్లీ వెళ్ళాడు.

ప్రభు అక్కడ చేరి ఆరునెలలయింది.

ఆ రోజు ఆదివారం. సంగీత నృత్య విభాగాలకు శెలవురోజు. కళామందిరం ప్రశాంతంగా వుంది.

ప్రభులో ఆడిటోరియం చూడాలన్న కోరిక తలెత్తింది.

వచ్చినప్పటినుంచీ అవకాశం రాలేదు. అందుకు కారణం ఆడిటోరియంతప్ప

అన్ని భాగాలూ వాడుకలో వుండటమే.

ప్రభు తాళాలగుత్తి తీసుకుని లేచాడు.

అలసటగా ఆయాసంగా వున్నా అడిటోరియం పదిమెట్లూ ఎక్కి తలుపులు తెరిచాడు. వాడుకలేక ఎక్కడపడితే అక్కడ సాలీడుగూళ్ళు వేలాడుతున్నాయి.

కుర్చీలన్నీ దుమ్ముపేరుకుని వున్నాయి.

ముందుకు నడిచి స్టేజివైపు చూశాడు.

పదిహేను సంవత్సరాలక్రితం కుట్టించిన బంగారురంగు జలతారు పరదా అక్కడక్కడా చిరుగులుపట్టి వేలాడుతోంది.

ప్రభు కళ్ళప్పగించి చూస్తున్నాడు.

గప్పున లైట్లు వెలిగాయి.

ఫేన్లు గిర్రున తిరగటం మొదలుపెట్టాయి.

సీట్లన్నీ ప్రేక్షకులతో నిండిపోయినయ్.

శ్రావ్యంగా సంగీతం వినిపిస్తూంది.

జలతారు పరదా నెమ్మదిగా పైకిలేచింది.

స్టేజిమీద శకుంతలా దుష్యంతులు.

వారిని చూచి ప్రేక్షకులు కరతాళధ్వనులు చేశారు.

శకుంతల సిగ్గుపడుతూ కళ్ళెత్తి దుష్యంతునివైపు చూడలేకుండా వుంది.

దుష్యంతుడు ఠీవిగా నడుస్తూ శకుంతలను సమీపించాడు.

ఆమె చేయి అందుకుని ఆ కోమలహస్తాన్ని హృదయంపై వుంచుకున్నాడు.

సిగ్గుతో మొగ్గలా ముడుచుకుపోయింది శకుంతల.

దృశ్యం మారింది.

కళ్యాణి నృత్యంచేస్తూంది.

రాళ్ళ నగలతో ఎర్రని దుస్తులలో మెరిసిపోతూవుంది.

జనం సంభ్రమంతో చూస్తున్నారు.

మంత్రిగారు స్పీచ్ యిచ్చారు. తర్వాత ప్రభు స్టేజిమీదకు వచ్చాడు.

'మనిషిలోని మానవతను చిగురింపజేయటానికి, ఆలోచనలు రేకెత్తించటానికి నాటకకళ ఒక చక్కని సాధనం. ప్రదర్శనలిస్తున్నది డబ్బుకోసం కాదు, ప్రజలకోసం.'

కరతాళధ్వనులు మారుమ్రోగాయి.

మరో నాటకం ప్రారంభం అయింది.

కళ్యాణి పక్కన దేవదాసు. ఒకరి కౌగిలిలో ఒకరు. తమకి మాత్రమే అర్థమయేలా కళ్ళతో వూసులాడుకుంటున్నారు.

"కళ్యాణీ !"- గట్టిగా అడిటోరియం అదిరిపొయ్యేలా అరిచాడు ప్రభు.

అదే క్షణాన వెనకనుంచి ఎవరో కత్తితో వెన్నులో పొడిచినట్లు బాధతో విలవిల్లాడిపోయాడు.

గుండెను చేత్తోపట్టుకుని వొరిగిపోయాడు.

ఆ పడటంతో కుర్చీకొస కణతకి తగిలి ప్రాణం జివ్వుమంది.

కళ్ళు బైర్లుకమ్మాయి. వొళ్ళంతా చెమటలు- లేవలేకపోయాడు.

అంతా చీకటి.

* * *

ప్రభు కళ్ళు తెరిచాడు.

ప్రభు పక్కనే కూచునివున్న నర్సిమ 'ఎలా వుంది' అన్నట్టు సైగలతో అడిగాడు.

జవాబుగా ప్రభు గుండెల్ని చీల్చుకుంటూ ఓ నిట్టూర్పు వెలువడింది.

"ఎట్లా వుంది మాట్లాడవేం ? ఏదయినా తాగుతావా," అన్నట్టుగా అడిగాడు నర్సిమ.

ప్రభు జవాబివ్వలేదు. లేచి చెట్టు మొదలుకి చేరగిలబడి కూర్చున్నాడు. వొళ్ళంతా బాధ. అంతకు మించిన బాధ మనసును మెలిబెట్టేస్తున్నది.

"నారాయణా. ఎందుకు అట్లా అరిచావు ? అసలా గదిలోకి ఎందుకువెళ్ళావు?" అన్నట్టు అడిగాడు.

"నర్సిమా. నీ దగ్గర అగ్గిపెట్టె వుందా ?" అన్నాడు ప్రభు.

నర్సిమ చప్పున లేచి చొక్కాజేబులోంచి అగ్గిపెట్టె తీసి అతని చేతిలో వుంచాడు.

అగ్గిపెట్టె అందుకుని లాల్చీజేబులోంచి చిన్న పుస్తకాన్ని తీసి నేలమీద చెల్లాచెదురుగా వున్న ఎండుటాకుల్ని దానిచుట్టూ పేర్చి అగ్గిపుల్ల గీసి అంటించాడు ప్రభు.

వింతగా చూస్తున్న నర్సిమ "అదేమిటి? పుస్తకాన్ని తగలబెడుతున్నావు ?" అన్నట్టు అడిగాడు.

"కాలిపోతున్నది పుస్తకం కాదు. నా జీవితం."

నర్సిమకా మాటలు స్పష్టంగా వినబడలేదు.

వినబడినా అతనికి అర్థంకావుకూడా.

ఎర్రని మంటనీ, అంతకన్నా ఎర్రగా కనిపిస్తున్న ప్రభుముఖాన్నీ చూస్తూ కూర్చున్నాడు నర్సిమ. చీకటి వెలుగుల మధ్య కనిపిస్తున్న కళామందిర్ని తదేకంగా చూస్తూ వుండిపోయాడు ప్రభు.

* * *

కళాపరిషత్తు పోటీలలో కళ- కళ్యాణి నాటకానికి ప్రథమ బహుమతి లభించింది. ఉత్తమ నటుడిగా ప్రభు పాత్రధారికీ, ఉత్తమ దర్శకుడుగా సుబ్బారావుకీ బహుమతులు లభించాయి.

సుబ్బారావు మనస్సు ఆనందంతో నిండిపోయింది. లాడ్జిలో ఆ రోజు రాత్రి అతనికి నిద్రపట్టలేదు.

"నారాయణా! నువ్వు చెప్పిన కథకి ఫస్టు ప్రయిజు వొచ్చిందోయ్"

"నాకు బెస్టు డైరెక్టరు ప్రయిజు యిచ్చారు."

"నా కొచ్చిన బహుమతి నాది కాదు. నీది."

"నీ సలహాలూ, సహకారమూ లేకుంటే బహుమతి వొచ్చేదే కాదు."

"సంతోషపూర్వకంగా వొచ్చిన బహుమతి నీకు పారితోషికంగా యిచ్చేసుకుంటున్నాను." అనుకున్నాడు.

నారాయణ చేతిలో పారితోషికంలా వొచ్చిన ఏడు వందలూ పెట్టి ఆ క్షణాన అతని మొహంలో వెలిగే కాంతిని చూడాలని తహతహగా వుంది సుబ్బారావుకి. ఆ దృశ్యాన్ని వూహించుకుంటూ ఎప్పటికో నిద్రపోయాడు.

* * *

కళామందిర్ గేటు తెరుచుకుని లోపలికొచ్చిన సుబ్బారావుకి ముందుగా నర్సిమ కనిపించాడు.

"నర్సిమా! నారాయణ ఎక్కడ?" ఎంతో వుత్సాహంగా అడిగాడు.

నర్సిమ ముఖం మ్లానమయింది. గుటక మింగి "ఇలా రండి బాబూ! ఇక్కడున్నాడు" అంటూ సైగలతో అతను ముందు నడుస్తుంటే అతని వెనకే వెళ్ళాడు సుబ్బారావు. చెట్టు కింద ఎండుటాకులమీద బట్టకప్పి వుంది శవం. తల దగ్గర యిసుకలో గుచ్చిన అగరువొత్తి వెగటు వాసన కొడుతూంది.

నర్సిమ ఆ చెట్టు క్రింది కొచ్చి ఆగిపోయాడు.

సుబ్బారావు నర్సిమ ముఖంలోకి 'ఎవరది?' అన్నట్టు చూశాడు భృకుటి ముడి వేస్తూ. నెమ్మదిగా శవంమీది బట్టను తొలగించాడు నర్సిమ.



సుబ్బారావు కొయ్యబారిపోయాడు.

"నిన్న రాత్రి పోయాడు. ఏం చేయాలో తోచక మీరొస్తారేమోనని ఎదురుచూస్తున్నాను" పేగలతో చెప్పి ముఖాన్ని చేత్తో కప్పుకుని ఏడవసాగాడు నర్సిము.

చాలా సేపటికిగాని తేరుకోలేదు సుబ్బారావు.

తేరుకున్నాక కొద్దిగా వొంగి శవంతో యిలా అన్నాడు.

"నారాయణా! నువ్వు చెప్పిన కథకి మొదటి బహుమతి వొచ్చిందోయ్!

'అది నీ కివ్వాలని వొస్తే నువ్వు-నువ్వు లేవు' దుఃఖాన్ని ఆపుకోటానికి ప్రయత్నిస్తూ శవంమీద బట్ట యధాప్రకారం కప్పేసి దీర్ఘంగా నిట్టూర్చాడు.

"అంతే. కళాకారుల జీవితాలే అంత. గప్పున వెలిగి గప్పున ఆరిపోయే మతాబుల వంటివి. వెలుగుతున్నంత సేపూ ఎదుటివారి కంటికి ఆనందాన్నీ ఆహ్లాదాన్నీ యిచ్చి ఆరిపోగానే చీకట్లో కలిసిపోతాయి."

వయసూ, కళారంగంలో ఎంతో అనుభవమూ వున్న సుబ్బారావు బాధగా విరక్తిగా అనుకున్నాడు.

"నర్సిమూ, యిదిగో. ఏర్పాట్లు చూడు" అంటూ అతని చేతిలో డబ్బు వుంచి అక్కడ్నించి కదిలాడు.



# నాకు నచ్చిన నా కథ



హితశ్రీ

ఎదురుగాలికి తట్టుకొని నిలబడటం_ అక్షరాలా, అలంకారికంగా కూడా_ఓ అద్వితీయమైన అనుభవం. ఇలాంటి సన్నివేశాలు మన అందరి జీవితాల్లో ఏర్పడుతూనే ఉంటాయి. ఈ ఇతివృత్తంతో ఓ సర్వసాధారణమైన మానవీయ అనుభవాన్ని స్పృశించి, పరిశీలించే ఉద్దేశంలో రాసిన కథ కనుక "ఎదురుగాలి" నాకు నచ్చిన నా కథల్లో ఒకటి. సహృదయులు మన్నిస్తే, ఈ కథలో మానవుడి ఉదాత్తతని ప్రేరేపించటం, గౌరవించ తగ్గ విలువల్ని గుర్తుచెయ్యటం, కథాంతంలో ఏదో ఆనందం కలగటం వంటి లక్షణాలు లీలగా దోబూచులాడుతున్నట్టు నాకు తోచటంవల్ల కూడా ఇది నాకు నచ్చిన నా కథ అయి కూర్చుంటున్నది.

## ఎదురుగాలి

"కొత్తబిచ్చగాడు పొద్దెరగడు" అంది సుహాసిని. మూర్తి తలెత్తి చూశాడు.

సుహాసిని పెదవులు బిగబట్టి చిరునవ్వు దొంతరలు దొర్లిపోకుండా ఆపింది. ఆమె చొరవ మూర్తికి ఆశ్చర్యం కలిగించింది. ఏమనాలో వెంటనే అతనికి తోచ

లేదు. సుహాసిని చేతిగడియారంవైపు చూసుకుంది. మూర్తి కూడా యాంత్రికంగా చూశాడు. అయిదు దాటింది.

"అప్పుడే అయిదయిందే !"

"అప్పుడే ! ఎప్పుడు అయిదవుతుందా అని ఇక్కడ అందరూ కాచుకు కూచుంటారండీ."

మూర్తి నవ్వాడు. అఫీసు తలుపులువేస్తున్న చప్పుడు వినిపించింది. చప్పుడు విని అతను లేచి నుంచున్నాడు.

"ఫైల్స్ తిరగేస్తుంటే టైం తెలియలేదు." అన్నాడు సుహాసినివైపు క్షమాపణ కోరుకుంటున్నట్టుగా చూసి హేంగర్‌కితగిలించిన కోటుఅందుకుంటూ.

"అంత నిజాయితీగా పనిలో లీనమైపోవటం కూడదండీ" అంది సుహాసిని విలువైన సలహా ఇస్తున్న ధోరణిలో.

"లీనం కాకుండా పనిచేసేదెలా ?"

"అఫీసర్లు పైపైన పెత్తనం చలాయించాలిగాని తమంతట తాము అలా వంచిన తలెత్తకుండా పనిచెయ్యకూడదు" మూర్తి నవ్వాడు.

"నేర్చుకొంటాన్లెండి"

"నేర్చుకోండి" అని మూర్తి బల్లమీద కాగితాలు డ్రాయర్‌లో తోసేస్తూ అతని కళ్ళల్లోకి వాలుగా చూసి డ్రాయర్ మూసి నడుంచుట్టూ పైటకొంగు లాక్కొని వెనక్కితిరిగింది సుహాసిని. గుమ్మందాకా వెళ్ళి ఓసారి వెనక్కి చూసి "ప్రమోషన్ రాకపోతే మాత్రం నన్నడగొద్దండోయ్" అంది సమాధానంగా మూర్తి చిన్నగా నవ్వాడు. అమె వెళ్ళిపోయింది. మూర్తి కూడా వెళ్ళటానికి సిద్ధపడి షెల్ఫ్ తాళంవేసి అఫీసు బయటకు వచ్చాడు. సుహాసిని సంభాషణ అతనికి కొంచెం ఆశ్చర్యం కలిగించింది. తను అఫీసరు అయితే తనొక్కడే అఫీసుకంతటికీ అధికారి కాడు. తనలాంటివాళ్లు కనీసం అరడజను మంది ఉన్నారు. వాళ్ళందరికీ ఎంతో కొంత సర్వీసు ఉంది. తను కొత్తగా వచ్చాడు సుహాసినికీ తనకీ అంతకిముందుగానీ, ఆ రోజునగానీ పరిచయమేమీ లేదు. అమె స్టెనో. ఆ రోజు మొత్తంమీద ఆమెతో ఒక్కసారే మాట్లాడాడు.

"ఉత్తరాలున్నాయా సార్ ?" అందామె.

తనింకా ఫైల్స్ సరిగా చూడలేదు. అదేరోజు ఉద్యోగంలో చేరాడు. ఏది ఏమిటో ఇంకా అంతుబట్టలేదు. మూడు నెలలు ట్రైనింగులో ఉన్నాడు. ట్రైనింగు కాగానే ఆ అఫీసులో పోస్టింగు వేశారు. ఛార్జి తీసుకని విషయాలు అవగాహన

చెసుకోటానికి ప్రయత్నిస్తూ,

"లేవు" అన్నాడు ముక్తసరిగా—

ఆమె వెళ్ళిపోయింది. మళ్ళీ సాయంత్రం ఎంతో చనువున్నట్టుగా పలకరించింది. స్టెనోకి అంత చనువివ్వటం మంచిది కాదు. అయినా తను ఎందుకో ఆమెతో సరదాగానే మాట్లాడాడు. ఆఫీసు టైంలో మాత్రం ఆమెతో ముఖావంగా ఆఫీసర్ హోదాలోనే మాట్లాడాలని తీర్మానించుకున్నాడు మూర్తి.

వరండాలోకి రాగానే ప్రకాశం కనిపించి 'విష్' చేశాడు. ఆ ఆఫీసులో ఒక శాఖకి ప్రకాశం అధికారి. "చాలా అలిసిపోయినట్టున్నావే?" అన్నాడతను.

"కొత్తగదా!" అన్నాడు మూర్తి.

ప్రకాశం సిగరెట్ కేస్ తీసి మూర్తికి సిగరెట్ అందించాడు.

"అలవాటు లేదండీ" అన్నాడు మూర్తి.

"అలవాటు చేసుకోవచ్చుగా" అన్నాడు ప్రకాశం సిగరెట్ వెలిగిస్తూ.

"అవసరం లేని అలవాటెందుకు?"

"సాంఘిక మర్యాదల కోసం."

"అంటే?"

"మీరు వూరికే వుంటే నేను సిగరెట్ తాగుతూ మాట్లాడటం బాగుండదు."

మూర్తి కొంచెం వింతగా చూశాడు.

"మీరలా అనుకోవద్దు" అని మాత్రం అన్నాడు.

"కొంతమందికి ఏంచేసినా చెడిపోతామని భయం" ఆ మాటలు తనని ఉద్దేశించి అన్నవేనని మూర్తికి తెలుసు.

"వ్యక్తిత్వం లేనివాళ్ళకి" అన్నాడతను.

"అంటే."

"చిన్నప్పటినుంచీ పెద్దలు ఏవేవో నీతులు నూరిపోస్తారు. ముక్కుకు సూటిగా పోతూ, వాటిని గురించి చర్చించకుండా, గుడ్డిగా నీతిపాఠాన్ని వల్లెవేసే వాళ్ళు చెడిపోతున్నామనే భయంతో బిక్కుబిక్కుమంటూ చివరికి చెడిపోతూనే ఉంటారు."

"అందుకేనా మీరు సిగరెట్ తాగనిది?" అన్నాడు ప్రకాశం కొంచెం వెగటుగా నవ్వి.

ప్రకాశం అలా అంటాడని మూర్తి అనుకోలేదు. అతనివైపు కొంచెం చిరాకుగా చూశాడు. కాని ఎవరితోనూ పేచీపెట్టుకోటం అతని కిష్టంలేదు. అందువల్ల

లేనివ్వవు తెచ్చుకుని అన్నాడు.

"పోనీ అలాగే అనుకోండి."

ప్రకాశం కూడా నవ్వాడు.

"మైడియర్ మూర్తిగారూ, మీకంటే నాకు ఈ ఆఫీసులోగాని, ప్రపంచంలో గానీ, కనీసం ఐదారేళ్ళు అనుభవం ఎక్కువ. అందుకని సలహా చెబుతున్నాను. ప్రపంచం అనశ్వరం. టేస్ట్ ఎవ్విథింగ్. ప్రతిది రుచి చూడండి. ఇది శాశ్వతం." అన్నాడు భౌతికతత్వం జీర్ణించిన వేదాంతిలా.

ఈ సలహాని మూర్తి చాల చాలా తేలిగ్గా తీసుకుని "థాంక్స్" అన్నాడు.

"మంచి సలహా కాదా?" అన్నాడు ప్రకాశం.

"కాకేం! కానీ హోటలు భోజనం రుచి చూసింతరువాత మరేదీ రుచిమీద బుద్ధిపుట్టటంలేదు" ఇద్దరూ నవ్వారు.

ప్రకాశంకి ఏదో వెంటనే స్ఫురించినట్టయి, "ఇంతకీ మీమకాం ఎక్కడ?" అన్నాడు.

"హోటల్లోనే, ఏదైనా ఇల్లు చూసుకోవాలి."

"సరిసరి. చెప్పారు కాదు. ముందు వెంటనే మా ఇంటికి బస మార్చండి. ప్రస్తుతం ఒంటరిగానే ఉంటున్నాలెండి. ఏమీ ఇబ్బంది లేదు. తాపీగా ఇల్లు వెదుకుదాం" అన్నాడు ప్రకాశం ఆపద్బాంధవుడిలా.

మూర్తి కూడా ఇంచుమించు వెంటనే ఒప్పుకున్నాడు; ముఖ్యంగా తోడు కోసం. ఇద్దరూ సరాసరి హోటల్‌కెళ్ళి మూర్తిసామాన్లు ప్రకాశం ఇంటికి చేరవేశారు. ప్రకాశం ఇల్లు బాగా వసతిగానే ఉంది. మాట కొంచెం కటువైనా ప్రకాశం స్నేహపాత్రుడేననిపించింది మూర్తికి. కొత్తవూళ్ళో వెంటనే ఒక స్నేహితుని సంపాదించుకున్నందుకు సంతోషించాడు. సామాన్లు సర్దటం అయింతరువాత ఇద్దరూ క్లబ్బుకి వెళ్ళారు. అక్కడ చాలామందితో మూర్తికి పరిచయం కలిగింది. అందులో కొందరు తను ఆఫీసులోనే సమాన హోదాలో పనిచేస్తున్నారు. ఈ కాసేపటిలోనే ప్రకాశం తనకెన్నోసార్లు సిగరెట్టివ్వబోవటం, మళ్ళీ తన జ్ఞప్తికి తెచ్చుకుని "సారీ, మీరు స్మోక్‌చెయ్యరు కదా." అని కించపడటం జరిగింది. పోనీ అతని తృప్తికోసం సిగరెట్ తీసుకుందామని మూర్తి అనుకుని కూడా తన నియమం జ్ఞప్తికితెచ్చుకుని వెనక్కి జంకాడు.

మర్నాడు ఉదయం ఆఫీసుకి వెళ్ళినప్పుడు మొట్టమొదట సుహాసిని కనిపించి నమస్కారం చేసింది. ప్రతినమస్కారం చేశాడు మూర్తి. ఆమె సుతారంగా

ఎవో బిల్లమీద సర్దినట్టు అభినయించి క్రీగంట చూసి నెమ్మదిగా వెళ్ళిపోయింది. ఏమీ మాట్లాడలేదు. అంతవరకు అదృష్టమే ననుకున్నాడు మూర్తి. ఒక గంట గడిచింతరవాత మళ్ళీ వచ్చిందామె.

"ఏమైనా డిక్టేట్ చేస్తారా సార్ ?"

మూర్తికి ఒళ్ళుమండింది

"అవసరమైతే పిలిపిస్తాను గదా !" అన్నాడు కొంచెం విసుగ్గా, ఆఫీసరు హోదా ఉట్టిపడేలా.

ఆమె పోబోయి, మళ్ళీ ఆగి "సారీ డిస్టర్బ్ చేశానా, సార్ ?" అంది పశ్చాత్తాప పడ్డట్టుగా.

మూర్తి తలెత్తి చూశాడు. సుహాసిని వదనం చిన్నబోవటం గమనించాడు. కొంచెం జాలివేసింది.

"లేదులెండి" అన్నాడు.

"ఏదైనా చెప్పండి ఏం తోచడం లేదు." ఈసారి అతనికి బాగా కోపం వచ్చింది.

"ఇది ఆఫీసు గదా, కబుర్లు ఎలా చెప్పేది" అన్నాడు కర్కశంగా.

"కబుర్లు కాదండీ, పని" అంది.

ఈసారి మూర్తి నాలుక కరుచుకున్నాడు. తొందరపడి అపార్థం చేసుకున్నాడు తను.

"పనేం లేదా ?" అన్నాడు తన తప్పుని కప్పిపుచ్చుకుంటానికి రెట్టిస్తూ.

"లేదండీ ! నేను ఏరోజుపని ఆరోజే పూర్తిచేస్తాను" అందామె అతనికి పని చేయటం పనిఇవ్వటం చేతకాదన్నట్టు ధ్వనిస్తూ. ఆ ధ్వనిని గ్రహించి కోపంగా ఒక ఫైలు ఆమె ముందుకి తోస్తూ "ఇది టైపుచేసి తీసుకురండి" అన్నాడు. ఆమె ఫైలు పేజీలు తిరగేసి కొంచెం ఆశ్చర్యంగా "ఇవన్నీనా ?" అంది.

"అవును" అన్నాడు కసిగా.

ఆమె వేళ్ళు చూసుకుంది. మారుమాట్లాడకుండా ఫైలు తీసుకుంది. బరువుగా అక్కడినించి కదిలి కొంతదూరం వెళ్ళి ఆలిగినట్టుగా అయనవైపు వెనక్కి తిరిగి చూసింది. ఆమె వెళ్ళినవైపే చూస్తున్న అతనికి గుండె కరిగింది. పిలిచాడు. మాట్లాడకుండా సంజ్ఞచేసి ఆ ఫైలు తీసుకున్నాడు. ఆమెవైపు చూడకుండానే– "అవసరమైతే పిలుస్తాను, వెళ్ళండి" అన్నాడు. సుహాసిని నిరుత్తరంగా అతని వైపొకసారి చూసి వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళగానే చిరాకు

పడ్డాడు మూర్తి. ఎందుకామె అలా చూపులు విసరటం, కోపం వచ్చిందతనికి. కాని వెంటనే జాలిపడ్డాడు. ఆమెలో కొంత అర్థంకాని అమాయకత్వం ఉంది. తను ఏదైనా మాట తూలితే, పాపం చాల బాధపడుతుంది అనుకున్నాడు. ఆమెతో మాట్లాడేటప్పుడు జాగ్రత్తగా ఉండాలని తీర్మానించుకున్నాడు.

సుహాసిని వెళ్ళిన కొద్ది నిముషాలకే శ్రీపతి, ప్రకాశం వచ్చారు. శ్రీపతి ఆఫీసులోనే మరొక శాఖకు అధిపతి. ప్రకాశం అతనిని మూర్తికి పరిచయం చేసి, ఏదో పని ఉందని వెళ్ళిపోయాడు. కాసేపు పిచ్చాపాటీ మాట్లాడారు.

"పూల్‌చంద్ వచ్చాడా మీ దగ్గరకు?" అన్నాడు శ్రీపతి అకస్మాత్తుగా, యధాలాపంగా అన్నట్టు.

"పూల్‌చంద్ ఎవరూ!" అన్నాడు అర్థంకాక.

"మిల్లు యజమానండీ! రాలేదన్నమాట."

"నా దగ్గర కెవరూ రాలేదు. ఏమిటి పని?"

"ఆ! నిన్న నా దగ్గరకు వచ్చాడు లెండి. మీరింకా అతనికి పరిచయం కాలేదు కదా! పరిచయం చెయ్యమన్నాడు. ఎందుకయ్యా, ఈ మాత్రందానికి నువ్వే వెళ్ళి అడిగితే పోతుంది అన్నాను."

"ఏం కావాలి?" అన్నాడు ఉపోద్ఘాతం ఎందుకో తెలియక.

"పర్మిట్. మరేం కావాలి అతనికి. ఏదో చూసి పంపండి. బాగా ఉన్నవాడే. బాగానే ఛార్జి చెయ్యవచ్చు."

"ఛార్జి చెయ్యడమేమిటి?"

శ్రీపతి అపనమ్మకంతో అతని కళ్ళల్లోకి చూచాడు.

"ఏమిటండి అల్లా మాట్లాడుతారు! రోజుకి మూడు నాలుగొందలకు తక్కువ కాకుండా వచ్చే సీటులో కూర్చుని...." అన్నాడు మందలించే స్వరంతో శ్రీపతి.

ఈసారి అపనమ్మకంతో చూడటం మూర్తివంతయింది.

"లంచమా?" అన్నాడు ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి.

"ప్రతిఫలం" అన్నాడు అదేంమాట అన్న ధోరణిలో శ్రీపతి.

"ఛీ" అన్నాడు ఏవగింపుతో.

శ్రీపతి కొంచెం చిన్నబోయాడు.

"కబుర్లు చెప్పకండి. ఎవరికీ ఏమీ నష్టంలేని పనిచేసి, అందుకు ప్రతిఫలం తీసుకుంటే ఏమి చెడర? జీవితం సాగాలా, వద్దా? మడిగట్టుకు కూర్చోవాలంటే కుదరదండీ మూర్తిగారూ!"

చిన్న ఉపన్యాసం యిచ్చాడు శ్రీపతి.

"అలాంటి పని నేను చెయ్యనండి" అన్నాడు నిష్కర్షగా.

"మీ ఒక్కరూ నీతిగా వుంటే ఏమవుతుంది? అ మాటకొస్తే నీతి అనే దేమిటో నిర్వచించండి. చాలీచాలక జీతాలిచ్చి హోదాకు తగ్గట్లుగా బ్రతక మంటే ఎలా? కుటుంబం ఏం కావాలి. రేపు మన పిల్లలు చదువుకోవడానికి డబ్బులేక అవస్థపడుతూ, ఏ బంట్రోతు చాకిరినో చేసుకుని బ్రతుకుతూంటే నీతి పేరు చెప్పుకుని మనం సంతోషిస్తూ కూర్చోవాలా? కబుర్లు చెప్పకండి!" అన్నాడు శ్రీపతి ఉద్రేకంగా.

మూర్తి ఏమీ మాట్లాడలేదు. యింకా మాట్లాడితే ఉపన్యాసం మరింత పొడు గవుతుందేమోనని అతనికి తెలుసు. శ్రీపతి సమాధానం కోసం కొంచెంసేపాగి, విసుగుదల సూచించే స్వరంతో అన్నాడు.

"చెప్పాల్సింది చెప్పాను మీ యిష్టం."

అప్పటికి మూర్తి ఏమీ అనలేదు. శ్రీపతి అహం కొంచెం దెబ్బతింది. వెళ్ళిపోయాడు. ఈ విషయం యింతటితో సరి అనుకున్నాడు మూర్తి. కానీ తను పొరపడ్డట్లు ఆ సాయంత్రమే తెలుసుకున్నాడు శ్రీపతి. ఆ ఫూల్‌చంద్ అనే ఆయనతోసహా తన బసకు వచ్చాడు. వాళ్ళిద్దరినీ చూడగానే మూర్తికి మొదట కోపమూ, తరవాత ఏహ్యభావమూ కలిగాయి. మర్యాదకోసం యిద్దరినీ ఆహ్వానించి కూర్చోబెట్టాడు. శ్రీపతి మళ్ళీ విషయం కదలేశాడు. ఫూల్‌చంద్ మధ్య మధ్య రేటు పెంచుతూ కలుగజేసుకున్నాడు. దాంతో మూర్తికి అపరి మితమయిన అసహ్యం కలిగింది. కానీ తమాయించుకున్నాడు.

మూర్తి మొండిపట్టుదల చూసి ఫూల్‌చంద్‌ను వెళ్ళమన్నట్లుగా సంజ్ఞచేశాడు శ్రీపతి. ఫూల్‌చంద్ మూర్తిని మళ్ళీ ఒకసారి ప్రార్థించి, సెలవుతీసుకున్నాడు.

"ఆఫీసు విషయాలు మీకు బాగా తెలియవు." అన్నాడు శ్రీపతి.

ముభావంగా వూరుకున్నాడు మూర్తి.

"మహేంద్రరావూ, రామదాసూ, నారాయణకూడా మొదట యిల్లాగే అన్నారు. రానురాను కుటుంబభారం మీదపడటంతో తెలిసివచ్చింది. మీ శ్రేయస్సుకోరి చెబుతున్నాను. లేకపోతే ఇలా మీ యింటికికూడా వచ్చి నచ్చచెప్పే అవసరం నా కేమిటి? ఆలోచించుకోండి?" అని శ్రీపతి వెళ్ళిపోయాడు.

మూర్తికి తల దిమ్మెక్కింది. శ్రీపతిమీద కోపంతోపాటు అసహ్యం కూడా కలిగింది. కానీ కొంచెం ఆలోచించేసరికి అతనిమీద అసహ్యం తగ్గింది. కోటి




ఉద్యోగి కనుక, అతనికి తోచింది చెప్పాడు. ఆలోచించి కర్తవ్యం నిర్ణయించుకోవలసింది తను. ఇలా అనుకుని, మనస్సు సరిపెట్టుకున్నాడు. ఇంతలో ప్రకాశం వచ్చాడు.

వచ్చీ రాగానే కుర్చీలోంచి ఏదో తీసి పరీక్షించి మూర్తివైపు గిరవాటు వేసి అడిగాడు.

"ఏమిటిది?"

"నోట్లకట్ట."

మూర్తి ఉద్భ్రాంతుడయ్యాడు. ఏమిటీ దొంగపని? ఎందుకీ బలవంతం?

"ఆ శ్రీపతీ పూల్‌చందూ కలిసి చేసినపని. రేపు పొద్దున్న వాళ్ళ మొహాల మీద కొట్టివస్తాను." అన్నాడు మూర్తి ఉద్రేకంగా.

ప్రకాశం నవ్వాడు.

"పిచ్చివాడా! సిరి రా మోకాలొడ్డటం అంటే ఇదే!"

మూర్తి తలపట్టుకున్నాడు.

"మీకు పుణ్యం వుంటుంది. ఆ డబ్బు తీసుకోమని నాకు చెప్పవద్దు" అన్నాడు.

"పోనీ నేను తీసుకోనా?" అన్నాడు ప్రకాశం వెటకారంగా.

వెయ్యి ముఖాలు తనని వెక్కిరిస్తున్నట్టు అనుభూతి పొందాడు మూర్తి. అదేక్షణంలో శ్రీపతి మళ్ళీ వచ్చాడు.

"ఫూల్‌చంద్ డబ్బు యిక్కడ మరిచిపోయి వెళ్ళాడుట. ఇప్పుడే కనుపించి చెప్పాడు. మీ దగ్గర ఉంచండి. అంత అక్కరలేకపోతే పంపివ్వొచ్చు." అన్నాడు.

"అక్కర్లేదు. క్షమించి యిప్పుడే తీసుకువెళ్ళండి." అన్నాడు మూర్తి. శ్రీపతి డబ్బుతీసుకుని మరేమీ అనకుండా విసురుగా వెళ్ళిపోయాడు.

"నేను లంచం తీసుకోకపోతే ఆయన కెందుకు కోపం?" అన్నాడు మూర్తి.

"మీరు సిగరెట్ త్రాగకపోతే నాకెందుకు కోపం?". అన్నాడు హాస్యధోరణిలో ప్రకాశం. మూర్తి మాట్లాడకపోయేసరికి అతని కోపం తగ్గించడానికి మళ్ళీ ప్రకాశం అన్నాడు.

"శ్రీపతిమీద అంత కోపం దేనికి?"

"ఆయనమీద కాదు, ఆయన చేసిన పనిమీద."

"ఆయన చేసిన పని మంచిది కాదా."

"ఋమ్మాటికీ కాదు."

"ఎందుకు కాదు."

"మీకు తెలుసు."

"మీకు తెలిసినట్లుగా నాకు తెలియకపోవచ్చు. ఆ మాటకొస్తే ఆ విషయం ఒకరికి తెలిసినట్లుగా మరొకరికి తెలియదు. మన అభిరుచులకు అనుగుణంగా అభిప్రాయాలు ఏర్పడుతూ వుంటాయి. ఆ దృష్టికోణంలోంచి ఇతరుల చేష్టలను విమర్శించటం మంచిది కాదేమో. అలా అని లంచం తీసుకోవటం సమర్థిస్తున్నానని కాదు. నిజానికి నేను లంచం యింతవరకు పట్టి ఎరుగను. శ్రీపతి పర్వవిధాలా చెప్పాడు. అయితే, నే నతన్ని అందుకు నిందించలేదు; అతనిమీద కోపమూ లేదు."

మూర్తి ప్రశాంతంగా విని వూరుకున్నాడు. అదే క్షణంలో రామదాసు వచ్చాడు. వస్తూనే ప్రకాశంమీద అభాండం వేశాడు.

"నీ కల్లబ్బు వ్యసనం మూర్తికి కూడా అంటించావా."

"రామరామ" అన్నాడు ప్రకాశం.

"సంతోషం." అన్నాడు రామదాసు.

"రాములవారి గుడికేనా ప్రయాణం" అన్నాడు ప్రకాశం.

"కాదు. క్లబ్బుకి" అన్నాడు వెటకారంగా రామదాసు.

"పూరోచ్చింది, రామదాసుగారూ!" అన్నాడు మూర్తి తేరుకుని.

"మూర్తిగారూ! ఇవాళ మీరు క్లబ్బు మానేయాలి. అలా పూరిబయటకు షికారు వెళ్దాం" అన్నాడు రామదాసు.

"గుళ్లోకి వెళ్ళొద్దామని చెప్పరాదూ? దొంకతిరుగుడు దేనికి?" అన్నాడు ప్రకాశం.

"ఏం గుళ్ళోకి వెళితే పాపమా?" అన్నాడు రామదాసు.

"రామదాసూ! ఆ మాట నేనన్నానా!"

"మరయితే పదండి. ఆలస్యమెందుకు?"

"నన్ను విడిచిపెట్టండి, క్లబ్బులో పదిమంది పెట్టు నేనొక్కడినీ, గోల పెడతారు" అన్నాడు ప్రకాశం.

"సరే మీ యిష్టం. రండి మూర్తిగారూ అలా వాటర్‌వర్క్సుదాకా వెళ్ళొద్దాం" అన్నాడు రామదాసు.

నిజానికి మూర్తికి క్లబ్బు మొహంమొత్తింది. ప్రకాశం బలవంతంమీద వెళ్ళటమేకానీ, అందులో అతనికి ఆసక్తి లేదు. అందువల్ల రామదాసుతో బయలు దేరాడు. రామదాసు అసలుపేరు రామచంద్రరావు. కానీ ఆఫీసులో అందరూ అతన్ని రామదాసుగా మార్చేశారు.

వాటర్‌వర్క్సు చెరువులదగ్గర కాసేపు కూర్చుని సంజవేళ యింటికి వెళ్ళారు యిద్దరూ. దారిలోనే గుడి. అంతాకా వచ్చి లోపలకు వెళదామా అన్నాడు రామదాసు. సరే నన్నాడు మూర్తి. రామదాసు రెండు కొబ్బరికాయలు కొనబోయాడు.

"ఒకటి చాల్లెండి" అన్నాడు మూర్తి.

"అదేం? మీరు కొట్టరా?" అన్నాడు రామదాసు కొంచెం ఆశ్చర్యంగా.

"ఎందుకులెండి?" అన్నాడు.

"మీకు భక్తి లేదా?"

"ఆ విషయాలు అడక్కండి."

"ఎందుకు?"

"వాటిని గురించి నేనంత ఎక్కువగా ఆలోచించలేదు."

"ఆలోచించవలసిన విషయాలు అంతకంటే ఏం ఉన్నాయండి?"

"ఎందుకు లేవు బోలెడన్ని ఉతి బాధలు."

"వాటినిగురించి ఆలోచించేదేమిటి. ఎప్పుడేది అవసరమైతే అప్పటికప్పుడు ఏదో చేసెయ్యటమే."

అయితే ఆలోచించకుండానే ఈ మహానుభావుడు లంచం తీసుకుంటున్నాడా? అనుకున్నాడు. వెంటనే అతనికి రామదాసుమీద కొంచెం అసహ్యం కూడా కలిగింది. జనంలో తిరుగుతూ జనాన్ని మోసగించే ఈయనకి భక్తిలో అంత విశ్వాసం ఎందుకో? చేసిన పాపాల్ని దేవుడు క్షమిస్తాడనా? ఈ ఆలోచన రాగానే రామదాసుని దెబ్బకొట్టాలనిపించింది.

"చేసిన పాపాలకి ప్రతిసాయంత్రం లెక్కచెప్పి శిక్ష తగ్గించటానికి లంచం ఇవ్వటమేగా, కొబ్బరికాయ కొట్టటమంటే" అన్నాడు.

రామదాసు అప్రతిభుడయాడు. అతని ముఖంలోని మార్పుని గమనించి మూర్తికూడా పశ్చాత్తాపపడ్డాడు. అంత కటువుగా అనాలని అనలేదు తను. కాని సమయం మించిపోయింది; అనేశాడు.

"ఈ మాటలు మీకే తోచాయా? ఎవరైనా చెప్పారా"?

"ఒకరు చెప్పేందు కేముందిలెండి ఇందులో." అన్నాడు సర్దుకుంటూ.

"అదికాదు. మీరు చెప్పింది కొందరిపట్ల నిజం కావచ్చు కాని అందరూ అలాంటివారు కాదు. కనీసం నేనలా ఎప్పుడూ అనుకోలేదు. నేనూ పాపాలు చేశాను. ఎవరి గొంతుక కొయ్యక పాపాలనబడేవి చేసాను. ఆ మాటకొస్తే పాపం, ఏదో విధమైన పాపం చెయ్యని దెవరు. కాని వాటికి ప్రాయశ్చిత్తం కోసం నేను గుడికి రావటంలేదు. మనిషి జీవితం బహుముఖమైంది కదా. అధ్యాత్మిక చింతనకోసం నేను దైవాన్ని ఆరాధిస్తాను. మీరు దేవుడున్నాడని ఒప్పుకోరా?"

రామదాసు మాటల్లోని నిజం అవగతమైనా అతను మామూలు ప్రశ్న ఒకటి వేసేసరికి అతనిలోని తార్కికశక్తిని రెచ్చగొట్టినట్టయింది.

"అయితే ఒప్పుకుంటారన్నమాట."

"ఒప్పుకుంటానని చెప్పలేదే" విస్తుపోయాడు రామదాసు.

"అయితే మీరనేదేమిటి?"

"ఏమీ లేదు. నాకీ విషయాలు తెలియవని చెప్పాను. దేవుడున్నాడని నాకు రుజువైతే ఒప్పుకుంటాను. రుజువుకాకపోతే తటస్థంగా ఉంటాను" అన్నాడు.

"మీరు రోజూ నాతో గుడికి వస్తానని మాట ఇవ్వండి." అన్నాడు రామదాసు

హఠాత్తుగా.

"ఎందుకు."

"మాటివ్వండి."

"క్షమించాలి."

"మీ మేలు కోరే చెబుతున్నాను."

"కృతజ్ఞుణ్ణి."

"సంశయాత్మో వినశ్యతి."

"కానివ్వండి ఏం చేస్తాం."

"మీకోసం నేను ఇవ్వాళ్టినించీ రోజూ ఒక అరగంట దైవాన్ని ప్రార్థిస్తాను."

మూర్తి చలించాడు. రామదాసు రెండు కొబ్బరికాయలు కొని గుళ్ళోకి మూర్తితో సహా వెళ్ళాడు. రెండు కొబ్బరికాయలూ తన తరపున తనే కొట్టాడు. నమస్కారం చేశాడు. మూర్తిని చెయ్యమన్నాడు.

"మీకు నమస్కారం చేస్తానుగాని ఎవరో ఊహించుకున్న బొమ్మకి నమస్కారం చేస్తే ఏంలాభం?" అన్నాడు మూర్తి. రామదాసు వూరుకున్నాడు

"రోజూ నాతో గుడికి వస్తారు కదూ"" గుడి ప్రాంగణం దాటుతూ అన్నాడు రామదాసు.

"రాకూడదని నాకేమీ లేదు. రావాలనీ లేదు."

"పోనీ ఇలా షికారుగా వద్దాం. ఇష్టమైతే గుళ్ళోకి వెళ్ళవచ్చు. లేకపో లేదు."

మూర్తికి నవ్వు వచ్చింది. ఈ మనిషి కెందుకింత తాపత్రయం? చూ తనని ఈ భక్తిమార్గాన పట్టించేదాకా ఒదిలేట్టు లేడు. ఏవో సాకులు చె ఒదిలించుకోవాలని నిశ్చయించుకున్నాడు మూర్తి.

ఇంటికి వచ్చేసరికి బాగా పొద్దుపోయింది. హోటల్ నించి కారియర్ వ వుంది. ప్రకాశం అప్పటికే భోజనం ముగించుకుని ఉన్నాడు.

"ఏం ఇవాళ అప్పుడే క్లబ్బునుంచి వచ్చేశారు."

"పౌర్ణమి కదూ! అలా వూరిబయటకి కులాసాగా వెళ్ళొద్దాం, త్వర భోజనం కానివ్వండి."

మూర్తి తన గదిలోకి వెళ్ళి భోజనం ముగించుకుని బయటకు వచ్చేస ప్రకాశం తెల్లటి గ్లాస్కో పంచె. గ్లాస్కో లాల్చీ వేసుకుని కల్లీ వముల పూలరంగడిలా కనుపించాడు.

"షికారుకా, అత్తవారింటికా ?" అన్నాడు మూర్తి నవ్వుతూ.

ప్రకాశం మాట్లాడలేదు. చిన్నగా నవ్వాడు. ఇద్దరూ వెన్నెల్లో నడుస్తూ వూరిబయటకు చేరుకున్నారు.

"ఇటు కొంతదూరం పోతే ఏరు వస్తుంది." అన్నాడు ప్రకాశం.

"పోదామా ?" అన్నాడు మూర్తి ఉత్సాహంగా.

"ఎందుకు ? ఏముంటుంది అక్కడ ?" అన్నాడు ప్రకాశం చిరునవ్వుతో.

"వెన్నెల్లో ఏరు పొంగి పొర్లుతూంటే చూడముచ్చటగా వుంటుంది కదూ "

"యవ్వనంలా !" అన్నాడు ప్రకాశం.

"బాగా పోల్చారు."

"పోల్చటంలో ఏముంది ? అనుభవించాలి."

మూర్తికి ప్రకాశం ఉద్దేశ్యం బోధపడక మాట్లాడకుండా ఊరుకున్నాడు.

"నేను బాగా పోల్చానని ఎందుకన్నారు ?"

"ఉపమానం సరిపోయిందని నా భావం."

"యవ్వనం ఉరకలువేసే వారి కది స్వానుభవం. విచ్చలవిడిగా సంచరించే ఏరుని ఇప్పుడు మీ రర్థంచేసుకోగలరు కదూ ?"

మూర్తి కర్థమయింది.

"గట్లను ఒరుసుకునే కదా ఏరు ప్రవహించేది" అన్నాడు నర్మగర్భితంగా.

"ఉత్సాహపు వెల్లువలో గట్లుదాటిపోదా ప్రవాహం ?"

"గట్లకు లోబడి ఉరకలువేసేటప్పుడే ఏటి అందం. విలయంలో అంద మేమిటి ?"

ప్రకాశం ఒక్క క్షణం వూరుకున్నాడు.

"మీకు వెన్నెల గురించీ, అందాన్ని గురించీ తెలుసుకోవాలని లేదా ? ఉంటే అన్వేషించండి. మనస్సుని ఊరికే అడ్డుప్రశ్నలతో బాధిస్తే మిగిలేది తలనొప్పే."

మూర్తికి జవాబేమివ్వాలో తెలీలేదు. ఆలోచిస్తూ నడవసాగాడు. ప్రకాశానికి అసంతృప్తిగా వుంది. మూర్తి ఎంతసేపటికీ నీతి గురించి మాట్లాడుతున్నాడు. అతనికీ చిరాకువేసింది.

"మీ రెప్పుడూ నీతిపరిహద్దులు దాటలేదు కాబోలు."

"లేదు." అన్నాడు మూర్తి దృఢంగా, గర్వంగా.

ప్రకాశం అసంతృప్తి మరీ ఎక్కువయింది.

"మీకు అవకాశం దొరకలేదు, అంతే."

"అవకాశంలో ఏముంది. మనసులో ఉంటుంది." అన్నాడు చాలా తేలిగ్గా మూర్తి.

ప్రకాశానికి రోషం కలిగింది

"మీలో రసికత లేదు. జీవితం అనుభవించటం మీకు చేతకాదు."

మూర్తి మొహం ఎర్రబడటం ఆ వెన్నెల్లో స్పష్టంగా చూచాడు ప్రకాశం. అతన్ని రెచ్చకొట్టాలనే అలా అన్నాడు. ఫలితానికి సంతృప్తి చెందాడు.

"గాడి తప్పని జీవితం అంటే ఏమిటో తెలుసుకోవాలంటే సరాసరి ఏటిగట్టుకి వెళ్ళండి."

"ఎందుకూ ?"

"అవకాశాన్ని ఎదుర్కొటానికి."

"ఏమిటి మీ భావం ?"

"అక్కడికి సుహాసిని వస్తుంది."

నెత్తిమీద పిడుగుపడ్డట్టయింది మూర్తికి. ఒక్క నిముషందాకా తేరుకోలేక పోయాడు.

"సుహాసిని !" అన్నాడు తనలో తాను అనుకుంటున్నట్టు.

"అవును. మీ స్టెనో."

"ఆమె ఎందుకు వస్తుంది ?"

పౌర్ణమినాటి రాత్రి ఏటిగట్టున విహారం చెయ్యటం ఈ వూళ్ళో అశ్చర్యకరమయిన విషయం కాదు."

"ఆమె వస్తుందని మీ కెలా తెలుసు ?"

"తెలియకపోతే ఎందుకు చెబుతాను ? ఆమె సంగతి నాకు బాగా తెలుసు. ఆఫీసులో ఇంకా యిద్దరు ముగ్గురు స్టెనోగ్రాఫర్ల విషయం కూడా నాకు బాగా తెలుసు." అన్నాడు ప్రకాశం దృఢంగా, ఈసడింపు వ్యక్తంచేస్తూ.

నిజంగా షాక్ తగిలినట్లయింది మూర్తికి.

"అయితే, నేను వెళ్ళడం దేనికి ?"

ఈసారి ప్రకాశం చాలా ఎబ్బెట్టుగా నవ్వాడు. తనని ప్రకాశం అనవసరంగా అనుమానిస్తున్నాడేమోనని బాధపడ్డాడు.

"మీరు వస్తున్నారని ఆమెకు తెలియదు. నేను వస్తున్నానని తెలుసు అంతే మరేం లేదు. మాటల సందర్భంలో పౌర్ణమినాటి రాత్రి ఏటిగట్టుకి వెళ్ళటం

రివాజు అని ఆమె అంది. నాకూడా రివాజేనని చెప్పాను. ఒకవేళ మీకు ఆమె కనిపిస్తే నేను రాలేదేమోనని అడిగితే తలనొప్పివల్ల రాలేకపోయానని చెప్పండి. శుభం."

అని ప్రకాశం గిరుక్కున వెనక్కి తిరిగాడు. తటాలున అతని చెయ్యి పట్టుకుని వెనక్కి లాగాడు.

"మీ మాటలు నాకేమీ బోధపడలేదు. నేను ఇంటికి వెళుతున్నాను. మీరు కూడా వస్తే రండి మీ యిష్టం." అనేసి ముభావంగా ముందుకి నడిచాడు.

ప్రకాశం అతని భుజం తట్టి వూరుకున్నాడు. కొంత దూరం నడిచాక అతడు వెనక్కి తిరిగి చూశాడు. ప్రకాశం తనతో రావటంలేదు. దూరదూరంగా ఏటివైపు వెళుతున్నాడు. అతని మాటలు అతనికి బాధ కలిగించాయి. ప్రకాశం ఎక్కువగా ఆలోచించే వ్యక్తిగాడు. ఏది తోస్తే అది చెయ్యటం, ఏమాట అనాలనిపిస్తే ఆ మాట అనటం అతని కలవాటు. ఈ విషయం అతను పూర్తిగా అవగాహన చేసుకున్నాడు. కాని తనని రొంపిలోకి లాగాలని అతను ఎందుకు ప్రయత్నిస్తున్నాడో అర్థంకావటంలేదు. ఆలోచనల్లో సతమతమవుతున్న అతని మనసులో సుహాసిని మెదిలింది. ప్రకాశం ఆమెని గురించి ఏదో అన్నాడు. అందులో నిజమెంతో తెలుసుకోవాలనిపించింది అతనికి. కాని నిజం దాచవలసిన అవసరం ప్రకాశానికి లేదు. తనతో అతను అబద్ధమెందుకు ఆడుతాడు. తను సుహాసిని కిచ్చిన చనువేమి ఎక్కువకాదు. ఇందులో అనుమానించడానికి అవకాశం లేదు. ప్రకాశం కావాలని తనమీద మాటలు విసరలేదని నిశ్చయించుకుని తృప్తిపడ్డాడతను.

ప్రకాశం రాత్రి ఎన్ని గంటలకి ఇంటికి వచ్చాడో అతను గమనించలేదు. తెల్లవారిన తరవాత అతనిని చూడాలని కూడా అనిపించలేదు. కాని ఏం జరిగిందో తెలుసుకోవాలనే కుతూహలం మాత్రం కలిగింది. అయినా ప్రకాశాన్ని ఈ విషయం గురించి కదిలించలేదు. అతను కూడా రాత్రి ఏమీ జరగలేదన్నట్టుగా ప్రవర్తించాడు.

ఆఫీసు గదిలో ప్రవేశించగానే మామూలుగా సుహాసినే మొదలు కనుపించి నమస్కారం చేసింది. ప్రతినమస్కారం చేస్తూ ఆమెను నఖశిఖ పర్యంతం పరిశీలనగా చూశాడు. ఆమెలో మార్పేమి కనిపించలేదు. మామూలుగానే నవ్వుతూ సుతారంగా మెలికలు తిరుగుతూ ఉల్లాసంగా మాట్లాడుతూ, వాలుగా చూపుల్ని ప్రసరిస్తూ ప్రవర్తించసాగింది. అయినా ఆమెని చూస్తుంటే అతనిలో ఏదో

అయిష్టత కలిగింది. ఆమె నోట్‌బుక్ చేత్తో పట్టుకుని పెన్సిల్ ఆడిస్తూ మామూలు ఉత్సాహంతోనే అడిగింది.

"ఏమైనా ఉత్తరాలు రాస్తారా సార్?"

"ఏమీ లేవు ప్రస్తుతం." అన్నాడు ముక్తసరిగా.

ఆమె అతనిలోని అప్రసన్నత కనిపెట్టింది.

"అలా ఉన్నారేమండీ?" అంది.

"బాగానే ఉన్నాను" అన్నాడు అతను తలెత్తకుండా

ఆమె కొంచెం తటపటాయించి వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళిపోయాక అతను కొంచెం బాధపడ్డాడు. ప్రకాశం అనవసరంగా ఆమెమీద [illegible] వేళాదేమో.. తనమీద కోపాన్ని అలా తీర్చుకున్నాడేమో. ఏమైనా [illegible]? ఆమె తన స్టెనో. పని ఉంటే పిలిచి ఉత్తరాలు రాసుకోమంటాడు. లేకపోతే వూరుకుంటాడు. తన కామె జోలి ఎందుకు?

పరధ్యానంగా ఆఫీసు టైమంతా గడిపి అయిదుకాగానే [illegible] పుతో కుర్చీనుంచి లేచాడతను. పరధ్యానంలో కోటు వేసుకోటం మర్చిపోతే అందించి నల్లటి కళ్ళతో నవ్వింది.

"ఆఫీసులో ఇలా సర్వం మర్చిపోయేవాళ్ళకి ప్రమోషన్ త్వరలో రాదండీ!" అంది— సుహాసిని అతని మందస్మిత వదనాన్ని గమనించి ధైర్యంగా.

"నాకు ప్రమోషన్ వద్దులెండి" అన్నాడతను వెనుకటి ఉత్సాహాన్ని మళ్ళీ తెచ్చుకుని.

"అదేం మాటండీ? చేరినప్పటినుంచి న్యాయంగా ఉంటూ ప్రమోషన్‌కోసం ప్రయత్నిస్తున్నారుగా?" అంది సుహాసిని నవ్వుతూ.

ఆమె ఇంత చొరవ ఎందుకు తీసుకుంటూందో అతనికి అర్థంకాలేదు. పొడిగా విని బయటికి వచ్చేశాడు.

ఇంటికి వచ్చి బట్టలు మార్చుకోగానే శ్రీపతి వచ్చాడు. అతని ముఖంలో ఆనందం తాండవించింది.

"భేష్! నిజంగా మీరు చాలా మంచివారు. సేట్ పర్మిట్ మీద సంతకం పెట్టారని తెలిసింది. సేట్‌జీ స్వయంగా వచ్చి మీ దర్శనం చేసుకుని ఋణం తీర్చుకుంటాడు. మాట తప్పే మనిషి కాదులెండి. చూడండి, అప్పుడు అడ్వాన్సు [illegible] డబ్బు మీరు తిరస్కరించారు. అయినా నేనది సేట్‌జీకి ఇంకా వాపస్ ఇవ్వలేదు. నాకు తెలుసు. మీరు చాలా మంచివారు. ఇదిగో,

అవి మీవే. ఇహ నేను వెడుతున్నాను. సేట్‌తో మీరేం పరిష్కారం కుదుర్చుకుంటారో మీ యిష్టం."

మూర్తి దిగ్భ్రాంతుడైనాడు.

"పర్మిటేమిటి?" అన్నాడు.

"అదే, హోల్‌సేల్ పర్మిట్."

మూర్తికి ముచ్చెమటలు పోశాయి. తను ఆ రోజంతా పరధ్యానంగా ఫైళ్ళు చూశాడు. పొరపాటున సంతకం పెట్టాడు గావును. ఇప్పుడు వాళ్ళు ఆ కాగితాలు తెప్పించి రద్దుచేయటం సాధ్యంకాదు. ఏం చేసేట్టు? ఆ పర్మిట్ విషయంలో ఏదో పేచీ ఉండి ఉంటుంది. సేట్ పూరికే డబ్బెందుకు యిస్తాడు. అతను తనని తాను శపించుకున్నాడు.

"శ్రీపతిగారు, ఒక్క పని చేయండి. ఈ డబ్బు తీసికెళ్ళి సేట్‌కి అందచేయండి. అతన్ని నాకు కనిపించవద్దని చెప్పండి." అన్నాడు.

ముఖంలో భావం ప్రస్ఫుటం చేయకుండా శ్రీపతి ఆశ్చర్యపోయాడు. ఏదో తికమక జరిగిందనుకున్నాడు. అతని వైఖరి చూస్తే సంభాషణకి తావు కనిపించలేదు. శ్రీపతి మాట్లాడకుండా ముఖం చిన్నబుచ్చుకుని ఆ డబ్బు తీసుకుని వెళ్ళిపోయాడు.

మూర్తిలో అశాంతి ఎక్కువైంది. ఏదో ఇల్లు చూసుకుని అందులోకి బసమార్చాడు. రోజులు గడిచిపోతున్నాయి. రామదాసు అతన్ని గుళ్ళోకి తీసుకువెళ్ళి ఉపదేశం చెయ్యాలని ఎప్పటికప్పుడు ప్రయత్నిస్తూనే ఉన్నాడు. ప్రకాశం తన ధోరణిలో ఉపన్యాసాలు ఇస్తూనే ఉన్నాడు. సుహాసిని తన మామూలు విన్యాసాల్తో చొరవగా మాటలంటూనే ఉంది.

* * *

ఆకాశంలో తెల్లటి కాంతికి మూలం వెతుకుతూ తెలిమబ్బులు, దిక్చక్రంపైన పదహారు వన్నెలతో నాటకీయంగా ప్రత్యక్షమైన చంద్రబింబాన్ని ఆశ్చర్యంగా దగ్గరికివచ్చి చూసి ఆ విషయం ఆకాశమంతా చాటడానికి ప్రయాణిస్తున్నాయి.

చంద్రుడు భూలోక సౌందర్యాన్ని చూడడానికి ఆకాశపు మెట్లెక్కసాగాడు.
వెన్నెల్లో స్నానంచేసి తెల్లగా మెరుస్తున్నాయి మల్లెలూ, విరజాజులూ.
ఏరు సంతోషంతో ఉరకలువేస్తూ ఉప్పొంగిపోతోంది.
ఏటిగట్టున నడుస్తున్నాడు. గట్లమీద చెట్లు రెపరెపలాడుతూ సంతోషంగా

పూసిపోతున్నాయి. గాలి ఉత్సాహంగా ఆకాశంలో మదులు తిరుగుతూ నాట్యం చేస్తూ పుష్పపరిమళాన్ని చంద్రుడికి నివాళిస్తోంది.

ప్రకృతి సమస్త నవయవ్వనంలో నిండు ఉత్సాహంతో తొణికిసలాడుతోంది

ప్రకృతిలోని ప్రతి అందము కన్నుల పండుగగా చూస్తూ నడుస్తున్నాడు.

ప్రవాహం నయ్యారంగా మెలికలుతిరుగుతూ పోతోంది.

అలలు లేచిపడుతూ తరగని ఉత్సాహంతో నృత్యభంగిమతో ముందుకు సాగి పోతున్నాయి.

ఆ యేటి అందం చూస్తుంటే అందులో మునకవేస్తూ ప్రవాహంతో సాగిపో వాలని బలీయమైన వాంఛ కలిగింది అతనికి. గట్టుదిగి ఇసుకదిబ్బలమీద నడవ సాగాడు. దూరదూరంగా అక్కడక్కడ కొంతమంది తనలాగానే యేటిలో ఆడుకుంటూ ఆనందిస్తున్నారు.

యేటిమీదికి వంగిన కొబ్బరిచెట్టు మొదల్లో ఎవరో లీలగా కదిలారు.

ఆ కొబ్బరిచెట్టువైపుకే నడుస్తున్న అతను అది గమనించి పరాకాయించి చూశాడు.

చిరుగాలికి తెరచాపలా తెల్లటి చీరకొంగు రెపరెపలాడుతోంది.

దగ్గరగా వచ్చాడతను. బండలికి ఆనుకుని వడుతూ నురగలుకక్కే అలల్ని చూస్తూ మైమరచి ఆమె అతనిని చూడలేదు, కాని అతను స్పష్టంగా చూసి వెనక్కి ఒక్క అడుగేశాడు. అలా అడుగెయ్యటంలో పాదం బ్రహ్మజెముడు ఆకుమీద పడి ముళ్లు గుచ్చుకున్నాయి. అతను 'అబ్బ' అని ఆ ఆకులాగి వేశాడు.

ఆమె ఉలిక్కిపడి లేచి నుంచుంది.

"సుహాసినీ" అన్నాడు.

గబుక్కున తలెత్తి ఆమె అతనిని చూసి వినయంతో "మీరా?" అంది.

"అవును" అన్నాడతను.

"పౌర్ణమి కదూ?" అన్నాడు అతను. ప్రకాశం మాటలన్నీ అతని చెవుల్లో మార్మోగాయి.

"పౌర్ణమినాడు నిజంగా ఎంత బావుంటుందండి యేరు!" అంది ఆమె ఆరాధనా పూర్వకంగా.

"నేను రావటం ఇదే మొదటిసారి." అన్నాడు అతను.

"నేను నాలుగైదుసార్లు వచ్చానండి. ప్రతి పౌర్ణమికి తప్పక వస్తున్నాను."

"అయితే మీరుకూడా కొత్తగానే ఉద్యోగంలో చేరారన్నమాట.

"అవునండి. రెండుమూడు నెలలవుతుంది."

"ఇలా మీలాంటివాళ్ళు వంటరిగా రావటం మంచిది కాదేమో." అన్నాడతను.

"నాకెవరూ లేరు, యేంచేయను?" అందామె తల దించుకుని.

"వంటరిగా ఇక్కడ కూచుని యేంచేస్తారు?"

"కబుర్లు చెప్పండి వింటాను." అందామె నవ్వి అతని వైపు కళ్ళెప్పగించి చూస్తూ. ఆమె నల్లటికళ్ళవైపు చూచాడు. వాటిలో యేదో ఆకర్షణ అతని చూపుల్ని అరికట్టింది. ఆమె కళ్ళని పక్కకి తిప్పుకుంది.

"మీ కళ్ళు బావుంటాయి." అన్నాడు.

ఆమె విషయాన్ని తప్పిస్తూ, "ఏరు ఎంత బాగుందో చూడండి." అంది.

ప్రకాశం మాటలు జ్ఞప్తికివచ్చాయి అతనికి.

"యవ్వనంలా" అన్నాడు.

సుహాసిని మాట్లాడలేదు. గాలికి ఆమె ముంగురులు చెదిరి నున్నటి బుగ్గల మీద నాట్యంచేస్తున్నాయి. ఆమె వాటిని పైకితోసుకుంటుంటే చీర గాలికివత్తాసు యిస్తోంది.

ముగ్ధుడై అతను ఆమె యవ్వనరేఖాలావణ్యాన్ని చూస్తున్నాడు.

పదహారు వన్నెల చంద్రబింబం వెన్నెలలు కురిపిస్తోంది. ఎక్కడో ఆకాశంలో కాదు, ఇసుక దిబ్బమీద కొబ్బరిచెట్టు మొదట్లో.

"తెల్లటి చీర వెన్నెలలా ఉంది. కాదు, వెన్నెల తెల్లచీరలా వుంది" అన్నాడు తికమకగా.

సుహాసిని ఊరుకుంది. చిన్న నవ్వు ఆమె పెదవులమీద విరిసింది.

"నవ్వకండి, చంద్రుడు సిగ్గుపడి దాక్కుంటాడు."

ఇదేం ధోరణి అన్నట్టు సుహాసిని అతనివైపు చూసింది. ఆ చూపులు తూపులై అతని హృదయంలో గుచ్చుకున్నాయి. ప్రకృతిలో ఎక్కడో వేణువు ఎవరో ఊదుతున్నట్టుగా, కోకిల తీయగా పాడుతున్నట్టుగా అనుభూతి పొందాడు.

"సుహాసినీ!" అన్నాడు.

"పొద్దుపోతోంది, పదండి" అందామె.

మూర్తి కదలేదు. పొంగిపొంగి పొర్లే ఏరు వైపూ, వెన్నెల కురిసే శశి బింబం వైపూ, సుహాసిని అందాలవైపూ చూస్తూ యేదో మధురానుభూతి పొందుతున్నాడు.

ఏరు గట్లుదాటి విచ్చలవిడిగా పొంగి యధేచ్ఛగా విహరిస్తున్నట్టుగా అతని మానసాకాశంలో దృశ్యం కనిపించింది.

సుహాసిని అడుగు ముందుకేసింది. తటాలున ఆమె చెయ్యి పట్టుకుని ఆపాడు. ఆమె అదిరిపడ్డది.

"వదలండీ" అంది భీతితో.

"సుహాసినీ" అన్నాడు కోరికగా.

"వదలండీ" అందామె గాద్గదికంగా.

"ఉహూ!"

ఆమె విడిపించుకోసాగింది. ప్రకాశంపాటి చెయ్యిని తను: పెంకెగా, బలంగా ఆమెను దగ్గరికి లాక్కున్నాడు

చలించే ఆమె అధరాలని చుంబించటానికి తీపంపాడు.

చెంప ఛెళ్ళుమంది

మరుక్షణంలో సుహాసిని అతనికి గజం దూరంలో రొప్పుతూ నిలబడ్డది.

"ప్రకాశం మూర్ఖుడు. పశువు. రెండు చెంపలూ ఛెళ్ళుమనేదాకా వదల్లేదు. మీరు మంచివారే కాని.... కాని.... క్షమించండి" అని గాద్గదికంగా, గబగబ అనేసి సుహాసిని గిరుక్కున వెనక్కి తిరిగి చరచర వెళ్ళిపోయింది.

మూర్తి నిశ్చేష్టుడై ఆమె వెళ్ళినవైపే చూడసాగాడు.





# పట్టుచీర — తారకరామారావు

"ఏమండీ ? మీకోసం ఎవరో, కార్లో వచ్చారండి!"

కుర్చీలో కూర్చుని బియ్యంలో రాళ్లేరుతున్న జానకిరామయ్య, చేట పక్కన పెట్టి, ఎవరా అని గుమ్మంలోకి వెళ్లాడు.

క్రిందఇంటివారబ్బాయి వెళ్లాడు. నడివయస్సు స్త్రీ నవ్వుతూ నిలబడివుంది మెట్లమీద!

జానకిరామయ్య ఆమెనే చూస్తూ నిలబడ్డాడు ఆ వచ్చిందెవరో, గుర్తురాక!

ఆ వచ్చినావిడ, గాగుల్స్ తీసి, "ఏమిటీ? ఇలా మెట్లమీదే నిలబెట్టి చూస్తున్నారు. నేనెవరో గుర్తుకు రాలేదా?" అనంది.

"రండి!" జానకిరామయ్య లోపలకు దారితీశాడు. ఆమె అనుసరించింది.

కుర్చీ ముందుకు నెట్టి, "కూర్చోండి" అన్నాడు, తను నిలబడి!

ఆమె కూర్చోబోతూ "ఇంతకూ నేనెవర్నో గుర్తుపట్టారా?" అనంది.

జానకిరామయ్య తలొంచుకున్నాడు.

"సుజాతను!" ఆమె చెప్పింది.

అప్పుడు తలెత్తి, ఆమెను చూశాడు నింపాదిగా! చూసి, "చాలా ఏళ్లయింది చూసి! అందుకే గుర్తుకు రాలేదు!" అన్నాడు, సంజాయిషీ చెబుతున్నట్లు.

సుజాత కూర్చున్న చోటునుంచే ఇల్లంతా పరిశీలించసాగింది.

ముని ఆశ్రమంలా ఇల్లు, పొందికగా తీర్చిదిద్దినట్లుంది ఓ ప్రక్కన స్టీలుబీరువా చిన్నది. దానిపై రేడియో, ఆ రేడియో పై రెండు లంబాడీ బొమ్మలు. ఆ ప్రక్కనే

జుత్తంతా నెరసి, తాటికాయలా వుంది. పిప్పి దవడలు అగాధంలోంచి మిణుకు మిణుకుమనే మిణుగురు పురుగుల్లా కళ్లు. ముక్కుమీద కళ్లజోడు గీచిన నల్లని ముద్ర. గుండెలమీద నెరసిన వెంట్రుకలు, వాటిని కప్పుతూ పల్చాటి ఖద్దరు బనీను. దాని జేబులో బీడీలకట్ట, మాసిన లుంగీ!

ఆ రూపం చూసిన సుజాతకు జాలి వేసింది. కళ్లు చెమర్చాయి.

"మీరు చాలా మారిపోయ్యారు" అంది గోడకున్న ఫోటోలో, యువకుడుగా వున్న జానకిరామయ్యను చూస్తూ.

జానకిరామయ్య మరీ ముడుచుకు పోయ్యారు, దొక్కలో దెబ్బతగిలిన వాడిలా!

అవతల గదిలో, వాకిలికి ఎదురుగా వున్న [illegible] గిన్నెలో నీళ్లు మరిగి, మూతను [illegible]త్తివేస్తున్నది.

"నీళ్లు కాగింది" అంది సుజాత

జానకిరామయ్య మాట్లాడలేదు. విన్నాడో లేదో [illegible] తెలియకుండా వున్నాడు.

సుజాత, ఆర్ద్రమైన కళ్లు వత్తుకుంది పమిటతో. [illegible] దోపు కుని, [illegible] ఐల్లు మీదున్న [illegible], జానకిరామయ్య కుర్చీ దగ్గరకి వెళ్లి, "ఈ పూట నేవండి పెడతాను: ఏం" అంది. అని సమాధానం కోసం ఎదురుచూడకుండా వంటగదిలోకి వెళ్లింది.

జానకిరామయ్య చేష్టలుడిగినవాడిలా కుర్చీలో పడుకున్నాడు.

క్రింద ఇంటివారబ్బాయి వచ్చి, "ఏమండీ మీ యింటికొచ్చినావిడ కారు దగ్గర పిల్లలు చేరి గొడవచేస్తున్నారండీ!" అని చెప్పాడు.

సుజాత, కడుగుతున్న బియ్యం అక్కడ పెట్టివచ్చి, "చూడు బాబూ! కారుడ్రైవరుతో అమ్మగారు ఈ పూట ఇక్కడే వుంటారుట! సాయంత్రం కారు తీసుకురమ్మన్నారు అని చెప్పు" అని చెప్పింది. కుర్రాడు వెళ్లిపోయాడు.

"మీ వంట్లో బాగుందా ?" అనడిగింది జానకిరామయ్యను.

"ఊ" అని మూలిగాడు.

"సర్లేండి". మీరు లేవకుండా పడు కోండి! అయిన ఆలశ్యం ఎలాగూ అయింది. ఎసరు తీసి కాఫీ కలుపుకు వస్తాను. ఆ తర్వాత స్నానంచేసి వంట చేస్తాను." అని చెప్పి సుజాత లోపలకు పోబోయి, ఆగి. "అవునూ! పిల్లలు...."

జానకిరామయ్య సుజాత కళ్లలోకి సూటిగా చూసి, "బాబు గల్ఫ్‌కంట్రీస్‌లో వున్నాడు. కమల, మద్రాసు వెళ్లింది!" అన్నాడు.

"దేనికి ?"

"ఐ.ఏ.యస్. పరీక్షలు వ్రాయటానికి!"

"పెళ్ళి చేసుకోదా ?"

జానకిరామయ్య మాట్లాడలేదు.

సుజాత క్షణకాలం, జానకిరామయ్య మాట్లాడుతాడేమోనని ఎదురుచూసింది. ఆయన మాట్లాడడని నిశ్చయించుకుని, అక్కడినుంచి వెళ్ళింది.

గిన్నెలో నీళ్ళుతీసి, ఫిల్టర్‌లో కాఫీపొడి వేసి, నీళ్ళు పోసింది. స్టౌ వెలిగించి, సబ్బు, టవల్ తీసుకువెళ్ళి స్నానం చేసింది. చేశాక, ఏం గుడ్డలు కట్టుకోవాలీ అన్న ఆలోచన వచ్చి, చీర చుట్టుకుని, తలకు టవల్ చుట్టుకొని వచ్చి "అమ్మాయి చీర వుంటే ఇవ్వండి!" అంది.

బీరువా తాళంచేతులిచ్చేశాడు జానకిరామయ్య. నేతచీరలన్నీ ఉతికి మడతలు పెట్టి వున్నాయి బీరువాలో! ఒకే ఒక్క పట్టుచీర చాలా పాతదుంది! సుజాత ఆ చీర తీసింది. కలరాపుండల వాసనతో కంపుకొడుతున్న ఆ పట్టుచీర కట్టుకుంది సుజాత!

"ఆ పాతచీర ఎందుకు కట్టుకున్నావ్!" అన్నట్లు చూశాడు జానకిరామయ్య, విస్తుపోతూ సుజాతను.

సుజాత తలొంచుకుంది. తల అట్టిపెట్టుకుంటూ "దాన్ని చూడగానే కట్టుకోవాలనిపించింది" అన్నది. అంటుండగా ఆమె గొంతు గద్గదమైంది.

జుత్తు ముడివేసుకుని, ఓసారి అద్దంలో చూసుకుని, కుంకుమతీసి నుదటన పెట్టుకుంది.

"మీ ఆయన పోయాడని విన్నాను!"

ఆమాటకు సుజాత వణికిపోయింది. కళ్ళనుంచి నీళ్ళు జలజలరాలాయి. పెల్లుబికివచ్చే దుఃఖాన్ని పమిటకొంగుతో, పెదవులనుంచి బయటకు రాకుండా అదుపుకుని, "అవును! ఆయన పోయ్యారు. కాదు నేనే పోగొట్టుకున్నాను," అని తేరుకుని, "అయినా ........ నే ఇంకా పునిస్త్రీనే!" అంది. అంటూ నవ్వింది.

ఆ నవ్వులోకి దృష్టి సారించి, క్షణం తర్వాత తేరుకుని, కాఫీ కలిపి తీసుక వచ్చి, జానకిరామయ్యకో గ్లాసు ఇచ్చి, తనోటి తీసుకుని గడపకానుకుని కూర్చుంది.

జానకిరామయ్య కాఫీ త్రాగి, బీడీ అంటించుకున్నాడు.

"ఏమన్నా కబుర్లు చెప్పండి!"

జానకిరామయ్య నవ్వాడు బోసి నోటితో! "నేనేం చెప్పేది! నువ్వు చాలా వూళ్ళు తిరిగినదానివి. నువ్వు చెప్పరాదూ!" అన్నాడు.

సుజాత మొహం ఆ మాటకు జేవురించింది. "నేరావటం ఇష్టంలేదూ అని చెప్పండి వెళ్ళిపోతాను. అంతేగాని ఇలా మాటలతో కుళ్ళబొడవద్దు!"

జానకిరామయ్య మాట్లాడలేదు. సుజాత అక్కణ్ణుంచి లేచివెళ్ళి, వంటపనిలో నిమగ్నురాలైంది.

వంటంతా చేసి వచ్చేసరికి, జానకిరామయ్య కుర్చీలో నిద్రపోతున్నాడు.

మధ్యాహ్నం పన్నెండయింది. ఆయన్ని లేపి, భోజనానికి రమ్మని చెప్పింది. ఆయన కాళ్లు కడుక్కునివచ్చేలోపల వంటింట్లో పీటవేసి కంచంపెట్టి, వడ్డించి వుంచింది.

"నువ్వు వడ్డించుకోకపోయావా ?" అన్నాడు.

"మీరు తిన్నాక తింటాను !"

జానకిరామయ్య తలొంచుకుని భోజనం చెయ్యసాగాడు.

"మీ ఆరోగ్యం ఎలావుంది ?"

"చూస్తున్నావుగా !"

"మళ్లీ పెళ్లి చేసుకోలేదా ?"

ఆ మాటకు జానకిరామయ్య బెరుకు బెరుగ్గా సుజాత కళ్లలోకి చూశాడు. చూసి, "మళ్లీ పెళ్లి ఎందుకూ ? ఓ అనుభవం అయిందిగా" అన్నాడు. అని చెయ్యి కడుక్కుని లేచిపొయ్యాడు.

సుజాతకు దుఃఖం పొర్లుకువచ్చింది ఉప్పెనలా ! తల గడపకేసి కొట్టుకుని, "పాపిష్టిదాన్ని ! తినేఅన్నం వదిలేసి వెళ్లారు." ఛఛ ! నేనా ప్రస్తావన తేకుండా వుండాల్సింది." అని అన్నది.

సుజాత ప్రవర్తన జానకిరామయ్యకు విచిత్రంగా తోచింది.

"నా తిండేమంత ! దానికి బాధపడకు. నువ్వు అన్నం తిను !"

"అంతా నా పాపఫలం అండీ. మిమ్మల్ని బాధలతో లేపి నేను తిన లేనండీ !"

"నా నొసట ఇలా వ్రాసిపెట్టివున్నది. ఆ సంగతి నీకు తెలియదా !" అన్నాడు.

"అంటే ?"

"నువ్వు అన్నంతిని నా చెబుతాను !"

"కాదు చెప్పండి ! అదేదో ఇదేదో తేల్చుకోటానికి వచ్చాను !"

"చూసిపోతా వనుకున్నాను !"

"కాదు వుండిపోదామనే వచ్చాను."

"సరే ! నన్నుగూడ ఆలోచించు కోనీ !"

"మీ నిర్ణయం తెలిపేదాకా అన్నం తినను." సుజాత కొంగు పరచుకుని పడుకుంది.

జానకిరామయ్యకు ఏం చెయ్యాలో తోచలేదు క్షణం.

లాల్చీవేసుకుని, చెప్పులు తొడుక్కుని, "నేనలా వెళ్లివస్తాను. వచ్చాక నా చరిత్రంతా చెబుతాను !" అని తలుపు దగ్గరకువేసి వెళ్లిపోయాడు.

సుజాత అలాగే పడుకున్నది, గత వర్తమానాలు కళ్లముందు తిరుగాడు తుండగా అలాగే సొమ్మసిల్లి నిద్ర పోయింది.

మళ్లీ మెలకువ వచ్చేసరికి, ప్రొద్దు పడమటకు జారింది. వళ్లంతా చెమ్మట వల్ల చిమచిమలాడుతోంది. కప్పుకున్న చీర కొంగు, వేసుకున్న జాకెట్టు తడిసింది. లేచివెళ్లి పన్నీళ్లతో ముహం కడుక్కు వచ్చింది. అప్పుడు దిళ్లమీదున్న ఉత్తరం చూసింది.

జానకిరామయ్య దస్తూరీపోల్చుకుంది. ఆకలి గూడ మరచి ఉత్తరం ఆత్రంగా చదివింది.

## 2

"సుజాతా!

నా పెళ్లాం లేచిపోయింది.

ఎందుకో తెలుసా.

పెళ్ళయ్యేసరికి నాకు ఉద్యోగం లేదు, అందమైన భార్య తప్ప. ఆ భార్యకు అందమేకాదు కోరికలూ వున్నాయి. అవి అర్థం చేసుకోని భర్త, అర్థంచేసుకున్నా వాటిని తీర్చలేని అసమర్థతా కూడ వున్నది.

అయినా ఆ భర్తవల్ల పిల్లల్ని కన్నది. అయినా ఆమె కోరికలు తరగలేదు. అసంతృప్తి, అయోగ్య బ్రతుకు అడవిన పూచిన పువ్వు, యౌవ్వనం కాలానికి బలి అవుతున్నాయన్న ఆవేదనా ఎక్కువవుతున్నాయి.

నాకు ఉద్యోగం వచ్చింది మున్సిపాలిటీలో టీచరుగా. గొర్రెతోక, కనుబొమలమీది వెంట్రుకలు, నాజీవితం ఒకటేనని నా భార్య తెలుసుకున్నది. బస్తీనాపురంలో మరిన్ని కష్టాలు, ఆకలి బాధలు కాక, పట్టణాల రంగురంగుల దీపాలు, కోరికలు తీర్చుకునే అవకాశాలు కూడా కనిపించాయి. ఆశలకు రెక్కలొచ్చాయి. ఊహలకు రూపాలు ఏర్పడ్డాయి.

మా యింటి ఎదురు కంట్రాక్టరుకు భార్యాపిల్లలూ వున్నారు. ఓ కారుంది. రెండు లారీలు, ఓ మేడ, పరిజనమూ, పనిమనుషులూ వున్నారు. బ్యాంకులో లాకర్లున్నాయి. మరో స్త్రీని చేరతీయగల నేర్పు, అవసరమూ, అవకాశము వుంది. నా భార్య అతని నీడన చేరింది.

సుజాతా! నేను అసమర్థుణ్ణి. ఆ సంగతి మరువకు. మంగళసూత్రం కట్టే నాడు తలొంచుకున్న భార్య, జీవితాంతము నా ముందు తలెత్తదనీ, అగ్నిసాక్షిగా నావెంట ఏడడుగులేకాదు, ఏడేడు జన్మలకూ నావెంటనే వుంటుందన్న భావనగల అసమర్థుడను. పిల్లల్ని కన్న తల్లి, ఆ పిల్లలకోసమన్నా, కొంపలో కోరికలు చంపుకుని కాపురం చేస్తుందన్న మూఢనమ్మకం కలవాణ్ణి!

భార్య లేచిపోయి, ఎదురింటి మేడమీదనుంచి, నా జీవితాన్ని రోజూ చూస్తుందన్న ఆలోచన రాగానే, నాలో పౌరుషం వచ్చింది. రెండేళ్ల బాబునీ, ఆర్నెల్ల పాపనూ తీసుకుని వెళ్లిపోయాను మున్సిపాలిటీకి దూరంగా! ఆనాడు నాకు గమ్యంలేదు, పౌరుషం తప్ప. డబ్బు లేదు పెళ్ళాం లేచిపోయిందన్న పేరు తప్ప.

బాబు 'అమ్మా' అంటూ ఏడిచాను. పాప గుక్కపట్టి పాలకోసం ఏడిస్తే, ఎండిన నా గుండెల్లో పొదివిపట్టుకుని, దానితోపాటు ఏడ్చానుదేవగానివితనానికి!

రాత్రింబవళ్లు గడిచిపోయ్యాయి. నా బిడ్డలకోసం, వీధిలో నిలబడి మాదాకవళం తల్లీ' అని గొంతెత్తి ఆక్రోశించాను.

"ఏద్దులా వున్నావ్! ఇదేం తీపరం! ఏదన్నా పనిచేసుకోరాదా!" అన్నాడో ఇల్లుగలాయన.

"బాబూ! పని ఇప్పించండి చేస్తాను" అన్నాను.

"ఏంచేస్తావ్ ?"

"పిల్లలకు పాఠాలు చెప్పగలను!"

"అయితే సరే! మా పిల్లలకు పాఠాలు చెప్పు" అని దాసయ్యగారు అన్నారు. ఓ గూడు ఇచ్చాడు. కూటికి లోపం లేకుండా చూశాడు.

నేను అసమర్థుణ్ణే కాని, కుక్కకన్నా విశ్వాసం గలవాడని. దాసయ్యగారిని కుక్కలా విశ్వసించాను. ఆయన ఓ సంవత్సరం తర్వాత ఆ వూరి బళ్లో మేష్టరుగా ఉద్యోగం ఇప్పించాడు. నా ఆర్నెల్ల కూతుర్ని, ఆయన భార్య పెంచింది కన్నతల్లిలా.

నేను నిమిత్తమాత్రుణ్ణి. అలా మిగిలాను. నా మంచిచెడ్డలు, బాగోగులు, బిడ్డల భవిష్యత్తు అన్నీ దాసయ్యగారి అజమాయిషీలో జరిగాయి.

[illegible]బాతా !

బాబుతో నాకు ఇబ్బంది లేదు. మొగవాడు గాలికి పెరిగాడు. కానీ పాప! ఆడపిల్ల, దానికి పెళ్లిపోయ్యడం జత వెయ్యడం, ఆఖరికి పెద్దమనిషైతే .... నాకేం తెలుసు! ఏం చెయ్యగలను. అప్పుడు నాకు భార్య గుర్తుకొచ్చేది. కళ్లెంట నీళ్లు తిరిగేవి. దాన్ని చూసి, ఎన్ని రాత్రులు ఏడ్చానో, ఆవేదనలో కాలి భస్మమైనానో తల్చుకుంటే ఈ నాటికి భయం వేస్తుంది

"నాన్నా అమ్మేదీ?" అని అడిగే వారు పిల్లలు! ఏడ్చేవాడిని. నా ఏడుపు చూసి పిల్లలు ఆ మాట మళ్ళీ అడిగే వారు కాదు. చెరో ప్రక్కనా పడుకోపెట్టుకుని, వాళ్లను నిద్రపుచ్చేవాడిని. నా కొకటే ధ్యాస! అమ్మలేని లోటు ఎలాగూ తీర్చలేను. కానీ అయ్యా పెంపకంలో వాళ్లు చెడిపోగూడదు. అయ్యో మా అమ్మే వుంటే? .... అన్న తలంపు ఏ నాడు వాళ్లకు రాగూడదు. వచ్చి, వాళ్ల జీవితాల్లో బాధ, ఆవేదన ఏర్పడగూడదు. అంతే! అదే నా ఆలోచన! నా ధ్యేయం! ఒక విధంగా నాస్వార్థంగూడ.

నా భార్యపోయ్యాక, నా జీవితమంతా ఎడారిలో నడక. ఆ జీవితపు ఎడారిలో బాబు, పాప రెండు పుష్పాలు. ఆశా దీపాలు.

దాసయ్యగారు కలిగినవారు కాకపోయినా, కనికరం గలవారు. నా పిల్లవాని ఇంజినీరింగ్ చదువుకోసం, ఆయన ఊళ్ళో చందాలు పోగుచేశారు. అది ఆయన మంచితనం! ఆయన భార్య, నా కూతురుకు నానమ్మ అయింది. అయి "కమలా! మీ నాన్న శాపగ్రస్తుడు. కానీ

వచ్చేలుడు. మీ ఇద్దర్నీ రెండు కళ్లలా చూసుకుని బ్రతుకుతున్నా డమ్మా. అలాంటి తండ్రికడుపున పుట్టిన మీరు అదృష్టవంతులు . విధి వెక్కిరించినా, కాలానికి కోరికలకూ ఎదురొడ్డి నిలబడ్డ దర్పముల్లు. ఆ తండ్రిని జాగ్రత్తగా చూసుకోమ్మా" అని హితవు చెప్పింది. నడత నేర్పింది. ఆ పుణ్య దంపతుల చలవవల్ల, నేను ఈనాటికీ బ్రతికి వున్నాను. మనిషిగా చలామణీ అవు తున్నాను.

నా కొడుకు ఇంజనీరు. అదొక గర్వం నాకు.

నా కూతురు చదువుల సరస్వతి.

ఇంతకన్నా నా కేంకావాలి!

కోరికలు కాలచక్రంలో నసి పొయ్యాయి.

వయస్సు, ఆరోగ్యం, కంటిచూపు, క్షీణించాయి.

నాకు మిగిలింది, కోరుకోవాల్సిందీ ఏమీలేదు, అనాయాస మరణం తప్ప. దానికోసం ఎదురుచూస్తున్నాను.

రిటైరై నాలుగేళ్లు.

సుజాతా ఇది నా జీవితం!

నా భార్య నన్నొదిలి వెళ్లి ఇరవయొక్క సంవత్సరం.

ఇంతవరకు, నా పిల్లలకు తెలియదు, వాళ్లమ్మ బ్రతికేవుందని. వాళ్లకేమిటి నాకే తెలియదు. తెలిస్తే, వాళ్లెలా భావి స్తారో గూడ నే నూహించలేను.

అంతవరకెందుకూ, నేనే నిన్నుచూసి కలకాదు గదా అని భ్రమపడ్డాను. మర్చి పోయిన బంధాన్నీ, మమకారాన్నీ ఎందుకు గుర్తుకుతెచ్చుకున్నావా అని భయపడ్డాను.

ఎందుకంటే, నేను అసమర్థుడిని. అంతే కాదు భయస్థుడను గూడ! నేను ఇన్నాళ్లూ ఎంతో ఖర్చుతో కట్టుకున్న పిచ్చుకగూటిలోకి నువ్వెందుకువచ్చావు? అన్న భయంతో వున్నాన్నేను. నా పిల్లలేమవుతారో అన్నభయం, నాశేషజీవితం ఏమవుతుందీ? అన్న ప్రశ్నకు నాకు సమాధానం దొరకటంలేదు.

నీయిష్టం. బాబూ, పాపా నీకూ పిల్లలే! వాళ్లపై నీకూ మమత, అనుబంధం, అధి కారం వున్నాయి. కాదనేశక్తి నాకు లేదు.

నీయిష్టం సుజాత! నువ్వుండదల్చు కుంటే వుండిపో! కానీ పిల్లలొచ్చి 'మానాన్నేడీ?' అనడిగితే?

'మాఅమ్మేదీ?' అంటే

'చచ్చిపోయింది అని' నేను చెప్పా ఓనాడు. ఆ సమాధానమే వాళ్లకు చెప్పు!

శలవు

జానకిరామయ్య

**3**

సుజాత ఉత్తరంచదివి శూన్యంలోకి చూస్తూ ఉండిపోయింది. అలా చూస్తుండగా ఆ శూన్యంలో ఆమెకి జానకిరామయ్య శవం కనిపించింది. ఆ

తర్వాత ఓ సుందరమైన రూపం గోచరమైంది. ఆ రూపానికి ఇరవైఒక్క సంవత్సరం. పేరు కమల!

"నువ్వెవరూ?" అనడిగింది కమల సుజాతను చూస్తూ, అసహ్యంగా!

"మీ అమ్మను."

"ఛీ. మా అమ్మ ఏనాడో చనిపోయింది!"

"కాదమ్మా. బ్రతికేవున్నాను!"

"అయితే నువ్వు మా అమ్మవు కానే కావు. బ్రతికుండి మమ్మల్ని అనాథలుగా చేసిపొయ్యావంటే ఇన్నేళ్లు మేము, కడుపున పుట్టిన బిడ్డలు గుర్తుకు రాలేదంటే నువ్వు తల్లివేగాదు! నీలాంటి తల్లి మాకొద్దు" కమల అసహ్యమై పోయింది కళ్లముందునుంచి.

సుజాత ఆ ఇల్లంతా ఒక్కసారి పరిశీలించింది. మునిఆశ్రమంలా వున్న ఆ ఇంట్లో తనకు స్థానంలేదని తెలుసుకుంది. నిశ్చయానికొచ్చింది. గడప దాటబోతూ వెనక్కొచ్చి జానకిరామయ్య వ్రాసిన ఉత్తరం తీసుకుంది.

ఓ చిన్న కాగితంమీద, "వెడుతున్నాను. మళ్లీ రాను. మీరు అంగీకరిస్తారని భావిస్తూ, పెళ్లినాటి పట్టుచీర తీసుకెడుతున్నాను. అది మీ భార్య జ్ఞాపకచిహ్నంగా మీరు భద్రంగా దాచుకున్నారు గదూ! కానీ నాకొక్క కోరిక మిగిలిందండీ.... పెళ్లినాటి పట్టుచీర కట్టుకు చచ్చిపోవాలని. అందుకే తీసుకెడుతున్నాను" అని వ్రాసిపెట్టి.... వెళ్లిపోయింది.






(గత సంచిక తరువాయి)

ఆ తరావాత ఆ బాబులిద్దరూ మాటలు మానేసినారండి.

ఇద్దరిమిద్దెనీ - ఐసుముక్కోడితే అగ్గి నిప్పు అయిపోయాదండి

ఇక్కడ అనిన మాట అక్కడా - అక్కడ అనవిమాట యిక్కడా మోపే తారుపుగుల్లగోళ్ల ఎక్కువై పోనారండి.

దేవనోడికి యీ కుంటమ్మ శేరు బియ్యం ముట్టేస్తే, ఆయమ్మ కుంచెడు కొలువ్వాలసిందేనండి.

ఎలక్షన్లో ఇటు మొగుడు నిల్చుంటే - అటు పెళ్ళాం నిల్చుంటాదన్నట్టై పోనాదండి ఊరు.

యీడికీ - ఇంటికీ - రెండేసి పారిటీలండి.

ఇవతల పారిటీవోడు అర్ధరేత్రిరికాడ నల్లిని జంపితే-అర్ధరేతిరే అవతలపారిటీ వోళ్ళకి తెలిసిపోయీదండి.

మా బాబులిద్దరూ ఏకంగా ఉన్నప్పుడు ఒక్క-పాలివొచ్చిన ఎమ్మెల్లే - వోడానికి మూడుసుట్లు రావడం - యీ సుట్టు బుచ్చిబాబు యింటికాడ దిగితే-మలిసుట్టు మా బాబింటికాడ దిగడం పేరంభించినాదండి.

ఇంక సమితి పెసిడెంటు సరేసరి - సంకురేత్తిరిటయాంలో జంగం ముష్టోడిలా రోజూ తెల్లారీసరికి తయారై పోయీవోడండి.

యీలోపల "నామినేసన్ల టయాం" వచ్చినాదండి.

"సేపలోళ్లు ఎగేనెష్ట
సినీమాహాలోడు ఎగేనెష్ట
కిరాణావోడూ
కిల్లీకొట్టువోడూ ఎగేనెష్టే
హిందువులెగెనెష్ట
మనకి యింక మిగిలిందెవరు?
తురకోళ్లూ - మాదిగోళ్లూ"

అన్నట్టైపోనాదండి బుల్లిబాబుగోరి పారిటీ.

"మరంపేత మనం గెలవాలా అంటే కొంత కరుసౌద్ది" అన్నారండి మాపారిటీ వోళ్లు.

"బంగపడి బతిమాలకుంటే-ఓటర్లని-బతిమిలాడతాను. సిలకకాదు - కోళ్లకు సెప్పినట్టు సెప్పమంటే నచ్చజెప్తాను గాని కాణీ కరుసెట్టమంటే మాత్తరం-ఎలక్సనూ - ఊరూ రెండూ ఒగ్గేసుకు పోతాను గాని కరుసుమాత్తరం పెట్టను. యిది కచ్చితం" అనీసినాడండి బుల్లిబాబు మాత్తరం.

"ఓసోస్!" కరుసుపెట్టని పెతీ కక్కు-రితిముండాకొడుకా అనేమాటే ఇది - మాయజేసి వోట్లెయించీసుకుని - మోటుసైకిలెక్కి తిరగమంటే - బుల్లిబాబేగాదు - మొగుడొగ్గిసిన ముండ కూడా జేస్తాది - ఆ పని -

యుద్ధంలో గుండు పేల్చడం
ఎలక్సన్లలో డబ్బు ఎదజల్లడం
మొగోడిపని.

డబ్బైపోద్దని మాసంకూసీసి-గాంధీ గోరి వోరసుడ్ని అని సెప్పుకు తిరిగే కక్కు-రితిగోడు బుల్లిబాబు.

అంతడబ్బు కరుసుపెట్టలేనోడు - అడూ - ఆడిపారిటీవోళ్లూ - తోకలు ముడిసేసికొని - తొంగోవొచ్చుగదా. కొసకే నిలబడ్డం దేనికి?

మూడు వోట్లు తెచ్చుకొని-ముండిలా-ముసుగేసుకొని - తొంగోడం దేనికి?

అసిస్టే నా కన్నా ఎక్కు-వుండొచ్చు. కరుసు మాత్తరం - నా నెత్తిమీద పందు

ఎం[టుక పీకి —యిసు ర్తే-అది బుల్లి బాబుకంటె ముప్పైవరెట్లు కరుసుపెట్టు కొాస్తాది.

నా దగ్గర సెప్పక యీడి సీతికబుర్లూ-గాంధీ కబుర్లూను.

అస్తమానం తీస్తే పెట్రోలై పోద్దని జెప్పి - ముప్పైపన్లు మోషఅయితేగాని తీసీవోడుకాడు మో[టస్సైకిలు.

ఓపాలి - సెప్పుకుంటె సిగ్గుజేటు - సిటీలో - సినీమాకెళ్దారన్నయ్యా అంటే యేటన్నాడో - యెరికా ? మేడ టికెట్టెందుకు ? — కింద టిక్కెట్టు కెళ్దాం అన్నాడు - ఆ సిగ్గు ఎళ్లేక నాను సినీమాయే మానేసుకున్నాను.

కాఫీహోటేలుకెళ్తే - కరుసైపోద్దని జెప్పి-సల్దన్నం తిని - ఎళ్లేవాడు కాలేజీకి-

కరుసు లెగ్గొట్టడానికే - యీ గాంధీ కబుర్లు !

అతగోడే గాంధీగారి శిష్యుడైతే - గాంధీగారినాగ ఎలకన్నకి నిల్చోడం మానీమను-గాంధీగోరు ఎప్పుడన్నా ఎలకన్నకి నిల్చున్నాడా ?

కాని ఒక్క యిసయం ఒప్పుకోవాల-గాంధీగోరికీ మా అన్నయ్యకీ ఒకటే పోల్తి.

గాంధీగోరు తనకి ఉత్తరం వాస్తే - దాని అల్పి (గుండుసూది) తీసి దాచీసీవోడట. అదిగో - ఆ కక్కుర్తి మాత్తరం మనోడి కొచ్చినాది.

"నాహూ మంగలోడే శవరం జేస్తాడు, నెహూరుకీ మంగలోడే జేస్తాడు.అంచేత నానూ, నెహూరూ ఒకటే అన్నట్టుంది మనోడి యవ్వారం." అని బుచ్చిబాబు అన్నాడటండి.

దానికి మరో ముప్పై ముతకమాటలు కలిపి మరీ జేరేసినారండి- బుల్లిబాబుకి.

ఆ బాబు అసలే పులిలాటోడు.

అయితే తపస్సులో వున్న పులిలా గుండేవోడు యిన్నాళ్ళ.

కాని యీ సెప్పుకుమాటలు యిన్నాక పిచ్చెత్తిన పులినాగ అయిపోనాడండి.

యింకేటుంది మరి ?

స చులుకి మూతులు కోసినాడు.

డబ్బు యిరజిమ్మేసినాడు.

ఆ ఎలకన్ను యిచ్చి[తాలు - ముప్పై రోజులు హరికద చెప్పొచ్చండి! రాసుకుంటే - ముప్పై శాస్తకాలు అవతాయ్!

మరంసేత అయ్యన్నీ సెప్పను - గానండి - ఒక్కటి మాత్తరం సెప్పక తప్పదండి.

రెండు పారిటీల ళ్లూ సెరో మాల నెంబర్ని నిల్చోబెట్టినారండి.

కాని "మాయలపకీరు"గోడని-అదూ నిలబడ్డాడండి- అదు ఏ పారిటీకి సెందదండి-సొంతంగా నిలబడినాడండి. మరే వార్డులోనూ - మూడోవోడు నిలబళ్ళేదండి.

ఆ మాయలపకీరుగోడ్ని రెండు పార్టీలవోళ్లూ "త్[డా" అయిపోమన్నారండి.

పో : పొమ్మన్నీసినాడండి అడు. దబ్బిస్తాం అని ఆశ జూపినారండి.

"నాను గెలిసినాక యింకా యిద్దరు గాసి" అని మొండికెత్తినాడండి.

అ గా డి ద కా డు కు - ఏ మూర్తాన అన్నాడో గానండి-అలాగే ఐనాదండి.

ఎలెక్సన్లు అయిపోనాయండి.

ఇద్దరు బాబులూ గెలిసినారండి.

ఎవురికీ మెజారిటీ రానేదండి.

ఇచిత్తరం ఏటంటే మాలపల్లిలో మాయలపకీరుగోడు గెలిపేడండి.

పరంచేత - అడు దీవించినోడే రాజౌతాదన్నమాటండి.

"దచ్చిన ఇవ్వండే-దేవుడే దీవించడు. నా నెందుకు దీవించాల?" అనడిగానండి - నంజికొడుకు.

యింకేటుందండి?

రెండు పారిటీలోళ్లూ రాయబారాలు అరంబించినారండి - అడితో.

"నాను హైకోరటు జెడిజీలాటోణ్ని-నాను తీరుపుజెప్పేవోరకూ-అంటే పెపిడెంటు ఎలక్సను అయిూవోరకూ నన్నెవురూ కలగూడదు" అన్నాడండి.

అనీసి ఎంటనే బస్సెక్కి- సిటీ ఎలిపోనాడండి.

అడిదసలు మావూరే కాదండి. తల్లిసత్తే తాతదగ్గరికి - అంటే మా ఊరు జేరినాడండి. అయిదో క్లాసు సదివినాదటండి-సిటీలో.

అదు- అడు సిటీ ఎలిపోనాదని జెప్పినానా?

మా ఊర్లో సగంమందిరి అణ్ని ఎతకడాని కెల్లినారండి.అప్పటికే ఎలక్సను కైన కరసులో సగం అడ్ని ఎతకడానికయ్యేటట్టుందండి.

అకరికెలాగైతేనేం - దొరికినాడండి-అడినేస్తం యింటికాడ సిటీలో.

మా పారిటీవోళ్ళు కబురంపినారండి అడికి.

"రేపొద్దున సరీగ్గా తొమ్మిదయ్యేసరికి-కోమలవిలాస్ కాఫీక్లబ్బుకి మీ బాబుని అట్టుకురండి. నానూ వొస్తాను" అన్నాడటండి.

అనక బుచ్చిబాబు పారిటీవోళ్ళకు దాఎళ్ళరని ఇన్నానండి.

మర్నాడు పొద్దున్న- అడు సెప్పినట్టు సరీగ్గా తొమ్మిదికి ఒక బల్లకాడ బుల్లిబాబు - మరో బల్లకాడ బుచ్చిబాబు - మూడో బల్లకాడ మాయలోడు - కూకుని "కాపీలు" తాగి ఎలిపోనారండి.

అలాగేచిపించేసినాడండి - గుంటనంజికొడుకు. మళ్ళీ పట్టుమని పాతికేళ్ళుండవండి-ఎదవకి-.

రెండు పారిటీలనీ యిలాగే రేపు ఎలక్సను అనేవోరకు ఏడిపించి, ముందునాడు దిగినాదండి ఊర్లోకి.

## 19

ఎలక్సన్నాడు - బోర్డు ఆపీసుకాడ - ఊరు ఊరంతా యిరగపడిపోనాదండి.

పోలీసులొచ్చినారండి.

రిజర్వోళ్ళండి-

మామూలోళ్ళండి.

"ఆర్డీవో" అంగి.

అంతా కిష్టతులబారం నాటకంనా గుం దండి.

తులసికొమ్మ ఎటుపడితే తాను అటు మొగ్గుద్దండి.

కొమ్మా - సెట్టూ ఆ మాయలోడి సేతుల్లో వున్నాయండి.

ఎలకన్నను మూడుగంటల ముందు జేరీసినారండి నెంబర్లు-సపోర్డర్లూ-డబ్బు తినేసినోళ్ళూ-తినదల్చుకున్నోళ్ళూ-అంతానండి.

అడా-మొగా

ముసలి-ముతకా కూడా జేరినారండి.

సపోర్డర్ల కేకలండి.

పోలీసోళ్ళ గావుకేకలండి.

సంటిపిల్లల ఏడుపులండి.

సెప్పడం మరిసిపోన్ను బుల్లిబాబూ, బుచ్చిబాబూ యిద్దరేనండి నిలుసున్నది - పెసిడెంటుపనికి-

ఎవురి మెళ్లో పట్టపు ఏనుగ దండే స్తాదో ఎవరికీ తెలదండి.

ఆయేళ - అడు యిద్దరనెగ్గానే తాన్న వాదినాదండి.

ఎవుడెళ్ళినా "దేవుడు పెత్తక్షం అయినా దెయ్యం ఒగ్గనేదవి ఏటి మీ గోల?- నాను దేవుడితో మాట్లాడ తన్నాను. మళ్ళీ పలకరించినారంటే పీక్కొరి కేపేది దేవుడు కాదు, నాను. ఎల్లెల్లు" అవి తగిలేసినాదండి ఎవుడెల్లినా.

అలాటోడు సమంగా ఎలకన్నను టయానికి దిగబడినాదండి.

యిజయనగిరం మారాజుకి తోవిచ్చినట్లు - తోవిచ్చినారండి - ప్రెజా- పోలీసులూ-కూడా.

ఎలకన్నను మొదలైందండి.

బుచ్చిబాబు పేరు ఎవుడో బొనన్నాడండి.

మరోడు "సెకండ"న్నాడండి.

బుల్లిబాబు పేరు ఒక మెంబరు బొనన్నాడండి.

మాయలోడు నెగిసి "సెకండ"న్నాడండి.

అంతేనండి.

సెకండనవేసిన సుబ్బారావు గుడ్లు తేలేసినాడండి. అడు ఓటెయ్యకుండానే పేనాలొగ్గెస్తాదేటో ననిపించేసినాదండి నా మట్టుకు - నాకు.

మాయలోడు, బుల్లిబాబుని ముద్దు పెట్టుకోనెయ్యనేదండి - - బుచ్చిబాబు పారిటీవోళ్ళని సంపినివ్వనేదండి- ఎవరా? - పోలీసోళ్ళండి.

బుల్లిబాబు గెలిసినాడండి.

దండ వేయించుకున్నాడండి.

దణ్ణాలు పెట్టించుకున్నాడండి.

దండయాత్ర కెల్లినట్టు ఊరేగినాడండి.

ఆ రేత్తిరి - వొచ్చిన పోలీసోళ్లకి - ఆఫీసర్లకి డిన్నరిచ్చినాడండి.

వొచ్చిన మాలోళ్లకీ, కూలోళ్లకీ సంత ర్పణ జేసినాడండి.

సంతర్పణ కొచ్చినోళ్ళలో బుచ్చి బాబుకి ఓటేసినోళ్ళు కూడా ఉన్నారండి- మాలోళ్ళూ-కూలోళ్ళూ కాదండీ-

అరవయ్యోరి ఏట అన్నప్రాశన అయి నోళ్ళలా తింటున్నారండి జెనం.

ఇంతట్లోనుండి- పందిట్లోకి ఒక్క సారి యెర్రటి యెలుగొచ్చినాదండి - ఎంటనే ఎదుళ్ళ సప్పుడు యినిపించి నాదండి.

యింకేటుందండి?

ఎక్కడి వొణ్ణాలు అక్కడే ఒగ్గిసి పరిగెత్తినారండి కూలోళ్ళూ - మాలో ళ్ళూను.

అళ్లిళ్ళు తగలడ బోతన్నాయండి.

అప్పుడు అరంబమైందండి ఊరు తగులద్దం.

సరి అరనేదండి. పకీరుగోడిల్లు కూడా కాలిపోనాదండి.

## 20

మాలపేటంతా మసై పోనాదని సెప్పి నాను గదండీ మర్నాడు మావోళ్ళే పోలీసురిపోర్టు యిచ్చినారండి - బుచ్చి బాబు పారిటీవోళ్లే కొంపలు కాలిసేసి నారని.

మా పారిటీవోడే - లచ్చప్పగోడని - అడు గెంజినీళ్లే తాగి బతుకుతాడండి - అడు వణ్ణంతిని ఎన్నేళ్ళో ఐపోనాదండి- మరింక యిప్పుడు వణ్ణంతింటే పడదండి అడికి- అదుగో, అడు సూసేట్టండి- బుచ్చి బాబు పారిటీవోళ్లు కొంపలకి నిప్పు పెట్టడం.

తెల్లారేసరికి-- బుచ్చిబాబు పారిటీ మాలోళ్లు పదిమందిరి ఎరెస్టయిపోనా రండి. మరో ముప్పైమంది పరారీ అయిపోనారండి.

మనలో మనమాటండి- పాపం బుచ్చి బాబు పారిటీవాళ్ల కొంపలుకూడా కాలి పోనాయండి - కాని అగ్గిమాత్తరం మా వోళ్ల కొంపల్లోనే పుట్టినాదండి.

బుచ్చిబాబునికూడా ఎరెస్టుజేస్తారని ఊరంతా గుప్పుమందండి - దానితో అ బాబు ఇంటికి తాళవెఁట్టేసి పెళ్లాంపిల్లత్తో- సుందరామంగోరని- సిటీలో పెద్ద ప్లీడ రండి - అళ్లింటికి ఎలిపోనారండి.

కొంపలు కాలినోళ్లంతా బుచ్చిబాబు ఇంటిమిద పడ్డారండి - కొంపలు కట్టించి యిమ్మని. ఏటిజేస్తాడండి అ బాబు మాత్త రం. కట్టించేదండి. అ ఇళ్లకి మూడు వేలో, నాలుగువేలో అయినాయండి.

ఎలచ్చను కరుసులు ఎంతయినా యనుకుంటున్నారండి?

సెరికో లచ్చా అయ్యేయని ఊళ్ళో పుకారు గానండి- సెరికో పాతిక దాకైందని నా ననుకున్నానండి.

పోలీసు రిపోరటు యిచ్చినారుకదండీ.

మన పోలీసులు తక్కువోళ్లు గాదండి. ముద్దాయి-పాకిస్తాను పారిపోయినా పిల

కట్టుకొని యీడ్చుకొచ్చేస్తారండి - కొంపలు కాలిన మూడ్రోజుల్లో పారిపోయిన ముప్పైమందిర్నీ అట్టుకొచ్చి మూసేసినారండి.

మొత్తం నలభై మందిర్నీ - బెయిలు మీద పీకడానికి - సుంకర్రాముంలాటోడికి --అ బాబు కోరట్లోకి అడుగెట్టినాడంటే నల్లమబ్బూ - నలిపిడుగూ కలిసొచ్చి నట్టుంటాదండి-అలాంటోడికి పదిరోజులు పట్టినాదండి.

ఎరస్తైన నలభై మందిర్నీ బెయిలు మీద యిడిపించినాక — పూలదండ లేసి స్పెషల్ బస్సులో ఊరికి తెచ్చినాడండి బుచ్చిబాబు.

ఆ ఎలకస్సనయినాక ఆయేడే తొలి సుట్టు పంచాయితీ బోరడు మీటింగండి.

మీటింగుకాడి కెల్లడానికి మామూలోళ్ళకి దమ్ముల్లేవండి. అలాగని పనుల్లోకి పోనేదండి-ప్రెజ.

ఆయేళ ఏటో ఒకటి జరుగుద్దని అందరికీ తెలుసండి - ఏటి జరుగుద్దో మాత్తరం దేవుడికూడా తెల్దండి.

ఊరంతా-ఏ అలికిడీ నేకుండా-సావు యిల్లులా సల్లగా ఉందండి.

పొద్దున పది దాటినాదండి-మా వంతా సల్దులు తిని బైలెల్లినావండి - బోరుడు కాడికి-నానండి-మా పారీటీవాళ్లే మరో ముగ్గురండి-మాయలోడండి- మొత్తం ఐదుగురివండి- ' ఏవో ఊసులాడుతూ రచ్చబండకాడికి కొచ్చినావండి.

అంతేనండి.

అట్నుంచి బుచ్చిబాబుకి - పరసురావుడూ-పరసురావుడంటే బుచ్చిబాబు గోరి పారిటీలో మాల నెంబరుగా నిల్చుని ఓడిపోయినోడండి - మరో పదిమందిరి అళ్ళపారిటీవోళ్ళండి వొచ్చినారండి.

బుచ్చిబాబు ఓ పక్కన నిలబడి నాడండి. పగిలోళ్ళంతా మమ్మల్ని సుట్టేసినారండి. ఆళ్ళంతా తాగే ఉన్నారండి. పరసురావుడుగోడు వొళ్ళు తెల కుండా తాగేసినాడండి.

మడిసి తూలిపోతన్నాడండి.

మాట తూలిపోతన్నాదండి.

తూల్తూనే ఎండిపోయిన కాలిసెప్పు తీసినాడండి.

తీసి "ఇటు డబ్బు మెయ్యడం-అటు ఓటు ఎయ్యటవనా? నీతిమాలిన నంజి కొడకా" అని మాయలోడి సెంపమీద సెళ్ళున కొట్టేసినాడండి.

కొట్టగానే కింద పడిపోనాడండి. ఎవుడూ?

పరసురావుడుగోడండి- ఆ పద్దంలో ఆడి బుర్రెళ్ళి రాయికి కొట్టుకొని-సిట్లి పోనాదండి.

సెప్పుమేకు మాయాలోడి బుగ్గమీద గుచ్చుకొని రకతం బొటబొటా కారిపోనాదండి.

మావు కర్రలెత్తినావండి.

కాని "కర్రలు పని యిప్పుడే గాదు రండి" అని వమ్మల్ని బుల్లిబాబు కాడికి

తీసికెళ్ళినాదండి మాయలోడు. ఉన్న దున్నట్టు సెప్పినాదండి ఆ బాబుతో.

అంతేనండి.

ఎంటనే ఆ బాబు మమ్మల్నందర్నీ జీపులో ఏసుకుని అచారిగోరికాడికి సిటీ తీసికెళ్లి పోనాదండి.

అన్నట్టు సెప్పడం మరిసిపోనానండి- మా బుల్లిబాబు అత్తోరింటికాడ్నుంచి ఎలకన్నల కోసరం జీపు అట్టుకొచ్చినాదండి. అనక అది కొనీసినాదండి.

ఆచారిగోడు జెడిజీకోరట్లో ఉన్నారండి బుల్లిబాబు ఆ బాబుని రెక్కట్టుకొని లాక్కొచ్చి సెట్టుకింద నిల్సోబెట్టి - జరిగిందంతా సెప్పినాదండి

అంతా యిన్నాడండి ఆచారిబాబు.

యిన్నాక కుసింత సేపు ఏం మాటాడనేదండి. మావంతా ఆ బాబేటి సెప్తాడోనని అలా బొమ్మల్లా నిల్చుండిపోనావండి.

అనక సెప్పినాదండి ఆ బాబు "పోలీసు కేసొద్దు, ఆళ్లని ఎంతమేపినా, అవతల ప్రకక్క, కతకక్క మా్రును. అంచేత ప్రైవేటు కేసెడదాం - మా జూనియరు రంగనాధాన్ని అంపుతాను - అతగోడు మిమ్మల్ని పెద్దడాక్టరుకాడికి తీసికెళ్తాడు. ముందు సర్టిపికెట్టు అట్టుకురండి. ఎంటనే అర్జీరాపేస్తాను. రేపు దాకలు సేద్దాం" అన్నాడండి.

ఆ బాబు సెప్పినప్రకారవే- మావు సర్టిపికెట్లు అట్టుకొచ్చినావండి. ఎవ్వి పన్నున్నా, అయ్యన్నీ ఎనకపెట్టి అచారిబాబు అర్జీ రాసినాదండి.

బాబూ - ఏమాటకామాటే జెప్పాల కదండీ. ఉన్నదున్నట్టే రాసినారండి. అనక అచారిభాబు ఆపీసులో కెళిపోనాదండి.మావంతా వొరండాలో కూకున్నావండి. రంగనాదంబాబూ - సుబ్రదమ్మగోరూ - అయమ్మ అతగోడి సెల్లెలండి- అయమ్మ మొగుడు సిన్నప్పుడే ముండలు మరిగి యీ యమ్మ నొగ్గేసేడండి - అనక ఏదో రోగంవొచ్చి సచ్చిపినాడటండి - ఆ యమ్మ సక్కగా సదువుకొని ప్లీడరైనాదటండి- అన్నా,సెల్లీ అచారిగోరి అపీసులోనే పనిజేస్తారండి - అళ్లిద్దరూ మా సెలాకీగా సెప్తారండి కబుర్లు - మావు వొరండాలో కూకొని ఆ కబుర్లు యింటున్నావండి.

కొత్త మునిసీబుకి రెండో పెళ్లావటండి - కోరటు అయిపోనాక మాపిటేళ ఆ బాబు యింటికెళ్తే అయమ్మ "నువ్వు కోరటు కంపూ, సెవట కంపూ కలిపి కొడతన్నావు. అంచేత పనైపోనాక కోరట్లోనే స్తానం వాడి వొచ్చేవా సరే, నేకపోతే సువు కిందుండు. నాను మేడ మీదుంటాను" అంటాదటండి. అ యమ్మ పెట్టే బాధలకి జవాన్లంతా స్ట్రైకుజేద్దారనుకుంటున్నారండి. బట్టలుతికినప్పుడు పాతకోక సిరిగినా సరే కొత్తకోక కొనిస్తావా జీతంలో కొట్టీసుకోమంటావా

అంటాదటండి. ఆ బాబు ఉజ్జోగంలో సేరినాక-ఆయమ్మ ఒక్క- కోటన్నా కొన్లేదటండి. అన్నీ జనానుగోళ్ల సేత కొనిపించినయ్యే నటండి.

యిలాగ అళ్లిద్దరూ కతలు సెప్తా వుంటే మావంతా నవ్వుకుంటున్నావండి. ఇంతలో దిగిపోనారండి ఓ జీపునిండా పోలీసులు

ఏటి సంగతని అడిగినాడండి పరిగెత్తు కొచ్చిన ఆచారిబాబు.

"మా అందరిమీనా పరసురాంగోడు పిర్యాదీ యిచ్చేడటండి - మాం- అంతమందిమీ - అడ్ని రచ్చబండకాడ సుక్కేసినావటండి - - బుల్లి బాబు కొట్టమన్నాడటండి - అంతే మాయలోడు కర్రతో బుర్ర బద్దలుకొట్టేసినా డటండి- అదటండి కేసు - మమ్మల్నందర్నీ బుల్లి బాబుతో సహా జెయిలుకి తీసుకుపోతారటండి".

రంగనాదం బాబు సబిన్సపెక్టరుని పక్కకి తీసికెళ్లి మాట్లాడినాడండి. అనక మాకాడ కొచ్చినాడండి

"ఐదొందలకి బేరమాడినాను డబ్బిస్తే ఎంటనే కోరట్లో హాజరు పెడతాడట. మేస్ట్రీటుకాడ బెయిలు పుట్టించుకోవచ్చట. నేకపోతే అందరికీ రేత్తిరి వొణ్ణాలు జెయిల్లోనేనట" అన్నాడండి ఆ బాబు.

మా బాబు అగ్గైపోనాడండి, ఏటీ దారుణమని.

మనవెంత అగ్గైనా, బుగ్గైనా పోలీసు లూరకుంటారేటండి? మరింక మా బాబు ఒప్పుకోక తప్పనేదండి.

మా బాబు లంచం యివ్వడం అదే తొలిసుట్టండి - కాని ఆ మూర్తం మా గొప్పదండి.

మా వందరం పోలీసు జీపులో ఎల్లి నావండి.

మా జీపులోనే ప్లీడర్లొచ్చినారండి కోరటుకి.

బెయిలుమీద యిడుదలై, గుమస్తాలకి మామ్మూళ్ళిచ్చి-బైటపడేసరికి గబ్బిలాలు తిరుగుతున్నాయండి. అంత సీకటి పోనాదన్నమాటండి.

ఆ బెంగకి నాకు ఆకలెక్కువై పోనాదండి.

మల్లా అంతమందిమీ ఆచారిబాబిల్లు సేరినావండి.

ఆచారిబాబేటీ అన్లేదుగానండి, రంగనాదం బాబే మా బుల్లిబాబుకి సెప్పడం మొదలెట్టినాడండి.

"నా మాటిని యిందాకటి అర్జీకి అగ్గెట్టేసి కొత్తది రాయించు-బుచ్చిబాబు కొట్టమంటేనే పరసురాంగోడు మాయలోడ్ని కొట్టేడని రాయించు. బుచ్చిబాబుని కూడా యిరికించి, కోరటుసుట్టూ తిప్పు-నేకపోతే నువు కోరటుకి పెదచ్చిణాలు జేస్తున్నప్పుడు, ఆడు పెళ్లానికి పెదచ్చిణాలు జేస్తుంటాండి. అన్నేయంగా నీ

మీద కేసు యెట్టినాడా లేదా? నువు యెనక అడుగు యెయ్యక_నాను గాందీగోర్నని సూకుంటే నాబంసేదు. గాందీగోరికి నెహురూలాటోళ్ళ సపోర్టుండేది. నీకెవరు న్నారు? సన్నాసిగోడూ - సన్నాసిగోళ్లూ తప్ప నీలాంటి దేశం మరమ్మత్తుగోళ్ళని ఇదిగో యీ నెత్తిమీద ఎన్నిఎంట్రుక లున్నాయో అంతమందిర్ని జూసినాను.

ఈ దేశభక్తిగోళ్ళంతా - ప్రెతీవోడు ఎప్పుడో ఒకప్పుడు జారుకోక తప్పదు జారుకున్నోళ్ళే అంతా_నానోటి సెప్తాన. నువ్వే ఆలోచించుకో.

గాందీగోరు సచ్చేడు

ఆనక మరో గాంధీ పుట్టేడా?

నేదు కదా!

ఆ బాబన్నా "సత్తెం," అని తొలి సుట్టు మనదేశంలో అన్నాడా?

అన్లేదు.

మరెక్కడన్నాడు?

అప్రికాలో అన్నాడు.

అక్కడా బాబుకి నల్లోళ్ళ సపోర్టు జేసేరు.

దాంతో ఆ బాబుకి ఏనుగు బలం వొచ్చేసినాది.

ఆ బలంతోనే వచ్చినాకు మనదేశం. అంత బలం వొచ్చినాక "సత్తెం" అన్నా సెల్లుది. 'అబద్దవన్నా సెల్లుద్ది'.

నా మాటినుకో

సివరి సుట్టుగా - గాందీగోరికి మన సులో ఓ దణ్ణవెట్టేసి_ఆ బాబుని ఒగ్గీ.

బుచ్చిబాబుకి శకునిలాటోళ్ల సపోర టుంది.

నువ్వు ధరమరాజునాగ పెళ్ళాం, తమ్ముళ్ళతో అడవిలు పట్టేకు.

శకునిగోడు ఏన్నా జూస్తే "దణ్ణం గురూ" అ_టూ పాదాలు పట్టేసుకుంటాడు.

మరంచేత 'కొత్త అర్జీ ఐకురుతాను. నువ్వు' "ఊ" అంటే సాలు బుచ్చిబాబు పెళ్ళాం, పిల్లల్ని కూడా మరో కేసులో కోరటుకి యీడుస్తాను.యిప్పుడుమాత్తరం ఆడ్నీ, ఆడితోపాటు అక్కడున్నోళ్ళని మాత్తరం యిరికిద్దాం. ఏటంటావు?

"ఊ" అను అన్నాడు రంగనాదం బాబు. ముమ్మారు ఆలోచించుకొని "ఊ" అనేసినాడు మాబాబు.

మరింకేటుంది?

పీటసెక్కానంటి అర్జీ రాసీసినాడు రంగనాదంబాబు. దాన్ని సరిదిద్దింది సుబ ద్రమ్మ తల్లి.

మర్నాడు దాన్ని మేస్ట్రీటు కోరట్లో దాకలుజేసినాడు మాయలోడు.

అదిగదే మొదలండీ కోరట్లంట తిర గడం.

మాలాటోళ్ళంతా ఓపూటకూడు ఇంటి కాడ తింకే_ మలిపూట కూడు కోరట్లో నేనండి_ఏదో మాబాబు దయవల్లా_అదు రుష్టం వల్లా_మా ఊరు బస్సులు ఏసినారు గాని నేకపోతే_తిరగనేక మాకాళ్ల మామూలు రోళ్లుకాదు_ఇనపరోళ్లు అయి పోయావండి. [సశేషం]



# హంస మంజీరాలు

(గత సంచిక తరువాయి)

తహసీల్దారూ రెవెన్యూ ఇన్స్పెక్టరూ ఉద్యానవనంలోకి ప్రవేశించి కృష్ణమ రాయుడు పరుండిన సిమెంటు సోఫా దగ్గర నిలబడిపోయారు. పురివిప్పి ఆడుతున్న నెమలి ఈ అందాలు అందరికీ కాదన్నట్టు ముడుచుకుపోయింది. అది గమనించిన నాగార్జునుడు వెనక్కి తిరిగి తహసీల్దారునూ ఇన్స్పెక్టరునూ చూసాడు.

"ఎవరు కావాలండీ?" అని పలకరించాడు వారిని.

"నాన్నగారు" అని బదులుచెప్పాడు

సి. యన్. రావు • శివదత్త్

తహసీల్దారు.

ఆ అలికిడికి ఆలోచనల వలనుంచి బయటపడి "మీరా? ఏమిటిలా దయ చేసారు? రండి కూర్చోండి," అంటూ కృష్ణమరాయుడు లేచి వారికి చోటిచ్చాడు కూర్చుందుకు.

వెనక వచ్చినపుడు ధైర్యంగా కృష్ణమ రాయునిముందు కూర్చున్న అధికారు లిద్దరూ ఈ సారి కూర్చోలేకపోయారు.

"ఫర్వాలేదులెండి. కలెక్టరుగారు ఈ ఫర్మానాను తమకు అందజేయమన్నారు" అంటూ తాము తెచ్చిన పత్రాన్ని కృష్ణమ రాయుని చేతికందించి చేతులు కట్టుకొని నిలబడేఉన్నా రిద్దరూ.

కృష్ణమరాయుడు ఫర్మానాను విప్పాడు. చదివాడు. మాధవగిరి చుట్టుప్రక్కల ఉన్న ఇరవై గ్రామాలను కృష్ణమ రాయుని కప్పగిస్తూ, జమీందారు వీరేం దర్‌రావునుంచి ఆ జమీను తొలగిస్తూ కలెక్టర్‌గారు జారీచేసిన ఆర్డరు అది. అంతేకాకుండా కృష్ణమరాయునికి 'రావు బహద్దూర్' అను బిరుదాన్ని కూడా ఇచ్చాడు రాబర్ట్‌సన్.

కృష్ణమరాయుడు ఒక్కసారి నిట్టూర్చి "పెద్ద బాధ్యతనే అప్పగించారు మాకు. మా శాయశక్తులా మా బాధ్యత నిర్వర్తి స్తామని తెలియజేయండి కలెక్టరుగారికి". అని బదులుచెప్పాడు.

ఈ వార్త ఊరూవాడా క్షణంలో ప్రాకిపోయింది. ఊళ్లోని పిన్నా పెద్దా ఆ శుభవార్త విని ఎంతగానో ఆనందిం చారు. పొరుగూరునుంచి అనేకమంది పెద్దలొచ్చి కృష్ణమరాయున్ని అభినం దించారు.

ఈ శుభవార్తను విన్న రాధకళ్లల్లో ఆనందాశ్రువులు నిండి ముత్యాలుగా జాలు వారాయి.

"ధర్మం చావలేదు," అని లోలోనే ఉప్పొంగిపోయి ఆ రేయంతా వేణు గోపాలుని పాదాలను కన్నీటితో అభిషే కించింది

## 54

కృష్ణమరాయుడు జమీందారైన మరు చటి రోజు. ఆ రోజు ఏకాదశి. సూర్యో దయానికి ముందే కృష్ణమరాయుడు తన కొడుకు నాగార్జునుని, కూతురు శాంతిని వెంటబెట్టుకొని వేణుగోపాలస్వామికి అభిషేకం చేయించడానికి ఆలయానికి వచ్చాడు. పూర్ణయ్య యధావిధిగా కృష్ణమరాయుని పేరుమీద స్వామికి సహస్రనామార్చన జరిపించాడు. గోపా లుని కిష్టమైన క్షీరాభిషేకాన్నికూడా జరి పించాడు. ప్రసాదం తీసుకొని తిరిగి ఇంటికి వెళ్లబోతున్న కృష్ణమరాయునికి ఏదో అలికిడై, అలికిడైనవైపు చూసాడు.

కృష్ణమరాయుడు వచ్చినవేళకే ఆల యానికి వచ్చిన రాధ పూలసజ్జ చేతబట్టు కొని స్తంభంచాటున ఒదిగి నిలబడి కృష్ణమరాయున్ని, శాంతి, నాగార్జునులను తృప్తిగా చూస్తూ ఉండిపోయింది. ఆ

పరధ్యాన్నంలో ఆమె చేతిలోని పూలసజ్జ జారి నేలమీద పడ్డంతో అటికిడైంది. ఆ అలికిడికి అటు తిరిగిన కృష్ణమరాయుడు దాదాపు ఇరవై సంవత్సరాల తరువాత మళ్లీ రాధను చూసాడు. కాని తాను ఈ క్షణంలో చూసిన రాధ వెనుకటి రాధలా లేదు.

ఇంతలో రాధ సజ్జనూ పూలను అక్కడే వదలి కొంగునిండా కప్పుకొని అక్కడినుంచి వెళ్ళిపోయింది.

కృష్ణమరాయుడు "పూర్ణయ్యగారూ ఎవరామె? ఎక్కడో ఎప్పుడో చూసినట్టు గుర్తు. ముఖం నాకు కనిపించలేదు" అన్నాడు ఆతురతగా.

పూర్ణయ్య నవ్వి "ఎంతకాలం గడిస్తే మాత్రం అంత పరిచయమున్న మనిషి నెలా గుర్తుపట్టలేకపోయారు?" అన్నాడు.

"ఆమె రాధ కదూ?"

"అవును".

"అలా చిక్కిపోయిందేమిటి?"

"నీటికీ వెలుగుకీ నోచుకోని లతలు వాడిపోవడం సహజమే కదా! ఆశ్రమ జీవితం గడుపుతున్న రాధ ఆశ్రయమున్న లతలా నవనవలాడుతూ ఎలాఉంటుంది?" అన్నాడు పూర్ణయ్య ఎంతో ఆవేశంతో.

"రాధకు ఆశ్రమ జీవితమా?" అంటూ కృష్ణమరాయుడు గుండె చేతబట్టుకొని నిలచున్నచోటే స్తంభాన్ని ఆసరాగా తీసుకొని కూలబడిపోయాడు. శాంతి, నాగార్జునుడూ, "నాన్నగార్లూ నాన్నగారూ" అంటూ ప్రక్కకు చేరారు.

"కృష్ణమరాయా" అంటూ పూర్ణయ్య కూడా చెంతకు చేరాడు.

కృష్ణమరాయున్ని ఇంటికి తీసుక వచ్చారు. కృష్ణమరాయునికి గుండెపోటు వచ్చిందని ఊరందరికీ తెలిసింది. ఊరు ఊరంతా కృష్ణమరాయుని కంటిచుట్టూ చేరారు.

## 55

కృష్ణమరాయుని కచేరీహాల్లో పడుకో బెట్టారు. రాజా చంద్రశేఖరంగారు పట్నంనుంచి పెద్దడాక్టర్లను తీసుకువచ్చి వైద్యం చేయిస్తున్నారు. సాయంకాలానికి తెలివిరావొచ్చని డాక్టర్లు చెప్పారు. ఏకాదశి ఉదయం నుంచీ ద్వాదశి మధ్యాహ్నందాకా కృష్ణమరాయుడు అపస్మారక స్థితిలోనే ఉన్నాడు. రాజా చంద్రశేఖరం, నాగార్జున, శాంతి, ఊర్లోని పెద్దలు అందరూ కృష్ణమరాయునికి ఎప్పుడు స్పృహవస్తుందా అని వెయ్యికళ్లతో ఎదురుచూస్తున్నారు

కృష్ణమరాయునికి స్పృహ వచ్చింది. శాంతి నాగార్జునుల ముఖాలు విప్పారాయి. పెద్దలంతా కృష్ణమరాయుని ముఖంలోకి ఆనందంతో చూసారు. వచ్చినవారందరికీ చూపులతోనే కృతజ్ఞత తెలుపుకున్నాడు కృష్ణమరాయుడు.

కాళ్లదగ్గర కాస్త ఎడంగా చేతులు కట్టుకొని నిలబడిన వెంకటశెట్టి కృష్ణమ

రాయుని కంటబడ్డాడు.

అంతటి బలహీన స్థితిలోను చిరునవ్వు నవ్వి "ఏం శెట్టీ. నీ బాకీ తీర్చకుండానే పోతానేమోనని భయపడి వచ్చావా? నేనిప్పుడు జమిందారునయ్యా. నీ బాకీ తీర్చడానికి ఏర్పాట్లుచేసి నాగార్జునునికి వప్పజెప్పే పోతానులే, భయపడకు" అన్నాడు.

"ఎంత మాట బాబూ? తమ నాకేం బాకీ ఉన్నారు? తమ బాకీమొత్తం ఏనాడో రాధమ్మ తన నగలన్నీ నా కిచ్చేసి జమకట్టేసింది. పత్రంకూడా ఇచ్చేసాను. కాకపోతే ఆ సంగతి తమతో చెప్పొద్దన్నది," అన్నాడు వినయంగా వెంకటశెట్టి.

"ఏమిటీ. నా బాకీ రాధ తీర్చిందా?"

"నిజం బాబు".

"అమ్మా శాంతీ! రాధను ఒక్కసారి పిలిపించు" అన్నాడు కృష్ణరాయుడు, ఆలస్యం చెయ్యొద్దన్నంత ఆతురతగా.

"పిలిపించాల్సిన అవసరంలేదు నాన్నా. మీకు స్పృహతప్పిన మరుక్షణంనుంచీ రాధ మనింట్లోనే ఉన్నది. మీకు స్పృహలేనంతసేపూ మీసేవలు చేస్తూనేఉన్నది. అందరూ వచ్చారు కదా అని, మర్యాదగా ఉండదని లోపలికివెళ్ళి దేవుడి ముందు కూర్చుంది," అంది శాంతి. "ఒక్కసారి ఇలా పిలువమ్మా. ఆలస్యం చేయకు. ఒక్కసారి రాధను కళ్ళారా చూడాలి పిలువమ్మా."

శాంతి లోపలికి వెళ్ళి రాధను వెంట తీసుకొచ్చింది.

తన పాదాల దగ్గర నిలబడిన రాధను కృష్ణమరాయుడు కళ్ళారా చూశాడు. ఒకనాడు వెన్నముద్దలా ఉండే రాధ ఈనాడు మోడువారినట్లనిపించింది. తనకు తెలియకుండానే మనసు కరిగి నీరై కళ్ళు చెమ్మగిల్లాయి

"ఇలారా! కూర్చో రాధా!" అంటూ కృష్ణమరాయుడు తనప్రక్కనే చోటు చూపించాడు. రాధ బెరుకుబెరుకుగా వచ్చి కృష్ణమరాయుని ప్రక్కలో ఒదిగి కూర్చుంది.

జనంలో కలకలం బయలుదేరింది. ఎవరో "ఎంత చనువుంటే మాత్రం ఒక సానివచ్చి అంత పెద్దమనిషి ప్రక్కలో కూచుంటుందా ఇంతమంది ముందు? బుద్ధిజ్ఞానం ఉండక్కర్లే?" అన్నారు.

ఆ మాటలు విన్న రాధ కృష్ణమరాయుని ప్రక్కలోనుంచి చటుక్కున లేచి నిలబడింది. శాంతికి ఆవేశం కట్టలు తెంచుకుంది. ఉద్రేకం పెల్లుబికింది. ఆమె కళ్ళు ఎర్రబడ్డవి. చరచరా రాధ దగ్గరకు వచ్చి "నేను చెబుతున్నా కూర్చో అమ్మా! నాన్నగారి ప్రక్కలో కూర్చునే అధికారమూ హక్కూ నీకున్నాయి. నీకు బుద్ధిజ్ఞానంలేదన్న వాళ్ళకి అవి లేవేమో కాని బుద్ధిజ్ఞానం నీ సొత్తమ్మా! తక్కిన వాళ్ళు నీ దగ్గర నేర్చుకోవాలి. నువ్వు ఈ కుటుంబంకోసం ఏంచేసావో నాకు

తెలుసు. అమ్మ పోతూపోతూ అన్నీ నాకు చెప్పింది ఈ వంశం నిలబెట్టమని మా నాయనమ్మ. నిన్ను బతిమాలితే నీ జీవిత సర్వస్వంగా భావించిన మా నాన్నగారిని పెళ్ళికి ఒప్పించావు. మా నాన్నగారు మా అమ్మ ఉనికినే గుర్తించని స్థితిలో లేనిపోని నింద నీమీద వేసుకొని మా నాన్నగారికి నీమీద అసహ్యం కలిగేలా చేసి కావాలని వారికి దూరమయ్యావు. అయినా మా అమ్మ మా నాన్నగారిని తన వారిని చేసుకోలేకపోయింది ఆ స్థితిలో మా నాన్నగారు ఊర్లోలేని సమయంలో మా యింటికివచ్చి అమ్మను తీర్చిదిద్ది నాన్నగారి అభిరుచికి తగ్గట్టు మలిచి నీ బాధ్యత నిర్వర్తించావు. మా నాయనమ్మ కిచ్చిన మాట నిలబెట్టుకున్నావు. ఆ తర్వాతే నేనూ, నాగార్జున పుట్టాము ఇదంతా అమ్మ చెబితే నాకు తెలిసింది. నేను కళ్ళారా చూసినవి ఉన్నవి. వెంకట శెట్టికి నాన్నగారివ్వవలసిన బాకీ వారి అభిమానం ఎక్కడ దెబ్బతింటుందోనని వారికి తెలియకుండా నువ్వే తీర్చావు. ఆ విషయం ఇప్పుడే అందరికీ తెలిసింది. ఇక్కడున్న ఎవ్వరికీ తెలియని విషయం నాకూ పూర్ణయ్యగారికీ తెలుసు. డబ్బు లేక నా పెండ్లి ఆగిపోయే స్థితిలో నీ ఇంటినీ ఆస్తినీ తెగనమ్మి ఆ డబ్బు పూర్ణయ్యగారి చేతికిచ్చి నా పెండ్లి జరిపించావు. నేను అత్తగారింటికి వెళ్ళేవేళ మా నాన్నగారు నీకు ఎంతో అప్యాయంగా ఇచ్చిన హంసమంజీరాలు పవిత్రంగా దాచిఉంచి నా కాళ్ళకు అలంకరించి పంపించావు. మా కుటుంబానికి మా కూ ఇంతచేసిందానవమ్మా నువ్వు. నిన్ను నేను అమ్మా అని మనసారా పిలుస్తున్నాను.నాన్నగారిప్రక్కలో కూర్చునే హక్కు, అర్హత నీకు ఎవరు లేదన్నా నీవు చేసిన త్యాగాలు నీ కిచ్చాయమ్మా. నీ ఒక్కర్తెకే ఆయన ప్రక్కలో కూర్చునే హక్కుంది. కూర్చో అమ్మా" అంటూ శాంతి రాధభుజాలు పట్టుకొని తండ్రి పక్కలో కూర్చోబెట్టింది రాధను.

అంతా విన్న కృష్ణమరాయుడు సిగ్గుతోనూ, బాధతోనూ క్షణంపాటు కుచించుకు పోయాడు.

కృతజ్ఞతతో మనసు ద్రవించి కన్నీరుగా స్రవించింది. గొంతు జీరవోయింది.

"పిచ్చి రాధా! ఇంత చేసావా నా కోసం! ఇంతచేసిన నిన్ను అనుమానించానా! అభిమానించివా? పోనీలే కన్ను మూసేలోపున మబ్బులు తొలగించుకొని నిజాన్ని చూసే అవకాశం వచ్చింది. నేను ఎప్పుడు యేంకావాలని అడిగినా నేను తప్ప ఇంకేదీ అక్కరలేదనేదానవు. నేను వెళ్ళిపోతున్నాను, నేను నీకిక ఉండను. ఏంకావాలో కోరుకో. నే నిప్పుడు జమిందారుని. కోరుకో రాధా!" అన్నాడు కృష్ణమరాయుడు, అప్యాయతా అనురాగం మేళ

వించిన స్వరంతో.

రాధకళ్ళు ఆనందాశ్రువులతో నిండి పోయాయి.

తన గుప్పిట్లోఉన్న మంగళసూత్రాన్ని తీసి చూపించింది రాధ.

కృష్ణమరాయుడు చిరునవ్వు నవ్వి "ఈ తాళిబొట్టు నీమెడలో కట్టమంటావా? ఇది నీ మెడలో కట్టకపోతే మాత్రం నీకూ నాకూ ఉన్న సంబంధాన్ని బాంధవ్యాన్నీ ఈ భూమి ఆకాశం కాదనగలవా? ఈ లోకం కాదన్నా ఆ వేణుగోపాలుడు కాదనగలడా? నీ కోరిక నేనెందుకు కాదనాలి. నువ్వు చేసిన త్యాగాలముందు ఇది చాల చిన్నకోరిక. ఇలా ఇవ్వు" అంటూ రాధ చేతిలోని మంగళసూత్రాన్ని అందుకొని మూడుముళ్ళు వేశాడు ఆమె మెడలో.

ఆసమయంలో ఎక్కడో ఆకాశంలో "మాంగళ్యం తంతునానేనా" అన్న వేద మంత్రాలు రాధకు వినివచ్చాయి. ఆమె పునీత నయ్యేనన్న ఆనందంతో పరవశించిపోయింది. ఆ పారవశ్యంలో తన్ను తాను మరచిపోయి చుట్టూ ఉన్న జనాన్ని మరచిపోయి కృష్ణమరాయుని గుండెలమీద వాలిపోయింది.

కృష్ణమరాయుడు ఆప్యాయంగా ఆమె తల నిమురుతూ "పిచ్చిరాధా! చివరి క్షణంలోకూడా పరో త్యాగం చేసావా? ఇన్నాళ్ళూ నేను ధర్మకర్తననే అనుకున్నాను. చివరి ఘడియల్లో నాచేత నీ మెడలో తాళి కట్టించుకొని సంస్కర్తను కూడా చేసావు. ఏదీ ఒక్కసారి నీ ముఖం నన్ను చూడనీ" అంటూ కృష్ణమరాయుడు రాధముఖం తన గుండెలమీదినుంచి తన వైపుకు త్రిప్పుకున్నాడు.

తృప్తిగా స్థిరనిద్రలో మునిగిపోయిన రాధ ముఖాన్ని చూసి వణకుతున్న పెదవులతో రాధకు మాత్రమే వినపడేలా "రాధా" అని పిలచి ఆమెను హృదయానికి హత్తుకున్నాడు.

(సమాప్తం)



# నయగరా

## సి. ఆనందారామం



నాకోసం న్యూయార్క్ ఎయిర్‌పోర్ట్‌కి వచ్చింది, సమీర. దానికి నాన్నగారు ఆ పేరు ఎందుకు పెట్టారో కానీ, అన్ని విధాలా సార్థకనామధేయురాలన్నట్లుగా ఉంటుంది. కస్టమ్స్ ఫార్మాలిటీస్ అన్నీ పూర్తిచేసుకుని, ఇమిగ్రేషన్ సర్టిఫికేట్ తీసుకుని, లగేజ్ కలెక్ట్‌చేసుకుని బయట పడేసరికి ఏదో యజ్ఞంచేసినంత పనైంది. అదీగాక కస్టమ్స్ చెకింగ్ పూర్తయ్యే వరకు మరొకరు రావటానికి వీల్లేదు. అవన్నీ నేనొక్కదాన్నే చూసుకోవలసిందే. ఏనాడూ అలవాటు లేని వ్యవహారం! నాన్నగారిమాట కాదనలేక బయలుదేరాను కానీ, ఒంటరిగా స్వదేశంలో ప్రయాణం చెయ్యాలంటేనే, భయం నాకు. ఏదో కాస్త ఇంగ్లీషులో మాట్లాడ గలిగినదాన్ని గనుక ఎలాగో బయటపడ గలిగాను. నన్ను చూడగానే అక్కడే ఎయిర్‌పోర్ట్‌లోనే గట్టిగా కౌగలించుకుని బుగ్గమీద ముద్దుపెట్టేసు

కుంది సమీర- అమెరికన్ అలవాట్లన్నీ వంటపట్టించేసుకుంది కాబోలు! నా రాకకు తెగ సంబరపడిపోతోంది పాపం! ఎందుకొచ్చానో తెలీదు.

"రా! వెళ్దాం!" అంటూ చకచక సామాన్లన్నీ కారుడిక్కీలో పడెయ్య సాగింది.

"పోర్టర్ని పిలవరాదు!" అన్నాను, అలవాటుగా.

"ఇంకా నయం! ఇక్కడ పోర్టర్ని పిలిచామంటే ఆరిపోతాం! పనులన్నీ మనం చేసుకోవలసిందే!"

డిక్కీ తలుపు మూసేసి, తను డ్రైవింగ్‌సీట్‌లో కూచుని, కారు తలుపు తెరిచి "రా!" అంది.

నేను కూచుని డోర్ మూసి "డ్రైవింగ్ కూడా నేర్చుకున్నావా?" అన్నాను.

"ఆ? ఈ అమెరికాలో తిండిలేక పోయినా బ్రతకగలం కానీ, కారులేకుండా డ్రైవింగ్ రాకుండా బ్రతకలేం! ఫేమిలీస్ కయితే రెండు కార్లుంటాయి. భార్యలకు పెద్ద కార్లు, భర్తలకు చిన్న కార్లు...."

"అదేమిటీ? ఆడవాళ్ళకు వీళ్ళిస్తున్న గౌరవమా?"

సమీర నవ్వింది-

"అదేంకాదు- మొగవాళ్ళ కారు ఎక్కువగా తిరుగుతుంది అంచేత చిన్న కారు- పెట్రోలు తక్కువ ఖర్చు కావటానికి...."

రోడ్డువంక చూస్తూ నవ్వుతూ కబుర్లు చెప్తూ- డ్రైవ్‌చేస్తున్న సమీరను చూస్తే ఎంతో గర్వం కలిగింది నాకు. అంతలోనే ఏదో బాధకూడా కలిగింది. ఇంత అందమైనది, ఇంత చదువుకొన్నది- ఇంత తెలివైనది- ఎందుకిలా తెలిసి తెలిసి గోతిలో పడుతోంది? దాని ముఖంలోకి చూశాను. కళ్ళు ఎప్పటిలా మెరుస్తున్నాయి కానీ, కళ్ళకింద నల్లటి చారికలు అప్పుడే ఏర్పడుతున్నాయి, అశాంతికి చిహ్నంగా- అవును! ఇలాటి వ్యవహారాల్లో అశాంతి కాక మరేం ఉంటుంది?

కారు దాని ఫ్లాట్ ముందు ఆగింది. ఆకాశాన్నంటే స్కైస్క్రేపర్‌లో ఒక అపార్ట్‌మెంటు అది. దానిలో ఎన్ని అపార్ట్‌మెంట్స్ ఉన్నాయో లెక్కపెట్టలేకపోయాను. ఆ భవనం ఆవరణలో కార్ పార్కింగ్‌ప్లేస్‌లో లెక్కలేనన్ని కార్లు, చీమలబారుల్లా- తన కారు పార్క్ చేసుకోవటానికి స్థలం దొరక్క కొంతసేపు అటూఇటూ తిరిగి, చివరకు ఎలాగో పార్క్‌చేసింది. దాని అపార్ట్‌మెంట్ నైన్త్ ఫ్లోర్‌లో- లిఫ్ట్‌లో వెళ్ళాం.

అపార్ట్‌మెంట్ మరీ పెద్దది కాకపోయినా చాలా పొందికగా ఉంది. నేలంతా మెత్తని కార్పెట్లు పరిచి ఉన్నాయి- ఉన్న రెండు బెడ్‌రూమ్స్‌కి అటాచ్డ్ బాత్స్ ఉన్నాయి. నా సామానులన్నీ ఒక బెడ్‌రూంలో అదే సర్ది

"స్నానంచేస్తే చెయ్యి-" అంది.

నాకు అమెరికాలో అన్నింటికంటే నచ్చింది స్నానాలగది- బాత్‌టబ్స్, షవర్స్- హాట్ అండ్ కోల్డ్ వాటర్ అరేంజ్‌మెంట్స్. ఇండియాలో కూడా పోష్ హోటల్స్‌లో ఇలాంటి బాత్ రూమ్స్ ఉంటాయని విన్నాను- కానీ నేనలాంటి హోటల్స్‌కి ఎప్పుడూ వెళ్ళలేదు. వేడినీళ్ళు షవర్‌లోంచి జల్లులా తలమీద పడుతోంటే ప్రయాణబడలిక అంతా తీరిపోయింది. నేను స్నానంచేసి తయారయి వచ్చే సరికి సమీర ఎవరితోనో ఫోన్‌లో మాట్లాడుతోంది.

"నో డియర్! ఏమీ లాభంలేదు- ఈరోజు మా అక్కయ్య వచ్చింది- ఎంతమాత్రం కుదరదు-"

అవతలివైపునుంచి ఏం వినిపించిందో సమీర కిలకిల నవ్వింది. అది అంతగా నవ్వుతుందని నాకు అంతకుముందు తెలీదు. మనసులో ఉల్లాసం కలిగితే, నవ్వు అంత అందంగా ఉంటుందేమో!

"యూ, నాటీ! షటప్! బైదిబై, రేపు అక్కని నయగరా తీసికెళ్తున్నాను- నువ్వూ వస్తావా?"

అవతలివైపునుంచి ఏం సమాధానం వచ్చిందో నవ్వుతూ "ఓకె" అని ఫోన్ పెట్టేసింది- అప్పుడు చూసింది నన్ను.

"భోజనం చేద్దామా?" అంది.

వంటంతా ఎప్పుడో తయారయి ఉంది. అన్నీ ఫ్రిజ్‌లో ఉన్నాయి- ఆ పాత్రలన్నీ తీసి కొన్ని స్టవ్‌మీద, కొన్ని ఓవెన్‌లోనూ వేడిచేసింది-

ఇద్దరం భోజనం చేస్తుంటే చెప్పింది-

"ఇక్కడ మేము మామూలు భోజనం చేసేది, కేవలం రాత్రిపూట. పొద్దున్న బ్రెడ్ కానీ కార్న్‌ఫ్లేక్స్‌కానీ తింటాము. మధ్యాహ్నం ఆఫీసులో ఏదో ఒక స్నాక్స్ తింటాము. ఒక రాత్రి ఇంటికొచ్చి స్థిమితంగా భోజనం చేస్తాము. ఫ్రెంచ్‌ఫ్రైస్, చికెన్, ఫుడ్‌స్టఫ్స్, మొదలైన పదార్థాలన్నీ ఉంటాయి. కనుక వంట పెద్ద కష్టంకాదనుకో..."

ఏదో చెప్తూపోతోంది అది- కానీ నేను వచ్చిన విషయం ఎలా ప్రారంభించాలా అని ఆలోచిస్తున్నాను- ఎందుకంటే అది చిన్నపిల్ల కాదు- ఒప్పించటానికి ప్రయత్నిస్తే నా యిష్టం అని ఎదురుతిరిగే ప్రమాదం ఉంది- అంచేత అది ఎంచుకొన్న మార్గం ఎంత కంటకమయిందో, దాని మనసుకే స్ఫురించేలాగ నచ్చజెప్పాలి.

"ఒక్కదానివే ఇక్కడ ఉండకపోతే, అక్కడికి వచ్చెయ్యకూడదూ? చదువు పూర్తయిందిగా! ఆ మాత్రం ఉద్యోగం అక్కడ దొరకదా?"

ఏదో ఆలోచిస్తూ తింటోందేమో కొంత ఆశ్చర్యంగా, "ఒక్కదాన్నే ఉంటున్నాననా?" అని, అంతలో సర్దుకుని "ఏం ఫరవాలేదు. అదే అలవాటవుతుంది. ఆ మాటకొస్తే ఇండియాలో

నువ్వు మాత్రం ఒంటరిగా ఉండటం లేదా ?" అంది.

ఇదే భయం నాకు: ఏదైనా చెప్పబోతే "నువ్వుమాత్రం....?" అని ఎదురుప్రశ్న వేస్తుందేమోనని; నా సంగతీ- ఆ సందర్భమూ పూర్తిగా వేరు- దివాకర్‌లాంటి మనుష్యులు నూరుమందిలో ఒక్కడుంటారు. కానీ, ఇప్పుడు సమీరతో ఈ రకంగా వాదించి ప్రయోజనంలేదు. "నా విషయమూ ప్రత్యేకమైనదే!" అని కొట్టిపారేస్తుంది. ఇంతకు ఇది ఒంటరిగా ఉండటంలేదన్నమాట! అయితే నాన్నగారి ఆందోళన నిష్కారణమైనది కాదు- నాకు సాధ్యమవుతుందా, దీని మనసు మార్చటం?

"అక్కయ్యా! రేపు నిన్ను నయగరా తీసుకెళ్తున్నాను."

"థాంక్స్!"

"మనతో నా స్నేహితుడు సాగర్ కూడా వస్తున్నాడు."

హమ్మయ్య- అదే తీసుకొచ్చింది ప్రస్తావన- ఇప్పుడే కాస్త కదిలించాలి!

"స్నేహితుడంటే?"

అది నవ్వింది నిర్లక్ష్యంగా- నా దగ్గర దానికి భయంలేదు.

"స్నేహితుడంటే, నేను నయగరాకి రమ్మనగానే నా మాట కాదనలేక వెంటనే మనతో వచ్చేసేవాడు- ఏమిటక్కా, ఈ ప్రశ్నలు?"

నాకు నేను నిట్టూర్పు విడుచుకున్నాను-

"అతనికి పెళ్ళయిందా?"

ఈ ప్రశ్నకు మాత్రం దాని ముఖాన మబ్బులు ముసిరాయి- తల వంచుకుని వేలితో అన్నం పళ్ళెంలో రాస్తూ "అయింది" అంది.

"పిల్లలున్నారా?"

"ఆ! ఇద్దరు-"

"అయితే ఈ స్నేహం బహుశః హద్దులలోనే ఉంచే ప్రయత్నం చేస్తుండాలి నువ్వు."

దానికి అది సమాధానం చెప్పలేదు- కొంచెంసేపాగి "అతనికి ఇంకా అఫైర్స్ ఉన్నాయి- అఫైర్స్ మాత్రమే కాదు- ఇంకా చాలామంది ఆడవాళ్ళతో- అన్ని తరగతుల వాళ్ళతో స్నేహాలున్నాయి-" అంది.

అదీ నేను అక్కచెల్లెళ్ళలా మాత్రమే కాక, స్నేహితుల్లా కూడా ఉంటాం-అంచేత తన మనసులో ఆవేదన నాకు చెప్పుకోకుండా ఉండలేదు.

కానీ, దానికి ఇప్పుడు నేనేం చెప్పను? దానికి తెలియని దేముందని నేను చెప్పటానికి? ఒక ప్రయత్నం చేశాను-

"సమీరా! ఇదంతా దేనికి దారి తీస్తుందో నీకు తెలీదా? ఇప్పటికైనా ఈ స్నేహాన్ని ఇక్కడితో ఆపేస్తే మంచిదికదా!"

"అయామ్ హెల్ప్‌లెస్?"

కన్నీళ్ళతో చరాలున అక్కడినుంచి లేచిపోయింది-



అది తెలియనిది కాదు_ లోలోపల అదే మథనపడుతోంది. ఇలాంటి దానికి ఏం చెప్పాలి? వచ్చిన రోజే సమీరను ఇంకా ఏడిపించటం ఇష్టంలేకపోయింది నాకు_ పైగా, అది ఏడుస్తోంటే, నేను చూడలేను_ అందుకే మాట మరిపిస్తూ "నీ దగ్గిర చాలా కేసెట్స్ ఉన్నాయే! ఏవైనా ఇంగ్లీష్ పాటలు వినిపించు_ వినాలని ఉంది_" అన్నాను.

అది ఏదో కేసెట్ టేప్‌రికార్డర్‌లో ఫిక్స్ చేసి టేప్‌రికార్డర్ ఆన్‌చేసింది.

"హనీ! హనీ!...." అనే పాట_

ఏదో దానిని మరిపించాలని పాటలు కావాలన్నానే కానీ నాకా పాటలలో పెద్ద

ఇంట్రస్ట్ లేదు. అంచేత "అక్కా! ఎలా ఉంది ఈ చరణం!" అని అడిగితే ఉలికిపడి "ఏమిటి?" అన్నాను. అది మళ్ళీ రీవైండ్ చేసి ఆన్ చేసింది.

"నువ్వు స్వాతంత్ర్యలేవని నాకు తెలుసు. కానీ, నా మనసు నీ వెంట పరుగులు తీస్తోంది." అని అర్థంవచ్చే చరణాలు వినిపించింది. దాని మనసు నా కిష్టమయింది. ప్రాణం ఉసురు మంది. తెలియనివాళ్ళకు ఎలాఅయినా చెప్పగలం తెలిసి తెలిసి గోతిలో పడాలనుకొన్న వాళ్ళకు ఏం చెప్పగలం?

ఆ మరునాడు ఉదయమే సాగర్ వచ్చాడు, తన కారులో. అతడిని చూసి నేను కొంచెం ఆశ్చర్యపోయాను. నేను విన్నదాన్ని బట్టి అతడు అజానుబాహువూ, అరవిందదళాయతాక్షుడూ అయి ఉంటా డనుకున్నాను. కొంచెం పొట్టిగా దానికి తగినట్లు సన్నగా ఉన్నాడు. ముఖంలో కళ ఉంది కానీ, చూసీచూడగానే ఎంతో అందమైనవాడు అనే భావం మాత్రం రాదు. సమీర పరిచయం చేసింది "మా అక్క" అని. అతని నమస్కారానికి ప్రతినమస్కారం చేస్తూ 'సమీరలాటి ఆడపిల్ల ఈ వ్యక్తి విషయంలో ఏం చూసి ఇలా పిచ్చిదయిపోతోందీ?' అనుకున్నాను.

"అందరం ఒకే కారులో వెళ్దాం! అలా అయితే కొంచెంసేపు సాగర్, మరికొంచెంసేపు నేను, డ్రైవ్ చేయొచ్చు." అంది సమీర తన కారు బయటకుతీస్తూ.

సాగర్ తనేవచ్చి చొరవగా సమీర పక్కన కూచున్నాడు. వెనక్కి తిరిగి నన్ను చూసి నవ్వుతూ "మీకేమైనా అభ్యంతరమా?" అన్నాడు. అప్పుడు అర్థమయింది, అతని నవ్వులో మెరుపు. "లేదు!" అన్నాను తలాడిస్తూ. అతడు నా ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు. అంతలో ఏదో అర్థమయినట్లు నవ్వుకొని తల తిప్పుకున్నాడు. అప్పుడు కానీ, నాకు స్ఫురించలేదు. అతడిపట్ల నాలో తల ఎత్తిన అసహనభావం నా కళ్ళలో కని పించిందని. అది అతని కర్థమయిందని. ఎంతో తెలివైనవాడు! ఒక్కొక్క క్రాస్‌రోడ్స్ దగ్గరా "టోల్ టాక్స్" వేసు కొంటూ వెళ్తున్నాడు. అక్కడి రోడ్సన్నీ ప్రైవేట్ కంపెనీలవేనట! ఆ రోడ్స్ మెయిన్‌టెన్ చెయ్యటానికి ప్రయాణీ కులే సుంకాలు చెల్లించాలి! ఈ పద్ధతే బాగుందనిపించింది. అందుకే రోడ్లు యింత శుభ్రంగా ఎలాంటి రిపేర్లు అవ సరంలేకుండా ఉన్నాయి. ఎక్కడి కక్కడ చిన్న చిన్న రెస్టారెంట్లు ఉన్నాయి. ఒకచోట కారు ఆపి లోపలికి వెళ్ళారు. సెల్ఫ్‌సర్వింగ్ సిస్టమ్. ఎవరికి కావలసినవి వాళ్ళు తెచ్చుకుని టేబిల్స్ ముందు కూచుంటున్నారు.

"ఇక్కడ బ్రెడ్, బిస్కట్స్, ఐస్‌క్రీంతప్ప ఇంకేం తినలేదు." అని తనే అవి తీసి ప్లేట్లో పెట్టి నాకు అందిం

చాడు సాగర్. సమీరా, సాగర్ హాట్ డ్రింక్స్ తీసుకున్నారు. టేబిల్ ముందు కూచున్నాక, నేను కొంచెం ఆశ్చర్యంగా

"నేను శాఖాహారినని మీకెలా తెలుసు?" అన్నాను.

"ఊహించాను."

"ఎలా?"

"మీ మాటల్లో ఉంటుంది పట్టేస్తే బ్రాహ్మణవాదస్తం, కొద్దిపాటి మాంసాహారాల వాసన సోకగానే, ముఖం చిట్లించే మీ వైఖరి... ఓకె ఇట్స్..."

సమీరతో పాటు నేనూ నవ్వాను. అతని మాటల్లో ఏదో వింత ఆకర్షణ ఉంది. మళ్ళీ బయలుదేరుతున్నాం. సాగర్ డ్రైవ్ చేసాడు. ఉదయం పది గంటలకు న్యూయార్క్ లో బయలుదేరిన వాళ్ళం. సాయంత్రం అయిదింటికు నయగరా చేరుకున్నాం. [illegible] కావటంవల్ల [illegible], ఇండియాలో [illegible] ట్లుగా వుంది వెలుగు కానీ, [illegible] తీక్షణ లేదు. హోటల్ లో రెండు రూమ్స్ మాట్లాడుకుని మా సామాను రూమ్స్ లో పడేసి, మళ్ళీ ఏదో కాస్త తిని టీలుతాగి స్కైలాన్ టవర్ చూడటానికి వెళ్ళాం. నయగరా నదిపట్టానికి 520 అడుగుల ఎత్తున వుంది. ఆ టవర్ కి గ్లాస్ యెన్ క్లోజర్స్ ఉన్న యెలివేటర్స్ వున్నాయి. యెలివేటర్ లో అడుగుపెడుతూ సమీర తూలిపడి "అబ్బా!" అంది. మరుక్షణం సాగర్ సమీర పక్కన వున్నాడు. సమీరను సాగర్ చేతుల్తోదించి సమీర ముఖంమీదకు వంగి "ఏమయిందీ?" అన్నాడు. "పాదం ఏదో బెణికినట్లయింది చాలా సేపు డ్రైవ్ చేశానుకదూ! ఈ మధ్య జ్వరంవచ్చి కాస్త నీరసంగా వున్న మీదట..." చెప్పింది సమీర.

"నా కెందుకు చెప్పలేదు మరి? నువ్వు డ్రైవ్ చెయ్యాల్సిన అవసరమేముంది అసలు? నీకసలు బుద్ధిలేదు." తిడుతున్నట్లుగా వున్నా, ఆ మాటలు ఎంతో మెత్తగా వున్నాయి. ఆ స్వరంలో మనసుని బుజ్జగించే లాలన, ప్రతి అక్షరంలోనూ అనురాగం ఉట్టిపడుతోంది. సమీరను అతను క్రింద అడుగుపెట్టనివ్వలేదు. తన చేతుల్లో ఎత్తుకున్నాడు. [illegible] అయిపోయిందో, నాకు అర్థమయిపోయింది. ఇండియా [illegible] చేస్తుంటే మనుష్యుల్ని ఎవరైనా చూస్తున్నారేమోనని చుట్టూ చూసాను. మనుష్యుల్ని ఎవరూ పట్టించుకోవటంలేదసలు. ఇలాంటివి వాళ్ళు ఎప్పుడూ చూస్తూనే వుంటారేమో! అక్కడున్న జంటలన్నీ ఒకరితో మరొకరు చేయికలుపుకొనే నడుస్తున్నారు. రివాల్వింగ్ రెస్టారెంట్ చేరుకొనేవరకు సాగర్ చేతుల్లోనే వుంది సమీర. అక్కడ మళ్ళీ టీ తాగుతూ దూరంగా కనిపించే ఆకాశాన్నంటే భవనాలనూ, పచ్చటి పూలతోటల్నీ

స్కైలాన్ టవర్ కింద వున్న ఎమ్యూజ్‌మెంట్ పార్క్‌ని చూసాం. ఆ తరువాత అబ్జర్వేషన్ డెస్క్‌మీదనుంచీ నయగరా జలపాతాన్ని విద్యుద్దీపాల రంగురంగుల కాంతుల్లో చూసాం. అబ్బ! ఏమి సుందరదృశ్యం అది. చాలాదూరం నుంచి రంగురంగుల ఎలక్ట్రిక్‌లైట్స్‌తో మొత్తం జలపాతాన్ని ఇల్యూమినేట్ చేస్తున్నారు. ఎరుపు, నీలం, ఊదా, లేతఆకుపచ్చలో నీలం కలిసిపోయిన లాంటి షేడ్. ఈ రంగులన్నీ హోరున దూకే జలపాతంతో శ్రుతికలిసి నాట్యం చేస్తూ ఎప్పటికప్పుడు తమ తమస్థానాలు చేరుకుంటున్నాయి. జలపాతాలక్రింద వున్న కొండలమీద తెల్లని వెలుగులు గుమ్మరిస్తున్నారు. అంచేత ఆకొండలు మంచుకొండల్లా వున్నాయి. శివుని జటాజూటంనుంచి విముక్తమై హిమవన్నగం మీదకు వురికే గంగాభవాని విశ్వరూపం ప్రత్యక్ష మవుతోంది, ఆ జలపాతపు ఉద్ధృతనాట్యంలో - శివుని మూడవ కంటి మంటలనంటి ఎట్టిబడ్డాయా, ఈ జలధారలు? జటాజూటంలోని కపిల వర్ణాన్ని కలిగిస్తూ వింతవింత రంగులు సంతరించుకొంటున్నాయనా అంతటి ఉద్ధృతాన్నీ నిశ్చలంగా సహిస్తున్నడా, హిమవంతుడు?

నా ఆలోచనలకు నాకేనవ్వువచ్చింది. ఏమిటి నా ఊహాలు? ఇక్కడి అమెరికన్లకు కానీ, కెనెడియన్లకు కానీ "గంగావతరణం" కథ ఎలా తెలుసు? దానికి అనుగుణంగా ఈ విద్యుత్కాంతులు ఎందుకు ప్రసరింప చేస్తారు? అంతా అవస్తుప్తంలో ఉంచాను. ఎప్పటికీ చూసే కంటిలో వుంటుంది. వహో ద్ధృతిమైన ఆ వడిలో, ఆ తీవ్రతలో ఎంత ఆకర్షణ? విశ్వ చైతన్యమంతా ఏకమై హోరున "రా! రా! ఈ మహా శక్తిని దర్శించు." అని కోటి చేతులతో ఆహ్వానిస్తున్నట్లుగా ఉంది. నా ఊహల లోంచి తెప్పరిల్లి పక్కకి చూసాను. సాగర్ హృదయంపైన వాలివుంది సమీర. సాగర్ కొంచెం పొట్టికావటం వల్ల, సమీరా సాగర్‌లిద్దరూ ఇంచు మించు ఒకే ఏత్తులో వున్నారు. సాగర్ వంగి సమీర బుగ్గమీద ముద్దుపెట్టు కున్నాడు. అప్రయత్నంగా సాగర్ చూపులు నా చూపులతో కలుసుకున్నాయి. నేను ముఖం తిప్పుకున్నాను. సమీరా సాగర్‌లను అలా చూడటం, నా కేమీ వింతగా తోచలేదు. అమెరికా వచ్చాక, ఎక్కడపడితే అక్కడ అలాంటి జంటలను చూడటం అలవాటైపోయింది.

సమీర నా దగ్గరకి వచ్చి "ఇంక పోదామా!" అంది. మౌనంగా బయలు దేరాను. స్కైలాన్ టవర్‌లోనే మరో ఫ్లోర్‌లోవున్న గిఫ్టుషాప్‌కి తీసికెళ్ళింది సమీర. యెలివేటర్స్ మాత్రమేకాక యెస్కలేటర్స్‌కూడా వున్నాయి. ఆ తరువాత హోటల్‌కి వచ్చేసాము.

సమీర గాఢంగా నిద్రపోతుంది, నాకు నిద్ర రావటంలేదు. నాన్నగారు నాకు అప్పజెప్పిన పని నేను చెయ్యలేనేమో అనే అధైర్యం కలుగుతోంది. ఒకసారి సాగర్‌తో మాట్లాడాలనుకున్నాను. 'ఇంత రాత్రివేళా' అని సంకోచం కలిగింది. కానీ పెద్దవాళ్ళు, నాకేమిటి? అనుకున్నాను. అదీగాక, సాగర్‌తో ఒంటరిగా మాట్లాడాలంటే, ఇంతకంటే మంచి సమయం నాకు దొరకదు. సాగర్ రూం మా రూం ప్రక్కనేవుంది. వెళ్ళి కాలింగ్ బెల్ నొక్కాను. తలుపులు వెంటనే తెరుచుకున్నాయి. కొంచెం ఆశ్చర్యంగా "నిద్రపోలేదా?" అన్నాను.

"మీరు వస్తారని తెలుసు. మీకోసమే ఎదురుచూస్తున్నాను."

"తెలుసా? ఎలా?"

"ఇందాక సమీరా, నేను దగ్గిర దగ్గిరగా వున్నప్పుడు మీ కళ్ళు చూసాను. నాకు నిజంగా భయంవేసింది. సమీరను వదిలేసేవాడినేమోకూడా. కానీ తనను కష్టపెట్టడం ఇష్టంలేక .... .... ...."

"సమీరను మీరు ప్రేమిస్తున్నారా?"

"నాకు తెలీదు."

"అంటే?"

"తనూ నేనూ ఎలాగో, ఎందుకో సన్నిహితంగా వచ్చాం: అంతే."

"సమీరను పెళ్ళిచేసుకోగలరా?"

"చేసుకోలేను. ఆ అవకాశం లేదు. అది సమీరకు తెలుసు. నేనే చెప్పాను."

"ఇదంతా మీ భార్యకు ద్రోహం కాదా? అంతరంగంలో ఆమెకు చికాకుగా లేదా, మీకు [illegible] వాళ్ళతో ఉంటారా?"

"నా భార్య విడాకులు [illegible] ఇస్తే తప్పకుండా ఇచ్చేవాడిని. కాని కోరటం లేదు. [illegible] నేనంటే చాలా ప్రేమ. నా అఫైర్స్ తనకు తెలుసు. వాటి గురించి పట్టించుకోదు. మా వివాహం విచ్ఛేదం కాకుండావుంటే చాలునని కోరుకుంటుంది. తనకి నేను కష్టంకలిగించలేను. అదీగాక మాకొక బాబూ, పాపా వున్నారు. వాళ్ళ క్షేమంకూడా నాకు కావాలి."

నాకు కోపమూ, గౌరవమూ రెండూ కలుగుతున్నాయి. కోపం అతని నిర్లక్ష్యవైఖరికి, గౌరవం అతని నిజాయితీకి.

"సమీరని నాతో తీసుకుపోదామని వచ్చాను."

"తీసికెళ్ళండి. అదే తనకి చాలా మంచిది."

అతని కంఠంలో జీర లేకపోలేదు. కానీ, చాలా సిన్సియారిటీ వినిపిస్తోంది.

"మీ సహకారం కావాలి. మీరు వెళ్ళమని చెప్పాలి."

"అది నావల్లకాదు. నన్ను ప్రేమించే వాళ్ళని నేను కష్టపెట్టలేను."

నాకు కోపం వచ్చింది.

"ఎంత సేపూ నేను ప్రేమించే వాళ్ళని........ అనే అంటారు. మీరు ప్రేమిస్తున్నవాళ్ళు ఎవరూ లేరా? మీ

కనలు ప్రేమ అంటే ఏమిటో తెలీదా,

"ఎందుకు తెలీదూ? నా మనసులో ఉన్నదంతా ప్రేమే? ఈ లోకాన్నంతటినీ – ఈ పచ్చని మైదానాలన్నీ – ఠీవిగా తలఎత్తి నిలబడే ఆ కొండల్నీ, విశాలమైన సరసుల్నీ, అనంతమైన సాగరాన్ని ఉధృతమైన జలపాతాల్నీ – అన్నింటినీ – అందరినీ ప్రేమిస్తున్నాను. ఇంతవరకు నేను ఏ ఆడపిల్లనీ నా జీవితంలోకి ఆహ్వానించలేదు. వాళ్ళే వస్తున్నారు. నేను తిరస్కరించలేను."

నాకు కోపం వస్తోంది. ఎంత కోపం వచ్చినా [illegible] ఈ వ్యక్తిని [illegible]లేకపోతున్నాను.

"ఒక ఆర్టిస్ట్‌గా నేను [illegible] జీవితా[illegible] [illegible]తున్నాను. ఇవన్నీ ఇల్యూజన్స్ – ఇది ప్రాక్టికల్ లైఫ్ [illegible] [illegible]."

అ[illegible]న్నాను.

"ప్రాక్టికల్ లైఫ్?.. .... అంటే ఏమిటి? ప్రాక్టికల్ లైఫ్ ఏ విధంగా ఎంతవరకు ఉపయోగపడుతుందని మీరు ఇందాక నయాగరాఫాల్స్ చూస్తూ అలా ఉండిపోయారు – ఆ రంగు రంగుల విద్యుత్కాంతులన్నీ ఇల్యూజన్స్ అని మీకు తెలీదా? మరి, ఆ రంగుల నుండి విడదీసినట్టి నీటిరంగు ఊహించటానికి ప్రయత్నించారా? ఆ మాటకొస్తే, ప్రతి సూర్యోదయమూ, సూర్యాస్తమయమూ, సప్తవర్ణాల ఇంద్రధనుసులూ, ఇవన్నీ ఇల్యూజన్స్ కావా? వాస్తవిక సత్యాలు, శాస్త్రీయమైన సత్యాలు – ఈ రంగురంగుల కలల కతీతమైనవని మనకు తెలీదా? కానీ, ఈ రంగులూ, రుచులూ మన కళ్ళముందు లేకపోతే మన జీవితాలు ఎంత నిస్సారంగా ఉండేవి" విభ్రాంతితో వింటున్నాను. అతని మాటల్లో నిజాన్ని కాదనలేకపోతున్నాను.

"కానీ, మీరు ఇంత మంది ఆడపిల్లల్తో .... ఇలా .... వాళ్ళంతా బాధపడటంలేదూ?"

"ఒకసారి చెప్పాను. మళ్ళీ చెప్తున్నాను – నేను ఎవరినీ ఆహ్వానించలేదు. ఎవరినీ బాధపెట్టటంలేదు – అన్నట్లు మీరంతా శ్రీకృష్ణున్ని దేవుడని ఎందుకంటున్నారు?"

అతను ఏ పాయింట్‌పైన డ్రైవ్ చేస్తున్నాడో అర్థమయింది. అతనితో ఇంకొంచెంసేపు మాట్లాడితే, నేనేమయిపోతానో అని భయం వేసింది. అంత కన్విన్సింగ్‌గా వుంది అతని వాయిస్. అకస్మాత్తుగా 'తూర్పు–పడమర' సినిమా గుర్తొస్తోంది. శరీరం జలదరించింది.

"భయపడకండి. అజ్ఞానం భయానికి మూలం – మన జ్ఞానంలో మనముంటే, దేనికీ భయపడక్కరలేదు." అతడు నేను నోరు మెదపకుండానే నా ఊహలు చదివేస్తున్నాడు. అఖండమైన తెలివి. ఆడపిల్లలు ఇతన్ని ఎందుకింతగా ప్రేమిస్తున్నారో అర్థమయింది. లేచి




మా గదిలోకి వచ్చేశాను. సమీర హాయిగా నిద్రపోతోంది. నిద్రలోకూడా దాని పెదవులు చిరునవ్వుతో విచ్చుకొన్నట్లుగా వున్నాయి— దానికి ఇంత ఆనందాన్నీ, సంతృప్తినీ, శాంతినీ ఈయగలిగిన ఈ అనుభూతి అబద్ధమా? నిషిద్ధమా? ఏమో? దీనికి బుద్ధిచెప్పి ఇంటికి తీసుకుపోవాలని వచ్చిన నేనే అయోమయంలో పడిపోయేలా ఉన్నాను.

ఆ మరునాడు ముందుగా క్వీన్ విక్టోరియా పార్క్‌కి వెళ్ళాం. దూరంగా స్కైలాన్ టవర్ కనిపిస్తోంది, ఎత్తుగా. ఎటు చూసినా పచ్చదనం— తెలుపు, ఎరుపు, పసుపురంగులలో రకరకాల పూలు కళ్ళ పండువుగా— వాంఛలా అవి? డాలియాలలో వింతరకాలా? కలువలలో కొత్తరకం మెట్టకలువలా?

ఏమో ఎక్కడ చూసినా జంటలుగా స్త్రీ పురుషులు. ఎవరూ మరొకరిని పట్టించుకోరు. ఎవరి లోకం వారిది. ఇంటర్‌నేషనల్ బౌండరీ దాటి కెనెడియన్ వైపుకి వెళ్ళాం— నయగరా ఫాల్స్‌లో అందమైన భాగం కెనడావైపే వుంది. అటువైపు ఈ జలపాతాన్ని "హార్స్ షూ ఫాల్స్" (Horse Shoe Falls) అంటారు. గుఱ్ఱపునాడా ఆకారంలో వంపుతిరిగి వుంటుంది. అందుకని—రాత్రి రంగురంగుల విద్యుద్దీపాల కాంతులలో కింపే ఏ రంగులూ లేకుండా

మరింత మనోహరంగా వుంది ఆ దృశ్యం. ఎడతెగక మహోధృతంగా దూకే జలధారలు. ప్రకృతి ఏదో మహా నంది పారవశ్యంలో నగ్నంగా నృత్యం చేస్తున్నప్పటి మనోహరత్వం—ఆ వేగానికి నీటి తుంపరలతో ఏర్పడిన మిస్ట్ మబ్బుల్లా చాలాదూరం ఆవరిస్తోంది.

సాగర్ తన కోటు తీసి సమీరకు తొడిగాడు; అప్పుడు కాని నాకు తెలీలేదు, సన్నగా వానజల్లు పడుతోందని - సమీర పెదవులమీద కృతజ్ఞత సూచించే చిరునవ్వు - అక్కడినుంచి రెస్టారెంట్ కి వెళ్ళాం. బ్రెడ్ టోస్ట్ తింటున్నప్పుడు "సారీ! నా పర్స్ ఆ కోటుజేబులో వుంది." అంటూ ముందుకు వంగి సమీర తొడుక్కున్న కోటుజేబులోంచి తన పర్స్ తీసుకున్నాడు. టీ తాగాక "మళ్ళీ మరోసారి "సారీ! అవతలవైపు జేబులో నా సిగరెట్లు వున్నాయి." అంటూ ఆ జేబులోంచి సిగరెట్లు తీసుకున్నాడు. ముగ్గురమూ కారువైపుకు నడుస్తున్నప్పుడు సమీర కృత్రిమకోపంతో "ఇంకా తీసుకోవలసిన వేమైనా వున్నాయా?" అంది.

"లేవు-ఇవన్నీ పెట్టెయ్యాలి అంతే!" అంటూ సిగరెట్ పాకెట్ ఒక జేబులోనూ, పర్స్ మరో జేబులోనూ పెట్టేసాడు.

"మళ్ళీ తీసుకోవాలా?"

"అవసరమైనప్పుడు-"

నేను కూడా నవ్వు ఆపుకోలేక పోయాను. నవ్వేసాను. సాగర్ మెరుస్తున్న కళ్ళతో చూసాడు, "అర్థం చేసుకున్నారా?" అన్నాడు.

ఆ తరువాత Table Rock observation Plazaకి వెళ్ళాం- టన్నెల్స్ ద్వారా, జలపాత మట్టానికి దిగువగా ఏర్పాటు చేసారు. జలపాతాన్ని చాలా దగ్గరగా చూట్టానికి వీలుగా. రెయిన్ కోట్స్ వేసుకుని వెళ్ళాం. టన్నెల్స్ లోంచి వెళ్తొంటే, నీటి తుంపరలు మీద పడతాయి. అవి నయగరా జలపాతపు నీటిబిందులవు లనుకొంటే, ఏదో అద్భుత భావన-టన్నెల్స్లోంచి బయటపడగానే అతి దగ్గరగా ప్రత్యక్షమవుతుంది జలదేవత ఉధృత విశ్వరూపం! ఆ అపూర్వ జలపాతపు బాహిర స్వరూపాన్నే కాక, దాని హృదయాన్ని సహితం దర్శిస్తోన్న అనుభూతి-

'సమీ! ఎంతటి ప్రగాఢమైన ఆకర్షణ? ఏమి విచిత్ర సౌందర్యం! హద్దూ పద్దూలేని ఆకాశంలో ఎలా ఎలుగెత్తి పిలుస్తున్నాయి, ఈ అందాలు? వీటిలో పడి చస్తేనేం?'

ఒక విధమైన ఉద్వేగంతో ముందు కడుగు వేసాను - భయంతో నా చెయ్యి పట్టుకుంది సమీర. "జాగ్రత్త అక్కయ్యా! అక్కడ చైన్స్ ఉన్నాయనుకో! అయినా అంత దగ్గరగా వెళ్ళకు."

"ఏం వెళ్తే? ఇంతటి అందాన్నీ,

ఆనందాన్ని దగ్గిరగా అనుభవించాక చస్తేనేం?"

సమీర భయంగా చూసింది. నా చెయ్యి పట్టుకొని బలంగా ఊడ్చుకొచ్చి నట్లు అక్కడ్నుంచి లాక్కొచ్చేసి, ఆయాసపడిపోతూ "హమ్మయ్య! ప్రమాదం దాటిపోయింది. నీ ధోరణి చూస్తే నిజంగా ఆ జలపాతంలోకి దూకేస్తావేమోనని అనిపించింది. అలా దూకిన వాళ్ళు వున్నారట!" అంది.

"ఉండనే వుంటారు, పెద్ద ఆకర్షణలో పడి మునిగిపోయేవారు."

సమీరా, సాగర్ ఇద్దరూ నావైపు చూసారు. ఇద్దరికీ నా మాటలు అర్ధమయ్యాయి–సాగర్ ముఖంమీద మబ్బులు సమీర కనుకొనల్లో చిరుజల్లులు!

(Maid of the mist) "మెయిడ్ ఆఫ్ దిమిస్ట్"లో వెళ్దామా?, అన్నాడు సాగర్. అది బోట్ పేరు. నదిమీదుగా జలపాతానికి మరికొంత సన్నిహితంగా తీసికెళ్తుంది అది.

"వద్దు! వద్దు!" అంది సమీర భయంగా.

"ఏం ఫరవాలేదు. నేను జలపాతంలో పడిపోను. నిన్ను పడనీయను. వెళ్దాం!" అన్నాను.

జలపాతానికి సన్నిహితంగా వెళ్తున్న కొద్దీ బోట్ అటూ ఇటూ ఊగసాగింది. భయం– ఉల్లాసం– ఒకదానితో ఒకటి పెనవేసుకొన్న ఆకర్షణ– శరీరాన్ని పులకింపచేసే చిరు నీటిజల్లులు—మొత్తం బోట్‌నే కప్పివేసేలా ఉన్న నీటి తుంపరల మబ్బులు!

ఆ తరువాత (Marine land) మెరైన్ లేండ్‌కి వెళ్ళాం. అక్కడ మిగిలిన డాల్ఫిన్ షోలతోపాటు అత్యంత ప్రమాదకరమయిన తిమింగిలాల చేత నిర్వాహకులు చేయించిన ఫీట్స్ కూడా చూసి, కారులో తిరుగుముఖం పట్టాం!

చీకట్లో బారులు తీరిన కార్ల విద్యుద్దీపాల వెలుగులు! కొన్ని వెనక్కి—మరి కొన్ని ముందుకి! సాగర్ డ్రైవ్ చేస్తున్నాడు. అలసిపోయినదానిలా సమీర అతని భుజంమీద తలవాల్చి నిద్రపోతోంది. ఆదృశ్యం చూడటానికి ఎంతో బాగుంది. సమీరను ఇక్కడినుంచి తీసుకుపోదామనుకొంటే దానికంటే ముందు నాకే బాధగా వుంది. కానీ తప్పదు.

ఆ మరునాడే సంభాషణ ప్రారంభించాను. నే నిక్కడ ఎక్కువ రోజులు వుండటానికి వీల్లేదు.

"సమీరా! నే నెందుకు వచ్చానో తెలుసా?"

"ఊహించాను!"

"నీ సమాధానమూ నేను ఊహించగలను– కానీ ఒక్క విషయం ఆలోచించు. నయగరా ఎంత అందంగా వున్నా దానిని మనం ఏ విధంగానూ యధాతథంగా ఉపయోగించుకోలేం! దానికి మనం లొంగిపోతే, అది మనను

మింగేస్తుంది. దానిపైన మనం ఆధిపత్యం సంపాదిస్తే, ఆ వుధృతాలను మన ఇంటి వెలుగులుగా మార్చుకోవచ్చు. ఆ తిమింగిలాలు చూడు? మనం కళ్ళు మూసుకు సముద్రంలో దిగితే క్షణంలో మనని నమిలేస్తాయి. నేర్పుగా బంధించి లొంగదీసుకొంటే, చెప్పినట్లు ఆడుతున్నాయి. ప్రకృతికి మానవుడికీ ఎప్పుడూ సంఘర్షణే! ప్రకృతికి లొంగిపోయినవాడు నాశనమవుతున్నాడు. దీనిని లొంగదీసుకున్నవాడు మానవజాతి చరిత్రను మరో అడుగు ముందుకు నడిపిస్తున్నాడు."

"నిజం నిజం! నిజం నాకు తెలుసు, నా దారి మారిపోదు! కానీ సాగర్‌ని వదిలి వుండలేను."

"కాని అది తప్పదు_ ఇవాళ కాకపోతే రేపు_కాకపోతే ఎల్లుండి_లేదా, మరి కొన్నాళ్ళ తరువాతో_ అంతే? అప్పుడు_ అప్పుడు ఏం చేస్తావు సమీరా? పిచ్చి పిచ్చి పిచ్చిదానివయిపోతావ్. లేకపోతే ఆ నయగరాలో దూకి ఆత్మహత్య చేసుకుంటావా సమీరా! అప్పుడు నీకు తోడుగా ఎవరూ ఉండరు. ఎవరి దగ్గిరనుండీ ఒక్క సానుభూతి వాక్యం కూడా నీకు దొరకదు_ నీ సాగర్ మాత్రం తన మనసులతో ఆడుకొంటూ వుంటాడు హాయిగా."

"అక్కయ్యా!"

"నీకు తెలుసు ఆ నిజం. సాగర్‌ని నేను అర్థంచేసుకున్నాను. అతడు ఏ రకంగానూ నిన్ను మభ్య పెట్టలేదు_ వద్దు సమీ! నయగరా అందాలు దూరంనుంచి చూసి ఆనందించాలి_ ఆ ఆనందపు అనుభూతులు మనసులలో నింపుకోవాలి. అంతేకానీ, దానిలో దూకి చావాలనుకో కూడదు.

"ఆ విషయం నువ్వే చెప్పావు నాకు, నిన్న."

సమీర తన పెద్దకళ్ళతో బేలగా చూసింది_ ఆ కళ్ళనిండా నీళ్ళు_అవి నన్ను చెయ్యిపట్టుకుని బరబర బయటకు లాక్కుపోవటం గుర్తుకొచ్చింది. ఇప్పుడు నేను అదేపని చెయ్యాలి. సమీరతో [illegible] ఏ క్షణాల్ని నేను చెయ్యిజారనీయకూడదు,

చకచకా నాకు తోచినట్లు సామాను సర్దేసాను. ఇండియాకి టికెట్ బుక్ చేయించి రిజర్వేషన్ ఫోన్‌లో కన్‌ఫర్మ్ చేయించాను. దాని చెయ్యి వదలకుండా టాక్సీలో కూలేసి ఎయిర్‌పోర్ట్‌కి తీసుకొచ్చేసాను. అప్పటికే అక్కడ సాగర్ వున్నాడు. నాకు చాలా ఆనందం కలిగింది. నా ఆలోచన సాగర్‌కి చెప్పినా, అతను ఏ ఆటంకమూ కలిగించలేదు. నిర్లక్ష్యంతో ఊరుకోనూలేదు. ఇతడిలో ఏదో ఆర్ద్రత వుంది. స్నేహశీలత వుంది. "థాంక్స్ సాగర్!" అని నేనే అతడికి చెయ్యి అందించాను. స్నేహపూర్వకంగా నా చేయి అందుకని వదిలేసాడు విడవలేనట్లు

నా భుజంమీద వాలిపోయిన సమీరను చెయ్యిపట్టుకుని తన మీదకు లాక్కొని గట్టిగా ముద్దుపెట్టుకుని, వెంటనే అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

కళ్ళు రెండూ కన్నీటి తెరలతో మసకబారిపోయి బొడ్డిదానిలా వున్న సమీరను చెయ్యిపట్టుకుని విమానంలోకి నడిపించుకొని వెళ్ళాను. *




పట్టాభి తెల్లవారుఝామునే లేచి దాదాపు రెండుమైళ్ళు నడిచి యింటికి తిరిగి వస్తున్నాడు. అప్పటికి యింకా సూర్యోదయం కాలేదు. వెలుగొచ్చింది. రోడ్లు యింకా రద్దీని పుంజుకోలేదు. రోడ్డు పక్క చెత్తకుండీదగ్గర మునిసిపల్ లారీ ఆగివుంది. కుండీలోని చెత్తని లారీలోకి ఎగుమతి చేస్తున్నారు మునిసిపాలిటీ స్వీపర్లు.

పట్టాభి తన యింటికివచ్చి అరుగు మీద కూర్చుని ముఖం కడుక్కున్నాడు. పైపంచెతో ముఖం తుడుచుకుంటున్నాడు. అరవైయేళ్ళు దాటాయి అతనికి. బుగ్గ మీసాలు తెలుపునలుపు కలిసి వెలుగు, చీకటుల కలనేత కుచ్చుల్లా వున్నాయి. తల బాగా నెరసింది. నల్లవెంట్రుకలు మచ్చుకి అక్కడక్కడ వున్నాయి. మోకాళ్ళదాకా ఖద్దరు పంచె, వంటిమీద రెండు జేబులున్న ఖద్దరు బనీను పైమీద ఖద్దరు తుండుగుడ్డ, అతని నిత్య వేషధారణ. ఆ పట్టణంలో పట్టాభిని ఎరుగనివారు లేరు. పెద్దలూ ఎరుగుదురు. పిన్నలూ ఎరుగుదురు.

చెత్తకుండీలోని చెత్తను లారీలోకి ఎగుమతిచేస్తున్న జనంలోంచి కోటయ్య, పట్టాభి దగ్గరకువచ్చి నిలబడ్డాడు. "ఏరా కోటయ్యా" అని పలకరించాడు పట్టాభి, యేంపనిమీద వచ్చావు అన్నట్టు. "దుర్గ

తెల్లారగట్ట పోయింది బాబు!" అన్నాడు కోటయ్య.

ఆ మాట విన్న పట్టాభి క్షణంపాటు అలాగే వుండిపోయాడు. 'దుర్గ పోయిందా!' అని తనలోతానే అనుకొని యింట్లోకి కూడ వెళ్ళకుండా, చెంబు అరుగుమీదనే వదిలేసి పాకీవాళ్ళ పేట వైపు బయలుదేరాడు. ఆ పేట పేరు యిప్పుడు నెహ్రూనగర్.

నెహ్రూనగర్‌లోని దుర్గ యింటి ముందు నిలబడ్డాడు పట్టాభి. అది డాబా యిల్లు కాదు. నిట్టాట గుడిశ. చుట్టూ మట్టిగోడలు- ముందు తలుపుగుమ్మం. నలభై యేళ్ళక్రితం ఎలావుందో యీ నాటికీ అలాగేవుంది దుర్గ నిట్టాట గుడిశ.

తలుపు బార్లా తెరిచివుంది. లోపల చాపమీద దుర్గశవం. ఎనభై యేళ్ళ వృద్ధురాలు నిద్రపోతున్నట్టే వుంది- కానీ శవంలాలేదు.

గుడిశముందు పిల్లలు ఆడుకుంటున్నారు. గుమ్మానికి ఓ పక్కగా ఓ ముసలాడు శవానికి కాపలాకాస్తున్నట్లు కూర్చున్నాడు.

"ఏరా ముసలయ్యా! ఎప్పుడు పోయింది?" అనడిగాడు పట్టాభి శవాన్నే చూస్తూ.

"రాత్రి పోయింది బాబూ, తెల్లారినాకా సూసావ్!" అన్నాడు ముసలయ్య.

"మరింకా శవాన్ని అలాగే వుంచేరేం?"

"ఏకకటం అంటే ఎనభైయేల్లు బతికినాదెగాని, ఆ ముసలిముండకి ఎవరున్నారు బాబూ? కొడుకులా, కొడల్లా, మనవలా, అందరూ తలోసారి తొంగిచూసి ఎవరి పనికి ఆల్లు ఎల్లిపోనారు. పనిసెయ్యటానికి వయసుమల్లిపోయిన నేనూ- పనిచేసే వయసురాని పిల్లలూ సూత్తా కూకున్నావ్."

"మరైతే అలా వదిలేస్తారట్రా శవాన్ని?" అన్నాడు పట్టాభి కాస్త ఆవేశంగా.

"లేదులేబాబూ- మునిసిపాలిటీ మదుసులం కదా మేవంతా, మా సిన్నోడ్ని ఆఫీసరుగోరితో సెప్పమన్నాను. బండొత్తదిలే." అన్నాడు ముసలయ్య.

"మునిసిపాలిటీ బండిమీద మోయించి తగలెయ్యాల్సిన కర్మ దుర్గ శవానికి పట్టదూ- పట్టకూడదు. నేనున్నానులే!" అని అక్కడనుంచి కదలి దహన క్రియలకు అన్నిఏర్పాట్లూ చేశాడు పట్టాభి.

పట్టాభి పూనుకోవడంలో నలుగురూ చేరారు.

దుర్గ దహనక్రియలు పట్టాభి మూలంగా ఘనంగానే జరిగాయి. తన పైమీద కప్పుకున్న దుర్గ శవంమీద కప్పాడు పట్టాభి. దాంతో ఎవరో గొప్ప వ్యక్తి శవం అనిపించింది జనానికి.

దహనక్రియలు ముగించుకుకొని- యేట్లో స్నానంచేసి యింటికి వచ్చాడు పట్టాభి.

"స్నానం చేసే వచ్చారా?" అంది అతనిభార్య జానకమ్మ.

"ఆ" అన్నాడు పట్టాభి.

"పేటలో పాకీది పోతే దాని దహన క్రియలు కన్నకొడుకులా మీరు స్వయంగా చేయటం ఎందుకు? అంత అభిమానంవుంటే ఏదో పరకో పారేస్తే పోలేదు." అంది పట్టాభిభార్య జానకమ్మ మనసులో మాటను యిముడ్చుకోలేక.

పట్టాభి జానకమ్మవైపు తీక్షణంగా చూసి, "దబ్బుతోనే అన్ని ఋణాలు తీరిపోవు" అన్నాడు ముక్తసరిగా.

జానకమ్మ ఇంక మాట్లాడలేదు.

మళ్ళీ పట్టాభే అనునయంగా జానకమ్మ దగ్గరగా వెళ్ళి, "దుర్గ పాకీ పేటలో వున్నా - నాకు అమ్మకంటె ఎక్కువది జానకీ మా అనుబంధం ఎలాంటిదో నీకు తెలీదు. తెలియక అలా మాట్లాడగలిగావు. తప్పులేదు" అన్నాడు.

'ఏమిటా అనుబంధం?' అన్నట్టు చూసింది జానకమ్మ, పట్టాభి ముఖంలోకి.

"చెబుతా విను" అని దుర్గ కథను మొదలుపెట్టాడు పట్టాభి.

"భారత స్వాతంత్ర్య పోరాట జ్వాలలో దేశం మారుమూలలనుంచికూడ చెలరేగిన రోజులవి. నేను అదే పట్టణంలో కాలేజీలో ఇంటర్మీడియట్ చదువుతున్నాను. దేశంలో గాంధీజీ నాయకత్వంలో జరుగుతున్న సత్యాగ్రహాలగురించీ వింటున్నాం. భగత్‌సింగ్, వీరసావర్కార్, సుభాష్ చంద్రబోస్‌లాంటి వీరుల ధైర్యసాహసాల గురించీ చదువుతున్నాం. ఎందుకో నన్ను విప్లవవీరుల త్యాగాలు విపరీతంగా ఆకర్షించాయి. కాలేజీకి వెడుతున్నానన్న పేరేగాని మనసంతా ఏదో దేశానికి చెయ్యాల్సింది చేయలేకపోతున్నానన్న ఆవేదన!

చివరికి కాలేజీ చదువుకి స్వస్తి చెప్పాను. ఆ నాటికి దుర్గ పరిస్థితి ఏమిటో తెలుసా!

పుట్టింది పాకీకులంలోనైనా, బ్రతుకుతున్నది పాకీపేటలోనైనా, తన కుల వృత్తి చేసేదికాదు ఆమె.

బట్టకట్టి బజారులో తిరిగే ప్రతి వాళ్ళకి దుర్గపేరు తెలుసు. దుర్గ ముఖం పరిచయమే.

దుర్గ, మునిసిపల్ కౌన్సిలరూ కాదు. చైర్మనుకాదు! దుర్గ స్వాతంత్ర పోరాటంలో పాల్గొంటున్న నాయకురాలు కాదు!

దుర్గ ఏవిధంగాను చెప్పుకోదగ్గ హోదా, అంతస్తుగల వ్యక్తి కాదు! దుర్గ మార్కెట్‌లో పళ్ళదుకాణం పెట్టుకొని బతుకుతున్న సాదా ఆడది.

అయినా అందరికీ తెలుసు ఆమె.

ఆమె అందం అలాంటిది. ఆమె ముఖంలో కళ అలాంటిది. ఆకర్షణ ఆమె ఆస్థి.

పళ్ళబడ్డీమీద పళ్ళను అందంగా సైజులువారీగా పేర్చి, ఆ పళ్ళవెనుక కూర్చున్న దుర్గ పెద్ద వద్బుపంములా

వుండేది. గుండ్రని ముఖం, విశాలమైన నేత్రాలూ, పచ్చని ముఖాన ఎర్రని పెద్ద బొట్టూ, నిగనిగలాడే బుగ్గలు– సింధూరం దిద్దిన చంద్రబింబంలా వుండేది ఆమె ముఖం.

తహసీల్దారుగారు సాయంత్రం ఆఫీసునుంచి యింటికి వెడుతూ కారు దుర్గకొట్టుముందు ఆపి– డ్రైవరును పంపి పళ్ళు కొనుక్కునేవారు. డ్రైవరు పళ్ళు ఏరుతున్నంతసేపూ, ఆయన దుర్గనే చూస్తూ వుండేవాడు. డ్రైవరు ఎంపికచేసిన పళ్ళు మంచివే అయినా, మళ్ళీ మళ్ళీ ఏరించేవారు అతనిచేత. అంతసేపు ఆమెను చూస్తూ వుండేవాడు.

పట్టణంలో పెద్ద పెద్ద లాయరులు, ఆఫీసరులు రోజూ ఒక్కసారైనా దుర్గ కొట్టువైపు ఏదోవేళ తొంగిచూసేవారు. మచ్చలేని దుర్గ ముఖాన్ని చూస్తూ, దుర్గ నవ్వుల వెన్నెలలో తడుస్తూ, మచ్చ వున్న పళ్ళను కూడా మాటాడకుండా కొనుక్కుపోయేవారు.

మడికట్టుకొని గుడికివెళ్ళే పూజారి, దుర్గ కొట్టుముందు ఆగేవాడు రోజూ.

దేవుడికి నైవేద్యానికని రోజు ఏవో రెండు పళ్ళు పూజారికిచ్చేది దుర్గ.

"కడిగి నైవేద్యం మెట్టు బాబు" అనేది.

"నువ్వే కడిగినముత్యంలా వుంటావే– నీ చేత్తో యిచ్చిన పళ్ళు కడకక్కపోయినా దేవుడికి యిష్టమే!" అనేవాడు వెకిలిగా నవ్వుతూ.

"సరీ యెళ్ళిరండీ" అని అతగాడిని వదలించుకునేది. పోలీసులు– పోలీసు యినస్పెక్టర్లు బెదిరించి లొంగతీసుకోవా లని ప్రయత్నించారు దుర్గని.

దుర్గ నవ్వే దుర్గకు కవచం.

అంతమంది అలా ఆమె వెంటబడినా దుర్గ పళ్ళు అమ్ముకోవి బతికేదిగాని, వళ్ళు అమ్ముకోని బతకలేదు సినాడూ.

కాకపోతే ఆసరికి ఒక హెడ్ కాని స్టేబుల్‌తో సంబంధం పెట్టుకొంది అనేవారు.

అతగాడు తాళికట్టలేదు. నీకటి పడ్డాక ఎర్రటోపి తీసేసి, తెల్లపంచె మునుగేసు కొనిపాకీపేటలోని దుర్గఇంటికిచేరేవాడట.

మగదిక్కు అవసరమనే ఆ హెడ్ కానిస్టేబులుకు లొంగిందో– పరిస్థితుల వల్లే లొంగిందో ఎవరికీ తెలియదు.

దుర్గ వంద మామిడిపళ్ళ తట్టను నెత్తిన పెట్టుకొని రోడ్డున సులువుగా నడిచివెళ్ళేది. ముఖం అంత అందంగా వున్నా, పెద్ద కడుపూ, ఎత్తైన పిరుదులూ, మడమలు దిగేదాకా కట్టిన నేత చీర– గుండ్రని పుష్టిఅయిన శరీరం చూడ్డానికి బుట్టబొమ్మలా వుండేది.

దుకాణంలో కూర్చుంటే– తొండం లేని– వినాయకుని బొమ్మలా వుండేది.

అందుకే ఆ మనిషి రూపు ఆమె ఆకారము, అందం, అందరికీ బాగా గుర్తు.

అప్పటికి నే నెవరికీ గుర్తులేను. కాలేజి మానేసి తిరుగుతున్న పద్దెనిమి దేళ్ళ యువకుడ్ని. అల్లూరి సీతారామ రాజును గురించి ఎక్కువగా చెప్పుకుం టున్నాడు అప్పట్లో.

కొండ జాతి వారిని, కోయలను స్వాతంత్ర పోరాటంలోకి దించిన మహా వీరుడు నన్ను ఎంతగానో ఆకర్షించాడు.

నేను పూర్తిగా రంగంలోకి దూకే సాను. పాకీపేటలోకి రాత్రిళ్ళు వెళ్ళి ఆ యువకులకి స్వాతంత్రం గురించి చెప్పి, ప్రభుత్వానికి నష్టం కల్గించడం నా లక్ష్యం అనాడు. అధికారులను ధిక్క రించడం నా ఉద్యమం! ఒకసారి గూడ్సు రైలు పడగొట్టటానికి ప్రయత్నించాం. ప్రయత్నం విఫలమైంది. పోలీసుల దృష్టిలో పడ్డాను. అప్పుడు అండర్ గ్రౌండుకి వెళ్ళక తప్పలేదు.

నేను ఎక్కడెక్కడో తిరిగి దుర్గ గూటికి చేరితే రెండు మామిడిపళ్ళు తిని పెట్టి గంజినీళ్ళు యిచ్చేది. ఏ రోజుల్లో దొరికేపళ్ళు ఆ రోజుల్లో పెట్టేది నాకు. నే నేదో గొప్పపని చేస్తున్నానని ఆమె నమ్మకం. నేనంటే వెర్రి అభిమానం.

ఓ సారి మా పట్టణానికి జిల్లా కలెక్టరు వస్తున్నాడని తెలిసింది మాకు. కలెక్టరు తెల్లదొర.

కారుమీద బాంబు వెయ్యాలని ప్లాను వేశాం. అనుకున్నట్టే చేశాం. కానీ గురితప్పింది!

దాంతో నా తల ఖరీదు పదివేలరూపా యలకు పెరిగింది!

చివరికి నా శవం ఖరీదుకూడ పదివేలే!

పోలీసులు నా గురించి గాలించడం మొదలుపెట్టారు. కలెక్టరు ఆదేశాలు మూలంగా వాళ్ళకి నిద్రాహారాలు లేవు.

వాళ్ళతోబాటు నాకూ నిద్రాహారాలు లేవు. నిలచినచోట నిలవకుండా తిరుగు తున్నాను.

ఒకరోజు మా అమ్మకి జబ్బుగా వుందని తెలిసి, చూద్దానికి బయలు దేరాను. యింటి సమీపానికి వెళ్ళేసరికి పోలీసుల అలకిడి వినబడింది.

పరుగెత్తాను. శక్తికొద్దీ పరుగెత్తాను. వెనక బూట్ల చప్పుడు. చీకటి, యీదురు గాలి. సందుల్లోంచి - గొందుల్లోంచి జారుతూ - నిలదొక్కుకుంటూ శక్తి కొలదీ పరుగు. తుపాకీగుండుకి దొర క్కుండా పరుగు. ప్రాణాలను కాపాడు కోడంకోసం ఆరాటం యెలావుంటుందో ఆ రోజున తెలిసింది నాకు.

అలా పరుగెడుతూనే వున్నాను. వాళ్ళకీ నాకూ మధ్య రెండు ఫర్లాంగుల వడం.

అలా పరుగెడుతూ పాకీపేటలోనికి చొరబడ్డాను. వెనుక పోలీసులు వచ్చారు.

దుర్గ యింట్లోకి దూరాను.

"పోలీసులు" అన్నాను ఆయాస పడుతూ.

"బయంలేదు. దాంకో" అంటూ నన్ను

## పాపాయికి పుట్టుకతోనే మీరిచ్చిన కానుక- 3 నెలలకు సరిపడే ఐరన్



# 3 నెలలు నిండాక, కేవలం పాలే అతడికి కావలసిన ఐరన్‌ను సమకూర్చలేవు

అతడికి ఇవ్వండి **ఫారెక్స్** పుష్కలంగా ఐరన్ గలది

"తల్లినుంచి పెద్ద ఐరన్ నిల్వతో సహా పుడతాడు పాపాయి. అయితే పుట్టిన తర్వాత ఈ నిల్వ క్రమేపీ తరిగిపోతుంది. పాలు మంచి ఆహారమే అయినప్పటికీ, ఐరన్ లేనందువల్ల అది సంపూర్ణ ఆహారం కాదు. అందుకే పాపాయికి ఐరన్ గల ఆహారాలు కావాలి.''

డాక్టర్ సుభాష్ సి ఆర్య: "ఇన్‌ఫెంట్ అండ్ చైల్డ్ కేర్ ఫర్ ది ఇండియన్ మదర్''

**డాక్టర్లు ఫారెక్స్‌ని ఎందుకు సిఫార్సు చేస్తారు?**

ఫారెక్స్‌లో పుష్కలంగా ఐరన్ కూడా ఉంది—అది మీ పాపాయి రక్తానికీ, అతడి శరీర ఆరోగ్యానికీ, అతడి పెరుగుదలకూ, వికాసానికీ అతి ముఖ్యం.






**డాక్టర్లు సిఫార్సు చేస్తారు ఫారెక్స్**
**సత్వరమైన, సంపూర్ణమైన పెరుగుదల కోసం పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం**

CASGLF-30-163 Tel

దాచింది.

తలుపు తెరిచే వుంది.

పోలీసులు వచ్చారు. గుడిశలో దీపం బుడ్డి గుడ్డివెలుగు.

దుర్గ నిలబడివుంది బుట్టబొమ్మలా. పోలీసుల్లో తనకు పరిచయము వున్న హెడ్‌కానిస్టేబుల్ కూడ వున్నాడు.

"ఎక్కడ? వాడెక్కడ? యిటే వచ్చాడు!" అన్నాడు హెడ్.

"ఎవడాడు? నా యింటికెవడొత్తాడు?" అంది దుర్గ. ఆమె ఆ మాటలో నా యింటికి నువ్వు తప్ప మరో మగాడు ఎవదొస్తాడు అన్న ధ్వని వినిపించింది హెడ్‌కి.

హెడ్ కరిగి నీరై పోయాడు.

ఇనస్పెక్టరు ఊరుకోలేదు.

"ఆ పట్టాభిగాడు యిటే వచ్చాడు. నీ యింట్లోకే వచ్చాడు. ఎక్కడ దాచావో చెప్పు. పదివేల రూపాయల బహూమానము వస్తుంది." అని గర్జించాడు.

"ఇదెక్కడ గోలయ్యా బాబు! ఇదేవన్నా యేడంతస్తుల మేడా? రాజభవనవా? నిట్టాట గుడిశలో ఎక్కడ దాత్తాను? రాలేదు మొర్రో అంటే యినిపించుకోరేటి?" అంది దుర్గ.

"వెతకండి" అంటూ ఇనస్పెక్టరూ, పోలీసులు జవానులు గుడిశను గాలించేసారు.

వశ్శతట్టలను బొయినెట్లతో పొడిచి చూసారు! బూటుకాళ్ళతో తొక్కి చూశారు.

పెద్ద నీళ్ళగాబును పగలగొట్టారు. కుండల్ని పిండిచేసారు. ఎక్కడా నా జాడ దొరకలేదు వాళ్ళకి.

ఇహ ఉక్రోషం ఆపుకోలేక ఇనస్పెక్టరు దుర్గ దగ్గరకు వచ్చి "నువ్వే ఎక్కడో దాచావు వాడ్ని. చెప్పవే లంజ!" అని లాటీతో ఒక్క దెబ్బ వేశాడు, దుర్గ మొత్తమీద.

దుర్గ కుయ్యో మొర్రో మంటూ "అయ్యో యిదెక్కడ దారుణం బాబు! యిదేవన్నా యినపకోటా! లోనకొచ్చి నట్టే వచ్చి పారిపోయివుండొచ్చుగందా! నువ్వెతికితే దొరకనేదవి నన్ను కొడతావేంటి?" అని ఏడిచింది.

ఆ క్షణంలో నా మూలంగా దుర్గ వంటిమీద పడిన దెబ్బ నా గుండెలకే తాకింది.

"ఇక్కడున్నాను" అని గట్టిగా అరుద్దామనుకున్నాను.

దుర్గ నన్ను కదలనివ్వలేదు.

"మనల్ని మోసంచేసి పారిపోయి వుంటాడు సార్. మనం ఇక్కడేవుంటే తప్పించుకుపోతాడు." అని హెడ్ ఇనస్పెక్టరును అక్కడనుంచి కదలదీసాడు.

పోలీసులు వెళ్ళిపోయారు. అప్పటి దాకా వూపిరి బిగపట్టుకొని ఆమె రెండు కాళ్ళ మధ్య చీరకుచ్చెళ్ళ మాటున, తల్లి కడుపులో శిశువులా ముడుచుకొని వున్న నన్ను "పోయేరులే సచ్చినోళ్ళు-

బయటికిరా యింక" అంటూ_ చీర కుచెళ్ళ మాటునుంచి నన్ను బయటకు తీసింది_ శిశువును ప్రసవించిన తల్లిలా దుర్గ.

ఇప్పుడు చెప్పు జానకీ! కడుపున పడిన పిండాన్ని నవమాసాలూ మోసి శిశువును కంటేనేనా తల్లి! కొడుకు ఆ తల్లికే దహనక్రియలు చేయాలా? పద్దెనిమిదేళ్ళు పెరిగిన ఈ శరీరాన్ని శిశువును చేసి తన వడిలో తల్లిలా దాచుకొని ప్రాణం దానంచేసిన దుర్గ నాకు తల్లి కాదా?

ఆమె దహనక్రియలు నేను కాక యింకెవరు చేయాలి?" అన్నాడు పట్టాభి ఆవేదనతో నిండిన ఆవేశంతో.

జానకమ్మ దుర్గకథ విని కళ్ళు వత్తుకుంది పమిటకొంగుతో.

సెప్టెంబర్ నెల యువ భావపరిచయ పోటీ

బహుమానము రు. 25-00

బహుమతి పొందిన వ్యాఖ్య

వసుధ నుండి వెలసిన ఓ విష్ణుమూర్తి!
నీ చరణదాసి చేతిలో ఇదే నీకు పరమపాత్రి.

జి. సాంబశివరావు, చీరాల.

సీరియల్

# అగ్నిశిఖ

వాసిరెడ్డి సీతాదేవి

రాహుల్ హృదయం దెబ్బతిని ఆకాశం నుంచి కూలిపోయిన పక్షిలా గిలగిల లాడుతున్నది. భావనను మర్చిపోవాలని ప్రయత్నిస్తున్నాడు.

తను విన్నది నిజమా? నో! నో! అలా కావడానికి వీల్లేదు. అంతే వీల్లేదు భావన....

రాహుల్ గుండెల్ని ఎవరో పిండుతున్నట్టూ, ఒక్కొక్క రక్తపు బొట్టే ఉండీ ఉండీ కిందపడుతున్నట్టూ అనిపిస్తోంది.

రాహుల్ తనకు తెలియకుండానే లేచాడు. గోడ అలమరా తెరిచాడు. సొరుగు లాగాడు. తను ఊహించినట్టే రమేష్ తాలూకు స్కాచ్‌విస్కీ బాటిల్ చేతికి తగిలింది.

బాటిల్ తీసుకోబోయి ఓ క్షణం ఆలోచించాడు.

రమేష్ నవ్వుతున్నట్టు అనిపించి వెనక్కి తిరిగి చూశాడు. ఎవరూ లేరు. తన ఆత్మనుంచే ఆ నవ్వు వినిపించింది అని అర్థంచేసుకున్నాడు.

తలుపులు లోపల నుంచి బిగించాడు.

బాటిల్ తీసుకున్నాడు. మంచినీళ్లు గ్లాసులో తెచ్చిపెట్టుకున్నాడు. కుర్చీలో కూర్చున్నాడు.

రాహుల్ రమేష్‌ను ఎన్నోసార్లు మందలించాడు. రమేష్ ధనవంతుల బిడ్డ. ఎం. ఏ. ఫైనల్‌లో ఉన్నారు ఇద్దరూ. రమేష్, రాహుల్ ఇద్దరూ ఒక ఊరివాళ్లే. మొదటిక్లాసు నుంచి కలిసి గ్రామంలో చదువుకున్నారు. రాహుల్ తండ్రి ఆ ఊరి మిడిల్‌స్కూల్లో లెఖ్ఖల మాస్టరు. ఇద్దరు ఆడపిల్లల తర్వాత రాహుల్ పుట్టాడు. రాహుల్ పెద్ద

అక్కకు పెళ్లి అయింది. రెండో అమ్మాయికి ఇంతవరకు వివాహం కాలేదు. కట్నం ఇవ్వలేరు.

రాహుల్ పది పాసయ్యాడు ఫస్టు క్లాసులో. తండ్రి టీచర్ ట్రైనింగుకు వెళ్ళమన్నాడు. రాహుల్‌కు పైచదువులు చదవాలని ఉన్నది. కాని తన ఆర్థిక పరిస్థితులు తెలుసు.

రమేష్‌కు చదువుమీద పెద్దగా శ్రద్ధ లేదు. అయినా గుంటూరులో ఇంటర్‌లో చేరాడు. రమేష్ బలవంతంమీద రాహుల్ కూడా కాలేజీలో చేరాడు. రాహుల్ ఖర్చు రమేష్ భరిస్తానన్నాడు. రాహుల్‌కి అభిమానం అడ్డువచ్చింది. చివరకు రమేష్ ఒక గది తీసుకొనేట్టూ, ఆ గదిలోనే ఉండి రాహుల్ తన చదువును సాగించేట్టూ అంగీకరించాడు. అవసరం అయినప్పుడు డబ్బు అప్పుగా ఇస్తాననీ చదువు పూర్తి అయాక తీర్చుకోమనీ రమేష్ రాహుల్‌ను ఒప్పించాడు.

రాహుల్‌కు స్కాలర్‌షిప్ వచ్చింది. సాయంత్రం ఒక ట్యూషన్ కూడా చెబుతూఉంటూ వచ్చాడు ఇంటర్‌లో చేరినప్పటినుంచీ. రాహుల్ అవసరాలు చాలా తక్కువ. రమేష్‌కు హాస్టల్లో ఉండటం ఇష్టంలేదు. అందువల్లనే నాలుగు వందల అద్దెలో ఒకమాదిరి ఇల్లు తీసుకున్నాడు. తాతలనాటి నుంచి తమ ఇంట్లో పాలేర్లుగా ఉన్న కుటుంబాలలోని క్షుద్ర [illegible] వంటకు తీసుకొని వచ్చాడు.

రాహుల్ రమేష్‌తో ఉండటం వల్ల భోజనానికీ, వసతికీ సమస్య లేకుండా పోయింది.

రాహుల్‌ను ఎన్నోసార్లు తాగమని బలవంతం చేశాడు రమేష్.

ఆ రోజు ఆదివారం.

రమేష్ చుట్టూ అనేకమంది స్నేహితులు ఉంటారు. బెల్లంచుట్టూ చేరే ఈగలు గుర్తువస్తాయి రాహుల్‌కు వాళ్లను చూస్తుంటే.

రాహుల్ స్కాచ్‌తో సగంగ్లాసు నింపాడు. మిగతా సగం నీళ్లతో నింపాడు. ఒక గుక్క తాగాడు. గొంతులో మంట లేచింది. నోటికి రుచిగా లేదు.

దీన్నేనా రమేష్ అమృతం అంటాడు?

"ఒరేయ్ నీకు స్వర్గం ఎలాఉంటుందో చూడాలని లేదా ?" అంటాడు.

అందుకు తను చిరునవ్వు నవ్వి రెండో గదిలోకి వెళ్ళిపోతాడు.

ఒకోరోజు అతను స్నేహితులతో చేరి చేసే అల్లరికి అక్కడ్నుంచి పారిపోవాలనీ, మళ్లీ ఆ ఇంటికి రాకూడదనీ అన్పిస్తుంది. కాని తన అసహాయతను గుర్తు చేసుకొని భరించక తప్పదని నిర్ణయించుకుంటాడు.

ఒకరోజు రమేష్, సురేష్ తాగుతూ కూర్చున్నారు. రాత్రి పదకొండు గంటలైంది. టాక్సీ వచ్చి ఆగింది. తను అంతవరకూ ఆ గదిలోనే కూర్చుని



LIFEBUOY
for health
లైఫ్‌బాయ్
ఎక్కడో
ఆరోగ్యం అక్కడ
లైఫ్‌బాయ్‌తో స్నానం చేస్తే పరిశుభ్రంగా
ఉంటారు మీరు. ఆరోగ్యమైన తాజాదనపు
అనుభూతి పొందుతారు. లైఫ్‌బాయ్‌తో,
జీవితం ఆరోగ్యప్రదం. గుర్తుంచుకోండి—
లైఫ్‌బాయ్
మురికిలో గల క్రిములను
కడిగి వేస్తుంది

చదువుకుంటున్నాడు. టాక్సీ నుంచి సూర్యం, రఘు ఒక ఆడపిల్లను వెంట బెట్టుకొని వచ్చారు. ఆ పిల్ల కట్టూ బొట్టూ చూడగానే తనకు అర్థంఅయింది. వెంటనే లేచి దూకుడుగా బయటికి వెళ్ళి పోయాడు.

"ప్రవరాఖ్యుడు పారిపోతున్నాడు!" సురేష్ ముద్దముద్దగా అనడం, అందుకు అందరూ విరగబడి నవ్వడం వెనుక నుంచి విన్పించింది తనకు.

అరాత్రి తనకు ఎక్కడకు వెళ్ళాలో తెలియలేదు.

ఆలోచిస్తూనే కళ్ళు మూసుకొని సగం గ్లాసులోని ద్రవం గటగట తాగాడు రాహుల్.

గొంతులోని మంట గుండెలోకి పాకినట్టు అయింది.

ఆ రాత్రి.... ఏ రాత్రి.... అరే అప్పుడే తన మెదడు మొద్దుబారి పోతుందేం.... అదే ఆ రాత్రి తాను ఎక్కడ గడిపాడు? తలమీద అర చేతితో కొట్టుకున్నాడు. ఆ గుర్తొచ్చింది. రెండో ఆట సినీమాకు వెళ్ళాడు. అప్ప టికే ఇంటర్వెల్ కావస్తోంది. హాలు నుంచి బయటికి వచ్చేసరికి ఇంకా రెండు కాలేదు.

మరో ఆటకూడా ఉంటే బాగుణ్ణు అనుకున్నాడు. గదికి వెళ్ళాలనిపించ లేదు. ఎక్కడో పడుకోవాలి? ఎక్కడ? రైల్వేస్టేషన్‌కు వెళ్ళాడు. మూడోక్లాసు వెయిటింగు రూంలో ఒక మురికిబల్లమీద పడుకున్నాడు.

ఆనాటినుంచి రమేష్ రాత్రిళ్ల ఎక్క డైనా తిరిగి వస్తాడు. కాని ఆడపిల్లల్ని గదికి తీసుకురాడు. రమేష్ చెడ్డవాడు కాడు. చెడు అలవాట్లు ఉన్నాయి. అవి ఇతర్లను ఏమీ చెయ్యవు. కాని అతన్నే తినేస్తున్నాయ్. తను ఎంతగానో చెప్పాడు.

"నాలుగురోజుల జీవితం. దొరికినంత వరకు ఆనందాన్ని జుర్రుకోవడమే నా జీవిత లక్ష్యం!" అంటాడు రమేష్.

పెదవులు తిమ్మిరెక్కాయి. బుగ్గల్లో నుంచి వెచ్చటిగాలి వస్తోంది. తన మెదడును ఏదో పొగలా పొర చుట్టి వేస్తున్నది. అంతవరకూ బరువుగా, దిగులుగా ఉన్న గుండె తేలిగ్గా అవుతు న్నట్టుంది.

ఎవరో తలుపు దడదడ బాదు తున్నారు? రమేష్ వచ్చాడా? ఇవ్వాళ ఆలస్యంగా వస్తానన్నాడుగా? ఇప్పు డిప్పుడే ఏడు అయింది.

మళ్ళీ తలుపు చప్పుడు.

రాహుల్ తడబడుతూ వెళ్ళి తలుపు తెరిచాడు.

ఎదురుగా సుమతి నిల్చుని ఉన్నది.

రాహుల్ తడబడ్డాడు_

"మీ.... మీరా....?"

"అవును! నేనే!" నవ్వుతూ లోపలకు రాబోయింది.

"బడికి వెళ్లే
పిల్లల్లో పదింట
ఏడుగురికి పిప్పి
పళ్లున్నాయి."
(—మార్కెట్ సర్వే, మార్చి 1978
(ఇండియన్ డెంటల్ అసోసియేషన్



పంటి నొప్పి దంత క్షయానికి సూచన.
మీ నోటిలో ఉండే సూక్ష్మజీవులు ఆహారపు
తునకలను హానికరమైన ఆమ్లాలుగా మారుస్తాయి.
ఈ ఆమ్లాలు మీ పళ్లమీద దాడిచేసి వాటిని
నొప్పి కలిగించే పిప్పి పళ్లుగా మారుస్తాయి.

# వాడండి ఫ్లోరైడ్‌గల సిగ్నల్ 2
# పిప్పిపళ్లను అరికట్టేది

ఫ్లోరైడ్ గల సిగ్నల్ 2 దంత క్షయాన్ని రెండు విధాలుగా అరికడుతుంది: పిప్పి పళ్లకు కారణమైన నోటి ఆమ్లాలను తయారుచేసే సూక్ష్మజీవులను నిరోధిస్తుంది, పంటి ఎనామెల్‌తో కలిసి దాన్ని మరింత గట్టి పరుస్తుంది—పిప్పి పన్ను కాకుండా మరింత బాగా నిరోధించ గలిగేలా. దానికి కారణం, పిప్పి పళ్లు కాకుండా చూసే ప్రత్యేక పదార్థం ఫ్లోరైడ్, అద్వితీయమైన సిగ్నల్ సూత్రీకరణలో అత్యుత్తమంగా పనిచేయడమే.

ఇప్పుడే—మరీ ఆలశ్యం కాకుండానే—తెచ్చుకోండి సిగ్నల్ 2. అది మీ కుటుంబంలోని వారి పళ్లు పిప్పి పళ్లు కాకుండా కాపాడుతుంది.




పిప్పి పళ్లను నిరోధించడంలో మరే టూత్‌పేస్టూ దీనికి సాటిరాదు.

(హిందూస్థాన్ లీవర్‌వారి విశిష్ట ఉత్పత్తి.) LINTAS-SG2-23-1710 TL

"రమేష్ లేడు."

"తెలుసు!" దాదాపు రాహుల్‌ను రాచుకుంటూనే లోపలకు వచ్చింది.

లోపలకు వచ్చి తలుపు వేసింది సుమతి.

"ఏం.... ఎందుకు తలుపేస్తున్నావ్?"

సుమతి "అంత భయం ఏమిటి? నేను నిన్ను రేప్‌చెయ్యను లే!" అని నవ్వుతూ కూర్చుంది.

ఛ! ఎలా మాట్లాడుతోంది. ఆడవాళ్ళు ఇలా.... భావన కూడా చాలా ధైర్యంగా మాట్లాడుతుంది. కాని ఆమెలో ఇలాంటి చౌకబారుతనం లేదు.

సుమతి రాహుల్ క్లాసుమేట్! రాహుల్ అంటే ఆమెకు తగని ఆరాధన. రాహుల్ ఆమెను తప్పించుకు తిరుగుతాడు. ఆమె అప్పుడప్పుడు రమేష్‌తో మాట్లాడే వంకతో ఆ ఇంటికి వస్తూ ఉంటుంది. నోట్సు తీసుకుకెళుతుంది.

"ఇదేమిటి? తాగుతున్నావా?"

రాహుల్ గ్లాసులో మిగిలింది గటగట తాగేశాడు.

రాహుల్ ధైర్యంగా ఎదురు కుర్చీలో కూర్చునిఉన్న సుమతిని చూశాడు. మొదటిసారిగా ఆమె కళ్ళల్లోకి చూశాడు. ఆ పెద్దపెద్ద కళ్ళు మదిర నింపిన దొన్నెల్లా ఉన్నాయి అనుకున్నాడు.

ఆ కళ్ళలో ఏదో దాహం ఉన్నది. ఏడారిలో నడిచే బాటసారికి నీరు కన్పించినట్టూ, ఆ బాటసారి ఆ నీటికేసి చూసినట్టూ ఆ కళ్ళు రాహుల్‌ను చూస్తున్నాయి.

సుమతి చిరునవ్వు నవ్వుతున్నది. జడ ముందుకు వేసుకొని వేళ్ళతో కదిలిస్తూ రాహుల్‌ను చూస్తున్నది. నీలం నైలాన్ చీర, అదేరంగు స్లీవ్‌లెస్‌బ్లౌజ్, పెదవులమీద ఎర్రటి లిప్‌స్టిక్-రాహుల్ చూస్తూనే ఉండిపోయాడు.

"ఏమిటి అలా చూస్తున్నావ్?" సుమతి నవ్వుతూ అడిగింది.

"ఏ.... ఏంలేదు. ఎందుకు వచ్చావ్?"

"నీకోసమే! నీకు ఈ అలవాటు ఉన్నదని నాకు తెలియదు."

"నాకు అలవాటు లేదు. ఇవాళే...."

"మొదటిసారి తాగుతున్నావ్! అవునా? కారణం...!"

"ప్లీజ్ అడక్కు."

సుమతి గ్లాసులోకి విస్కీ వంచింది. నీళ్ళు కలిపి అందించింది. "తాగు రాహుల్! బాగా తాగు! నిన్ను నువ్వు విస్మరించేవరకూ తాగు."

"నీ.... నీ కెట్లా తెలుసు?" ముద్దిముద్దిగా అడిగాడు రాహుల్.

"ఏమిటి?"

"నన్ను నేను మర్చిపోవాలనుకుం.... కుం.... టున్నా.... నని."

"నాకు తెలుసు. నేను నిన్ను ఎంతగా ప్రేమిస్తున్నానో నీకు తెలియదు. తెలిస్తే అలా అడగవు." (సశేషం)

Printed and Published by A. Chandra Seker Rao at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-50 001. Editor: A. SUDHAKARA RAO







High power
Surf
washes whitest



ధృతరాష్ట్రుని పీడకల

